





# మహిళలు

## విలువ,ధర్మాలు

# స్త్రీ ధర్మ ప్రదీపిక





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద

గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# స్త్రీధర్మప్రదీపిక

మహాత్మా గాంధీ రచనకు

శ్రీ తత్వానందస్వామి యనువాదము

ది ఓరియంటల్ పబ్లిషింగ్ కంపెనీ (రిజిష్టర్డు)

మద్రాసు :: తెనాలి :: సికింద్రాబాదు

కాపీరైటు ] 1950 [ వెల రు. 1—8—0

# పరిచయం

శ్రీ తత్త్వానందస్వాములు ఆంధ్రలోకమునకు చిరపరిచితులు. పూర్వాశ్రమమునందు, కొండిపర్తి వీరభద్రాచార్యులను నామమున జీవితయాత్ర శాస్త్రవిధి ననుసరించి గడిపినవారలై బ్రహ్మచర్య-గృహస్థాశ్రమముల అనంతరం భార్యావియోగమునొంది, కొన్ని సంవత్సరములు తన యిరువురు పుత్రికలను పెంచి చివరకు ఆబిడ్డలను తన మాతృవశము చేసి చిరకాలమునుండి లోలోన బాధించుచున్న సన్న్యాసాశ్రమ దీక్షను అవలంబించిరి. తమ జీవితయాత్రను ఆశ్రమధర్మానుసరణముగా నలుపు కాలమునగూడ వీరి పరార్థచింత, సేవాతత్పరత, ఆంధ్రభాషాభిమానము మున్నగు గుణపుంజము మిత్రులకేగాక ఆంధ్రలోకమునకెల్ల ప్రసిద్ధిగా తెలిసిన విషయము.

వీరు శ్రీ వివేకానందస్వామిభక్తులు. స్వామివారి యెడల వీరికిగల భక్తియే తుదకు వీరికి పరివ్రాజకాశ్రమము నబ్బచేసినదని చెప్పవచ్చును. స్వామివారి బోధనలను వివరించు తెలుగు పుస్తకముల నేనాడో వీరు రచించిరి.

గృహస్థాశ్రమమునందు వీరికి పెద్దలయందు గల వినయవిధేయతలు, భక్తిగౌరవములు సంస్తవనీయములేగాక అపూర్వపరిమితి, పరిణామము గలిగి యుండెననిగూడ చెప్పగలను. వీరిని పెంచి పెద్దచేసిన మేనమామగారియందు వీరు చూపిన శ్రద్ధాలక్ష్యములు నా ఎఱుకనున్న విషయము. ఆకాలములో అనగా 1916 సం॥ పూర్వమే వీరియందు నాకుగల స్నేహగౌరవములను పెంపొందించిన విషయమది. 8 వత్సరముల చిన్న కుమార్తెను స్వాధీనురాలైన తల్లి వశమున నుంచి, తాను స్వేచ్ఛగా సన్న్యాసాశ్రమమును గైకొనుట నాకట్టియెడ నంతగ రుచింపలేదయ్యె. కాని రానురాను మానవునకు జీవితములో గలుగు సంఘర్షణములు, పోటీభావములు, పగప్రతిరోధకము లగు నుద్రేకములు బాగుగ గోచరమైన కొలది స్వార్థమును విడిచి, స్వకుటుంబాపేక్షను

త్యజించి లోకసేవను చతుర్థాశ్రమమూలమున పూనిన వీరభద్రాచార్యులవారి ఉదాహరణ కేవలము సంస్తవనీయమే కాక అనుకరణీయమైనది గూడ నని అవగాహమయ్యెను.

ఇంక ఈ పుస్తకమునుగూర్చి ఇంతక చెప్పవలెనుగదా! అథమము పాఠకులు పరిచయపత్రికయం దట్టి యపేక్షను తీర్చుకొనగోరెదరు. కాని పరిచయము గ్రంథకర్తకా? గ్రంథమునకా? అను విషయము వివాదాంశము. గ్రంథకర్త లోకవిదితుడైనచో—గ్రంథసమీక్ష అనావశ్యకము. గ్రంథము నూతనమైనచో గ్రంథకర్త యొక్క పరిచయ మనావశ్యకము కాకపోవచ్చును. కాని ఇపుడు అనువదింపబడిన గ్రంథములు గాంధి మహాత్ముడప్పుడప్పుడు స్త్రీల ధర్మములను గూర్చియు, విద్యార్థుల కర్తవ్యములను గూర్చియు వ్రాసిన వ్యాసముల సముదాయము. వీనిని గూర్చి వ్రాయుటకుగాని, అంతకన్న విమర్శించుటకు గాని అస్మదాదుల కధికారములేదు. శ్రీ తత్త్వానందస్వాములవారికే అట్టి యధికారము కలదు. ఏతదధికారము ననుసరించియే వీరు ఈ వ్యాసములను తెనిగించుట తటస్థించినది. స్వామివారి భాషాపాండిత్యప్రకర్షనుగూర్చి చెప్పవలసినపనిలేదు. స్వామివారీ గ్రంథము నాంధ్రుల కందజేసి వీరి కృతజ్ఞతకు పాత్రులయిరి. అట్లే స్వామివారి యొక్కయు, వారి గ్రంథము యొక్కయు పరిచయ మాంధ్రులకు గల్గించు భాగ్యము నాదైనది.

ఢిల్లీ, 19 కానింగులేన్ 10—1—48 (Sd.) భో. పట్టాభిసీతారామయ్య

# పీఠిక

జీవన చక్రము గిఱగిఱ తిరుగుచుండును. అందొక యంశమగు నరజీవనము పరివర్తనము సాగించుచు నెగుడుదిగుడగుచుండును. దాని నప్పుడప్పుడు సవరించి సవ్యమార్గమున నిలుపు టవసరమగును. ఇటుల చేయుటలో సంస్కర్తలు రెండు భిన్నమార్గముల నవలంబించుట గోచరించుచున్నది. వెనుకచూపు లేకుండ, జరిగిపోయినదేమో జరిగిపోయినదని చెప్పి దానిగొడవ నెత్తికొనకుండ సరిక్రొత్త పోకడల నెలకొలుపుట యొకటి. 'మార్పెమో అవసరమే. జాగు చేయుటకును వీలులేదు. పూర్వమేమి జరిగిన నేమి, వర్తమానకాలమున లోకమునందు ప్రోన్నతిగాంచి వెలుంగుచున్న జాతులవారు గోచరించుచున్నారు గదా! వారి యాచార వ్యవహారముల ననుసరించుట లెస్స' యని వాదించు యువజనులు కలరు. 'పూర్వాపర-చింతలేకుండ ప్రపంచమున నేమి చేయుటకును సాధ్యము కాదు. నేలవిడిచిన సాము పోలిక యగును. ప్రాచీన వ్యవస్థల యాధారములేనిది వర్తమాన కాలచరిత్రను సవరింపజాలము. కార్యకారణ సూత్రబద్ధమై విశ్వము నడుచుచున్నది,' అని వాదించు వృద్ధులు కలరు.

మొదటి రకమువారు గమనవేగమునే పాటించుచున్నారు. కొంతదూరము పోగా చిక్కులేర్పడుచున్నవి. అక్కడనుండి క్రొత్త పుంతల ద్రొక్కుచున్నారు. గమ్యము కొలది దూరమున నున్నట్లు కాన్పించుచుండును. మార్గమును సరళముగ నున్నట్లే తోచును. కాని వాస్తవిక గమనమునందు తిరుగుళ్ళు తటస్థించుచున్నవి. వీరెంతయు సదుద్దేశముతో వర్తించుచున్నారనుట నిర్వివాదము.

రెండవ తరగతివారు గమనవేగమును సాగింపలేమని జాగుచేయుచున్నారు. పురోగమనము చేయునవసరమును గుర్తించుచునే యున్నారు. అటులచేయక యున్నచోటుననే నిలిచి యాలోచించుదమనిన నది సాగక వెనుకకు నెట్టబడునట్లు తెలిసి విచారపడుచున్నారు. వీరికి ముందుత్రోవ చిక్కులతో నిండి గోచరించుచున్నది. నిరాశాపరులగుచున్నారు. కాని నిరంతరగమ

నము పాలించు ప్రకృతి యాగునా? ఎల్లఱను ముందునకో వెనుకకో నెట్టుచున్నది. తొట్రుపడుచు వీరు ఆక్రోశించుచున్నారు.

భారతభూమియందీరెండు తెగలవారు పడు తిప్పలు ప్రస్ఫుటముగ గోచరించుచున్నవి.

మొదటి తెగకు ప్రతినిధు లనదగిన విద్యార్థులు పాశ్చాత్య విద్యల గఱచి యుద్యోగముల కెగబ్రాకుచున్నారు. వ్యక్తిస్వాతంత్ర్యమునుబూని ధనరాసుల గడించి యిచ్చవచ్చిన తీరున సుఖభోగముల ననుభవింపవలయునని యువ్విళ్ళూగుచున్నారు. విద్యలకై దోసిళ్లాది ధనమును గ్రుమ్మరించుచున్నారు. బీదలై యా ధనమును చేకూర్పజాలని తలిదండ్రులను, పోషకులను పీడించువారగుచున్నారు. పరభాషలో చదువు నేర్వవలసి వచ్చుటచేత బుద్ధివికాసము లభించుటలేదు. వక్రోపాయములచేత నైనను యోగ్యతాపత్రముల గడింపబూని యిక్కట్టుల పాలగుచున్నారు. ఉత్తీర్ణులైనవారికిని తగినన్ని ఉద్యోగములు చిక్కుటలేదు. నిరుద్యోగులు తమ కుటుంబములకును, దేశమునకును భారమై తోచుచున్నారు. పేదదై యున్న మాతృదేశము నింకను పేదదానిగా నొనరించిన దోషఫలము ననుభవించుచున్నారు.

ఉద్యోగములలో జొరబడినవారికి సంపాదన చాలుటలేదు. లంచములకు చేజాచుచున్నారు. వీరికేవి సమకూర్చి పెట్టినను పేదదగు భారతజాతియేగదా! మొన్నటివరకు దేశపరిపాలనమును నడిపిన విదేశీయులు నిర్విచారముగా ప్రజల నుండి ధనమును దోచి తాము, తమ క్రింది యుద్యోగిగణమును పంచుకొనెడివారు. వారిచే శిక్షితులైనవారో, వారిపంథానే యింకను ననుసరించువారేయై యున్నారు. ఇప్పటియుద్యోగులు మాకు జీతములు హెచ్చుకావలెను; భత్యములు పెంపు కావలెను అని గగ్గోలు పెట్టుచున్నారు. సమ్మెల గట్టుచున్నారు. పొడుగుగోసి పాలుద్రావగోరువారై విఫలత నొందుచున్నారు. వీరు గోరు ధన మెవరివలన లభించును? ఆ ప్రజలు నేడు ప్రభువులే యైనను కడుదీనులుగ నున్నారు. వీరి సేవచేయు నేర్పును గడించుటే విద్యార్థుల ధర్మమైయున్నది. ఆ సేవల నర్పించుటే యుద్యోగులకు విధి.

ఇది యిట్లుండ సాంసారికవిషయములగూడ యువకులకును పెద్దలకును పొత్తు కుదురుటలేదు. సుఖభోగములకై ఆతురపడు యువజనము సర్వస్వతంత్రులు కాగోరుచున్నారు. సమష్టి కుటుంబవ్యవస్థలను భిన్నము చేయుచున్నారు. పెండ్లిండ్లసందర్భమున స్వేచ్ఛానురాగసూత్రమును ప్రతిపాదించుచున్నారు. పెక్కు బాధలు పడుచున్నారు. ఆహారవిహారములందు హద్దుమీరి కుందుచున్నారు. విమర్శదృష్టితో చూచునెడల వీరిపోకడలును సహజము లనక తీరదు.

రెండవ తెగవారగు పూర్వాచారపరాయణులు నూతన పరివర్తనమును పాటింప తిరస్కరింతురు. కాని, ఆపడవలోనే ప్రయాణము చేయుచు వేఱుదిశ కెట్లు పోగలరు? తమ సంతానమునకు ఆధునికవిద్యల జెప్పించినవారు తాము; విషమసహవాసముల గూర్చినవారు తాము; ప్రతికూల జీవితాదర్శముల జూపినవారు తాము; సంప్రదాయభంగకరములగు శిక్షణలకు లోనుజేసినవారు తాము; నిరాడంబరజీవనగతుల భంగపఱచుటకు బాధ్యులు తాము. అట్టి తామిప్పుడు శాపనార్థములకు బూనిన ఫలమేముండును?

పూర్వాపరములకు సఖ్యత చేకూర్చి, ప్రాచీనసంస్థలు భగ్నము కాకుండ, నైతికపతనము వాటిలకుండ శాంతిమయ నిరాడంబరజీవనపంథాను జూపి జాతిని సంరక్షింపగల మహనీయుని సద్బోధ లీ కాలమున నెంతయు వాంఛనీయములు. ఆబోధలు సులభాచరణీయములుగ నుండవలయును. వినిర్మల ప్రేమపూరిత హృదయమునుండి వెలువడు నుపదేశములుగ నుండవలయును. ఆయుపదేశముల గావించునతడు, తా నాచరించి చూపువాడుగా నుండవలయును.

అదృష్టవశమున అటువంటి మహాపురుషుడు మనకు లభించియున్నాడు. విశ్వాసపాత్రుడని భారతీయు లెల్లరు మనస్ఫూర్తిగ నొప్పుకొనుచున్నారు. ప్రపంచమునందలి సకలసమాజప్రజలును వానిసరళస్వభావమును మెచ్చుకొనుచున్నారు. కాని లోకమునందలి ప్రస్తుత వాతావరణమును మార్చుకొనకుండ ఒకింత త్యాగమును చేయకుండ, స్వార్థపరతను కొంత తగ్గించుకొనకుండ వాని బోధల నవలంబించుట కష్టమనుచున్నారు. సత్యమే, ఈనాడు

నరసమాజము నలముకొనిన చిక్కులనుండి తప్పించుటకు, వారి యిక్కట్టుల బాపుటకు, నీతి దప్పకుండ శాంతి మయజీవనము నలవఱచుటకు అర్హుడగు వాడతడే.

అతడే గాంధీజీ !

పెక్కువత్సరములనుండి గాంధీజీ వ్యాసములను 'యంగ్ ఇండియా' లోను హరిజన పత్రికలోను, తదితర పత్రికలలోను చదువుచుంటిని. ఆనందించు చుంటిని. దానిని తెలుగు భాషలోని కనువాదముచేసి ఆంధ్రసోదరులకు నివేదించు కుతూహలముతో చాలకాలమునుండి ప్రయత్నించుచు నేయుంటిని. ముందు జాతీయనాయకులు కాగలవారును జాత్యభ్యుదయమున కాధారులు నగు విద్యార్థులు స్త్రీలు గ్రహింపదగినవానిని అనువాదము చేయ మొదలిడితిని. మధ్యమధ్య కొన్ని అంతరాయము లేర్పడుచు వచ్చినవి. ఇంతలో ఆనంద టి. హింగోరాణిగారిచే TO THE STUDENTS, TO THE WOMAN అను రెండు సంపుటములుగ ప్రకటించిన పుస్తకములు చూచుట తటస్థించి నది. నా యుద్యమమునకు పునఃప్రేరణ గల్గినది. ఆ పుస్తకములును నాకు చాలగ తోడ్పడినవి. వారికి నా వందనములు. నే నేర్చికూర్చిన వానికిని, హింగోరాణిగారి కూర్పునకును కొలదిగ భేదము కలదు. గాంధీజీయొక్క యీవ్యాస భాగములను పఠించు నెల్లరకును తమ కర్తవ్యమేమొ సుస్పష్ట మగుటేగాక, వారికి సర్వవిధముల ప్రోత్సాహోన్నతి కలుగ గలదు. గాంధీజీ వాఙ్మయమును తెలుగులో ప్రకటింప కుతూహలముతోనున్న, శ్రీ ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మగా రత్యంతోత్సాహముతో నే ననువదించు గాంధీజీ రచనలనెల్ల ప్రకటింతు మనుటేగాక శ్రీ కస్తూరిబా నిధి, హరిజనసేవకనిధి మున్నగు వానికి నా ద్వారమున విరాళములు చేకూర్చుటలో తోడ్పడినం దుకు వారికి నావందనములు. కాగితపుకంట్రోలు, రేషనింగులు మున్నగు నవరోధములమూలాన వీని ప్రకటనయం దమితమగు నాలస్యమైనది. పరిచయ వాక్యముల రచించియిచ్చిన సోదరుడు శ్రీ భోగరాజు పట్టాభిసీతారామయ్య పంతులుగారియెడ నెంతయు కృతజ్ఞుడను.

17—1—48

తత్వానంద

# తొలి పలుకు

శ్రీ గాంధీమహాత్ముడు యుగపురుషుడు. హిందూదేశమున జనించినను సర్వప్రపంచమునకును మార్గదర్శకుడు కాగలడు. హిందూమతము నాశ్రయించువా డయ్యును సకలమతసిద్ధాంతములును సత్యములే యని నమ్మించు ప్రవక్త. ఆయన కర్మక్షేత్రములు పెక్కులు, పారిశ్రామికుల కష్టనిష్ఠురములు, వ్యాపారుల వర్తకపువిధానములు, రాజకీయ ప్రణాళికల మర్మములు, సంఘసంస్కర్తల చిత్తవృత్తులు, విద్యాప్రచారకుల పోకడలు, మతధర్మోపదేశకుల యుక్తులు నన్నియు నాయనకు గరతలామలకములు. ఎల్లరకును దగిన సలహాల నీయగల సమర్థుడు. పక్షపాతబుద్ధిగాని, స్వార్థచింతగాని వాని దరిజేర జాలవు. జాతి, మత, వర్ణ, దేశభేదములకు లోబడక నంతర్వాణి మహాపంథా ననుసరించుచు విశ్వమున కెల్ల మిత్రుడై మెలగువాడు.

శ్రీ గాంధీజీ ప్రచురణములు పత్రికలయందేమి, ప్రత్యేక గ్రంథముల యందేమి, యుపన్యాసములయందేమి ఎన్నెన్ని విషయముల ప్రమేయము గలవియో గణించుట శక్యముగాదు. ఆయన వ్యాసములు మున్నగువానినుండి ప్రత్యేకముగ గొన్ని కొన్నింటిని వేఱుచేసి, యేర్చికూర్చి, తెలుగున ననువదించి వేర్వేఱు గ్రంథముల రూపమున ప్రకటింపవలయునను సంకల్పము నాకు చాలకాలముక్రిందట కలిగినది. కొంత ప్రయత్నము జరిగినది. కాని చురుకుగ సాగినది కాదు. కొంతకాలము క్రిందట 'వార్ధా విద్యావిధాన' మను పేరిట నొకపుస్తకమును తెలుగున ప్రచురించితిని. తదుపరి యట్టి కార్యకలాపము మందగించినది. ఇటీవల శ్రీ ఆనంద టి. హింగరాణిగారు ప్రకటించిన శ్రీ గాంధిగ్రంథమాలను చూచితిని. నా వెనుకటి కోరిక మఱల రేకెత్తినది. మిత్రులును ఆలాటిగ్రంథములను ఆంధ్రానువాదమున ప్రచురింపు మని యొత్తిడి సాగించిరి. తదనుగుణ్యముగా 'విద్యార్థిధర్మప్రకాశిక' 'స్త్రీధర్మప్రదీపిక' యను శీర్షికలతో శ్రీ గాంధీజీ వ్యాసావళిని భాషాంత

రీకరించి రెండు గ్రంథములుగ కూర్చితిని. ఈ ప్రయత్నమున శ్రీహింగ రాణిగారి గ్రంథములు చాలగ సాయపడినవి. వారికి నా కృతజ్ఞతను తెలుపు చున్నాను. అయినను ఆయన గ్రంథములను యథాతథముగ ననుసరింపజాల నైతిని. నూతనాంశములను కొన్నింటిని చేర్చితిని. కొన్నిటిని విడచితిని. విషయ సూచిక వరుసను గూడ మార్చితిని. శ్రీ హింగ రాణిగారివలన నా పూర్వపు టుద్దేశము కొంత కార్య రూపము దాల్చినదనవలయును.

నా రచననుగూర్చిగాని, యనువాదసరణినిగూర్చిగాని యేమని చెప్పుకొనుట నా పని గాదు. ఆంగ్ల భాషలో నట్టి గ్రంథముల జదువుకొన శక్తిలేని ఆంధ్ర సోదరులకు నా పుస్తకము లిసుమంత సాయపడగల్గుచో సంతసించెదను.

ఇట్లు

తత్త్వానంద

# విషయసూచిక

# స్త్రీధర్మప్రదీపిక

## వివాహాదర్శము

వివాహ సమయమున నూతన వధూవరులగూర్చి చేయబడిన హితబోధ

మన విధాయకకృత్యములంగూర్చి యజ్ఞానమును మనయందు ప్రేరేపించు నంతవరకేతప్ప అంతకుమించి కర్మకలాపముల యందు నాకు విశ్వాసము లేదని మీ రెఱుగుదురు. నేను స్వతంత్రముగ నాలోచింప మొదలిడిన కాలమునుండియు నాయందా భావము నెలకొనియున్నది. మీరు పఠించిన మంత్రములు, మీరు తీసికొనిన ప్రమాణములు అన్నియు సంస్కృతభాషలో నున్నవి. కాని, అవి మీ కొఱకై (మీ మాతృభాషలో) యనువదింపబడి యున్నవి. మన మెట్టి ప్రభావమున మెలగ నిచ్ఛగింతుమో అట్టి మహిమ సంస్కృతశబ్దములకు గలదని యెఱుంగుట వలన మనము సంస్కృత మంత్రములనే వాడుకొనుచుంటిమి.

ఆ క్రతుకాలమున వరుడు ప్రకటించిన యీప్సితములలో తన వధువు యోగ్యుడగునట్టియు, నారోగ్యవంతుడగునట్టియు కౌమారునికి తల్లియగుగాక యనునది యొకటి. ఆకోరిక నన్ను బాధించుట లేదు. సంతానము కనితీరవలయునని దాని యర్థము కాదు. కాని, సంతానమును కోరునెడల ధర్మనిర్ణీత మనెడు భావముతో వివాహము చేసికొనుట ముఖ్యమనియే తేలు

చున్నది. బిడ్డల గోరనివాడు వివాహమే చేసికొన నక్కఱ లేదు. కామవాంఛా నివృత్తికొఱకగు వివాహము వివాహమే కాదు. అది వ్యభిచారము-జంకుతనమే. కాబట్టి సతీ పతు లిరువురికి సంతానము కావలయునను కోరిక విస్పష్టముగ కలిగి నప్పుడు మాత్రమే, సంభోగక్రియ అంగీకారమగునని నేటి క్రతువుసకర్థము. నా యభిప్రాయ మెంతయు పరమమైనది. కావున ఆ కార్యము దైవధ్యాన పూర్వకముగా జరుగవలసి యుండును. ఇంద్రియలోలతకును, విషయానందమునకు నుపక రించునట్టి వధూవరుల పూర్వసాహచర్యముయొక్క మర్యాద యిందు లేదు. పునస్సంతానాపేక్షయుండిన తప్ప, అట్టి సంభో గము జీవితకాలములో నొక్కసారి మాత్రమే అంగీకార మగును. నైతికముగను, కాయికముగను ఆరోగ్యవంతులు కానివారు కలియుట యేతగదు. వారు కలిసిన నది వ్యభిచారమే యగును. వారు అంకుచేసినట్లే యగును. పశువాంఛానివృత్తికై వివాహ మేర్పడిన దనెడు పాఠమును మీ రిదివరలో నేర్చి యుండినయెడల, దానిని మఱచిపోవలసి యున్నది. ఈ క్రతువు సర్వమును పవిత్రాగ్నిసన్నిధిని జరిగినది. ఈ యగ్ని మీలోని కామము నెల్ల భస్మీభూతము చేయుగాక!

ఈ కాలములో విచ్చలవిడిగా ప్రచారము గాంచుచున్న పెఱొక మూఢవిశ్వాసమునుండి మీరు దూరులై యుందురు గాక యని నేను కోరుచున్నాను. నిగ్రహమును-బ్రహ్మచర్య మును బూనుట దోషమనియు, సంభోగవాంఛను నిరాఘాట ముగా తృప్తిపఱచుకొనుటకనియు, స్త్రీపురుషజాతి స్వేచ్ఛాను రాగము ప్రకృతిసిద్ధధర్మమని వాదింపబడుచున్నది. ఇంత

కంటె వినాశకరమగు దుర్బోధ యుండబోదు. మీరు పరమార్థ దూరులు కావచ్చును. స్థూలముగా మీరు దుర్బలురు కావచ్చును. ఆ కారణముచేత పరమాదర్శమును క్రిందు చేయకుడు. అధర్మమును మీ ధర్మముగా నవలంబింపబోకుడు. మీబుద్ధి చలించు సమయమున నామాటలను స్మరించుడు. ఈ పవిత్ర క్రతువును స్మరింతురేని యది మిమ్ము సుస్థిరుల గావించి నిగహశీలురుగ నొనర్పగలదు. వివాహము యొక్క యుద్దేశ్యమే ఆత్మనిగ్రహము. కామవాంఛనుండి పవిత్రుల గావించుటయే వివాహ ముఖ్యోద్దేశ్యము. వేఱొక యుద్దేశ్యముండునెడల వివాహక్రతువు పావనకర్మయే కాజాలదు. సత్సంతానార్థముగాని వివాహము పవిత్ర క్రతువుగా నెన్నదగదు.

మీరు మిత్రులుగను, సములుగను పాణిగ్రహణము చేయుచున్నారు. పతి దేవుడగునెడల సతి దేవి యగుచున్నది; ఒండొరు లొకరిపై నొకరు ఆధిపత్యము బడయుచున్నారు. ఒండొరు లొకరియెడ నొకరు సాహచర్యధర్మము వూనుచున్నారు. జీవితధర్మములను, కర్మములను నిర్వహించుటలో నొండొరు లొకరితో నొకరు సహకారము సలుపవలయును. ఓ బాలకులారా! నేను మీకు చెప్పునది యేమనగా, మీకు శ్రేష్ఠతమమగు బుద్ధులున్నచో ఘనతమమగు భావములున్నయెడల, వానిని బాలికలకు పంచియిండు. వారికి సద్గురువులును, మార్గదర్శకులు నగుడు. వారికి సాహాయ్యము చేయుడు. వారిని సన్మార్గమున నడుపుడు. కాని యెన్నడును అవరోధముల గల్పింపకుడు. పెడత్రోవలకు ద్రిప్పకుడు. మీమధ్య

మనస్సునందు, వాక్కునందు, చేతయందును సమరస భావ మమతుగాక. ఒండొరులకు దెలియకుండ రహస్యములనుంచు కొనకుడు. ఇరువు రొక్క యాత్మయై పలుగుడు. కపటవేషధారులు కాకుండుడు. అసాధ్యములగు పనులపూనుకొని వ్యర్థముగ మీ యారోగ్యమును భగ్నము చేసికొనకుడు. బ్రహ్మచర్య మెన్నడు నారోగ్యభంగకరము గాదు. ఆరోగ్యమును భంగము చేయునది బాహ్యమగు నిరోధమే గాని, బ్రహ్మచర్యము కాదు. నిజముగా బ్రహ్మచర్యమును బూనిన మనుజుడు ప్రతిదినము నధికాధికముగా బలము గలవాడగుచుండును. అధికాధికముగా శాంతిని బడయుచుండును. బ్రహ్మచర్యమున మొదటి మెట్టు సంకల్ప నిగ్రహము. మీకు గల పరిమితులను గ్రహించుడు. మీరు చేయగల్గినదానినే చేయుడు. నే నాదర్శమును మీ యెదుట బెట్టుచున్నాను. అదియే సరియైన దృక్పథము. ఆ దృక్పథము నవలంబించుటకు మీకు చేతనైనంతవరకు ప్రయత్నించుడు. మీ రపజయము నొందినను విచారపడుటకు గాని, సిగ్గుపడుటకు గాని కారణముండదు. ఉపనయనకర్మ ఎట్టి యాత్మార్పణమో, ఎట్టి నూతన జన్మప్రదమో వివాహక్రతువుగూడ నట్టియాత్మార్పణమే, అట్టి నూతన జన్మప్రదమని క్లుప్తముగా మీకు వివరించియుంటిని. నేను చెప్పినది మీకు భయమును కలిగించుటకుగాని, మిమ్ము దుర్బలుర జేయుటకుగాని హేతువుకాకుండుగాక! వాక్కాయకర్మములందు సమరసభావము గలిగి వర్తించుటకై సదా ప్రయత్నించుడు, నిరంతరము భావశుద్ధియే లక్ష్యముగ బెట్టుకొనుడు. సర్వమును దానంతనదియే చక్కబడును. సంకల్పమునకు

మించిన ప్రభావము గల దింకొకటిలేదు. చేత మాట ననుస రించును. మాట తలంపు ననుసరించును. ఈ ప్రపంచమే యొక మహాసంకల్పము యొక్క సృష్టియై యున్నది. ఎచ్చోట సంక ల్పము పటిష్ఠమును, పవిత్రము నైనదిగ నుండునో, అచ్చట ఘటిల్లు ఫలము సయితము పటిష్ఠమును, పవిత్రము నైనదిగా నుండును. ఘనమగు నాదర్శమనెడు కవచమునుధరించిముందుకు సాగిపొండని నేను మిమ్ముల కోరుచున్నాను. అప్పుడు ప్రలోభ మేదియు మీదరికి రాదు. మాలిన్యమేదియు మిమ్మంట జాలదు.

మీకు వివరించి చెప్పబడిన ఆ యా కర్మ కలాపములను జ్ఞప్తి నుంచుకొనుడు. మధుపర్క మనెడు నిరాడంబర మగు కర్మను గమనించుడు. ప్రపంచ మంతయు మధువుతో నిండి యున్నది. ఎల్లెడల మకరందమే తేనెకురియుచున్నది. మీగత లోక మంతయు దానిని గ్రోలినపిమ్మట, మీ రద్దానిని గ్రాపు దురుగాక! అనగా, వైరాగ్యభావపూర్వకముగా మీరు భోగ ముల గాంతురుగాక !

"కాని సంతానకాంక్ష లేనిచో, వివాహమేయుండజనదా" అని యొక వరుడు ప్రశ్నించెను.

ఎన్నటికి నుండదు. 'ప్లేటోనిక్' వివాహములందు నాకు నమ్మ కము లేదు. కొన్ని యరుదగు సందర్భములందు సంభోగార్థ ముగాక, కేవలము స్త్రీ రక్షణకొరకు పురుషులు స్త్రీలను పరిణయమగుట వినియున్నాము. కాని, అట్టిసందర్భములు మిక్కిలి యరుదుగా నుండును. నిష్కళంకగృహస్థజీవనమును

గుఱించి, నేను వ్రాసియున్నదానినెల్ల మీరు చదువవలయును. నేను మహాభారతములో జదివిన విషయ మనుదినము నా విశ్వాసమును బలవరచుచున్నది. అందు వ్యాసులవారు 'నియోగమును'గావించినటుల వర్ణింపబడియున్నది. ఆయనను సుందరాకారుడని వర్ణించియుండలేదు. వికార స్వరూపిగ కూడ వర్ణించి యున్నారు. వాని యాకారము భయంకరముగ నున్నటుల తెలుపబడి యున్నది. ఆయన శృంగార చేష్టల సాగించి యుండలేదు. సంభోగమునకు బూర్వము శరీరమెల్ల నేతితో నలదుకొని యున్నాడు. ఆయన భోగించినది కామతృప్తికొఱకుగాదు. సంతానార్థము. పుత్రకాంక్ష పూర్తిగా ప్రకృతిసిద్ధమైనది. ఆ కాంక్ష యొకసారి తృప్తి పడెనా ఇక సంకభోగ ముండజనదు.

ప్రథమపుత్రుని 'ధర్మజుడ'నియు - అనగా ధర్మ నిర్వహణార్థము పుట్టిన వాడనియు, తదనంతరము పుట్టిన బిడ్డలను 'కామజు' లనియు-అనగా కామఫలముగా పుట్టిన వారనియు మనువు వర్ణించియున్నాడు, ఆ రీతిగా కామశాస్త్రము నెల్ల సంగ్రహించి తెలిపియున్నాడు. మఱియు, దేవుడనగా శాస్త్రమేగదా! కావున దేవునియెడ విధేయత జూపుటనగా శాస్త్రానుగుణ్యముగా వర్తించుటే. "ఎవ్విధమునను నేను శాస్త్రము నతిక్రమింపను" అని మీచే ముమ్మారు పలికించి రనుటను మఱువకుడు. శాస్త్రము ననుసరింప సిద్ధపడి యున్న స్త్రీ పురుషులు కొలదిమంది యున్నను శూరులును సత్యసంధులునగు స్త్రీ పురుషులు వెలయుజాతి మనకు లభింప [illegible]

నేను కస్తూరిబాను కామదృష్టితో జూచుట మానుకొనిన పిమ్మటనే నా గృహస్థజీవన మానందప్రద మైనదని జ్ఞప్తి నుంచుకొనుడు. నేను మంచి తరుణవయస్సులో నారోగ్య వంతుడనైయుండి, మామూలుగాచెప్పుకొనునట్టి సంసారజీవన మునకు తగిన సిండువయస్సులో నుండగనే బ్రహ్మచర్య దీక్షనుపూని యుంటిని. మీ యందజీవలెనే యొక పవి త్రోద్యమముకొఱకై నేనును జనించియుంటినని తళుక్కుమని నాకు తెలియవచ్చినది. నాకు వివాహమైనప్పు డీవిషయము తెలియదు. కాని, నాకు బుద్ధి దెలిసినప్పుడు, నే నేల పుట్టి యున్నానో అట్టి పవిత్రోద్యమమునకు నావివాహము లోబడి యుండునదియే యని గ్రహించితిని. అప్పుడే నిజముగా నా యథార్థధర్మమన నెద్దియో నేను తెలిసికొంటిని. ఆ దీక్షను మే మిరువురము తీసికొనిన యనంతరమే మా జీవితములందు సత్యమగు నానందము చూపట్టినది. కస్తూరిబా బక్కగా కాన్పించునదైనను, మంచిశరీరదార్ఢ్యము గలది. ఉదయము మొదలు రాత్రివఱకు పాటుపడ గలదు. ఆమె నా కామము నకు గుఱియైయే యున్నయెడల నటుల పనులు చేయగలిగి యుండెడిదే కాదు.

ఐనను కొన్ని సంవత్సరములవఱకు నేను సంసారజీవన మును గడపియుండినవాడనను నరకములో నేనాలస్యముగా మేల్కొనినవాడననియే చెప్పవలయును. సకాలమున మేల్కొలుపు బడయుటవలన మీరు చాలి సదృష్టవంతులే. నేను వివాహము చేసికొనిన తరుణమున పరిస్థితు లెంత చెడుగా నుండగలవో అంత చెడుగా నున్నవి. మీ సందర్భమునన్నో,

అవి యెంత శుభప్రదముగ నుండగలవో అంత శుభప్రదముగ నున్నవి. నాకును నొకటి లభ్యమైనది. సత్యమనెడు కవచమే అది. అది నన్నుగాచి రక్షించినది. సత్యదీక్ష నా జీవితమునకు మూలాధారమై నిలిచినది. ఆ సత్యము నుండి బ్రహ్మచర్యము, అహింస పుట్టుకొనివచ్చినవి. కాబట్టి, మీరేమి చేసినను మీ యెడలను, లోకము నెడలను సత్య సంధులై వర్తించుడు. మీ సంకల్పములను మఱుగుపరచకుడు. వానిని బయట పెట్టుట సిగ్గుచేటగుచో, వానిని సంకల్పించుట యింకను సిగ్గుచేటగును!

## ఆచార ప్రాబల్యము

ఒక మిత్రు డిట్లు వ్రాయుచున్నాడు:

"సుమారు రెండున్నర సంవత్సరముల క్రితము, ఈ నగరమున నొకానొక సాంఘికసంబంధమగు ఘోరసంఘటనము జరిగి యెల్లర నూపివేసినది. ఒక వైశ్యునకు పదునారేండ్ల కొమార్తె గలదు. ఆబాలికయొక్క మేనమామ యిరువదియొక్క సంవత్సరముల వయస్సుగలవాడు. ఆ నగరమందలి కళాశాలలో చదువుకొను చుండెను. రహస్యముగ వారొండొరులను మోహించుకొనిరి. ఆబాలిక గర్భవతి యైనది. తుదకాసంగతి యంతయు వెల్లడికాగా, వారిరువురును విషముద్రావి యాత్మహత్య గావించుకొనిరి. ఆబాలిక తత్క్షణమె మరణించినది. కాని, యాబాలుడు రెండుదినముల పిమ్మట వైద్యాలయములో మరణించినాడు. ఆవిషయమునుగూర్చిన వివాదము తుపానువలె చెలరేగినది. అందటినోళ్ళ ఎకసక్కెములు సాగినవి. తుదకు శోకాకులితులగు నాదురదృష్టబాలికయొక్క తలిదండ్రులు నగరములో కాపురముచేయుట దుర్ఘటమై పోయినది. కాలక్రమమున తుపానుచల్లారినది. గాని యాసంఘటన ప్రజలమనస్సులలో నింకను జ్ఞప్తియున్నది. అటువంటి ప్రసంగములు సాగినప్పుడెల్ల అప్పుడప్పుడా విషయము కలత పెట్టుచుండును. ఆతుపాను మిక్కుటమై రేగినకాల

మున నా దురదృష్టపు క్రియలగూర్చి యెవరును రహస్యముగ గూడ బలుక కుండిన సమయమున, పైసందర్భములలో నాయువక ప్రియుల నిష్టాను సారము పోనిచ్చియుండవలసినది యని నేను పలుకుట ప్రతివారికిని ఘోరము గ దోచినది. నా వాక్కు అరణ్యరోదన మైనది. ఈ విషయమున మీ యభిప్రాయమును దెలుపుడు.''

ఆ తగాదాను మఱల పైకిదీసి ప్రాతవడిపోయిన పుండును రేపినట్లగునని చెప్పి, ఈ విలేఖరి కోరికప్రకారము వాని పేరును, ఊరును తెలుపుట మానుచున్నాను. ఎట్లైనను ఈ విషయమును గుఱించి బహిరంగచర్చ యవసరమేయని నేననుకొనుచున్నాను. ఒక్కొక్క సంఘములో నిషేధింపబడిన యీ రీతి వివాహము లోకానుసారిగా గాని, యొకానొక వ్యక్తి యొక్క యిచ్ఛానుసారము గాని అంగీకారము బడయజాలవని యభిప్రాయపడుచున్నాను. మఱియు నట్టి వివాహములను చేసికొనగోరు యువకుల చర్యను బలాత్కారముగా నరికట్టుటకు గాని, తమ యిచ్ఛకు వారిని బలాత్కారముగా బంధించుటకు గాని సంఘమునకును, వధూవరులకును బంధువులకు నేలాటి యధికారము నుండదు. విలేఖరి తెలిపిన సంఘటనయం దిరుపక్షముల వ్యక్తులును పూర్తిగ యుక్తవయస్సు వచ్చినవారలే. వారు తమవిషయము దామాలోచించుకొనగలవారలే. వారి కిష్టమున్న చోప్పున వివాహమాడకుండ బలాత్కారముగా నడ్డుపెట్టుట కెవరికి నెట్టియధికారమును లేదు. అంతగా సంఘమేమన్న చేయదలచుచో వారివివాహమును పాటింప నిరాకరింపవచ్చును. కాని, వార లాత్మహత్య చేసికొను నంతటి ఘోరదురవస్థ తెచ్చిపెట్టుటకు మించిన దౌర్జన్య ముండదు.

వివాహములగూర్చిన నిషేధములు విశ్వజనీనములుగ లేవు. అవి చాలవఱకు సాంఘికాచారమునుబట్టి యుండును. అట్టియాచారములు ప్రతి రాష్ట్రమునందు, వివిధశాఖలందు సయితము భిన్నముగ నున్నవి. కాని, యిట్లనుటవలన యువజనులు సుస్థిరములగు నాచారములను, నిషేధములను నిర్లక్ష్యముచేయదగునని యర్థముకాదు. వారిటుల చేయబూనుటకు బూర్వము ప్రజాభిప్రాయమును తమ వైపునకు మరలించుకొన ప్రయత్నింపగ వలయును. ఈలోపున అందుకు సంబంధించిన వ్యక్తులు సరియైన సమయమునకై వేచియుండ వలయును. లేదా సంఘబహిష్కారఫలమును శాంతముగను, నిశ్చింతతోడ నెదుర్కొనవలయును.

ఐనను, సంఘాచారములను నిర్లక్ష్యము చేయునట్టియు లేక భంగము చేయునట్టి వారలయెడ నిష్కరుణతో సవతితల్లి వైఖరి వూనకుండుట సంఘమునకు విధియే. ఈ విలేఖరి వివరించిన సందర్భమునందు, దా వార్తయే సత్యమగు నెడల, నా యువకద్వయమాత్మహత్య చేసికొను నంతటిస్థితికి దెచ్చిన పాపము సంఘముమీద తప్పక యుండును.

---

## విధి నిషేధములు

ఒక మిత్రు డిటుల వ్రాయుచున్నాడు:—

“ఇప్పటి ‘హరిజన సేవక’ పత్రికయందలి ఒక ధర్మసందేహము’ అనెడు వ్యాసములో మీరిట్లు వ్రాసితిరి: ‘వివాహనిషేధములలో ననేకము సంఘాచారముల ననుసరించి పుట్టుకొని వచ్చినట్లు కాన్పించుచున్నవి. అవెచ్చటను

జీవధర్మము ననుసరించి గాని, నైతికసిద్ధాంతము ననుసరించి గాని, ఆధ్యాత్మికసూత్రము ననుసరించిగాని యేర్పడినట్లుతోచదు. గర్భాధాన ఫలితార్థముల విచారించి యీ నిషేధముల నేర్పరచి యుందురని నా ప్రాకృత బుద్ధికితోచుచున్నది. సపిండుల కలయిక వలన గలిగిన సంతానమునకన్న దూరస్థుల కలయిక వలన గలిగినసంతానము పుష్టికరంతముగ నుండుననుట సుప్రసిద్ధగర్భధారణశాస్త్రసిద్ధాంతముగ నున్నది. ఆహేతువుచేత సగోత్రికులు, సపిండులు వివాహములు చేసికొనదగదని హిందూమతము నిషేధించు చున్నది. అటులగాక, నానారీతుల మార్పులతోనున్న సాంఘికాచారముల ననుసరించి మాత్రమే ఈ నిషేధములయొక్క విచారణకు బూనితిమేని, అన్నదమ్ముల బిడ్డలుగాని, తుదకన్న చెల్లెండ్రుగాని వివాహము లాడగూడదని నిర్ధారణగా చెప్పుటకు దగిన గట్టి కారణము దొరకదు. మీ రనునటుల సంతానము గనుటయే వివాహమునకు పరమ గమ్యార్థమగు నెడల వధూవరుల యెన్నిక కేవలము గర్భధారణ సౌకర్యము మీద మాత్రమే ధార పడును. తక్కిన విచారణలన్నియు నప్రధానములని త్రోసివేయ వలసినవేయగునా? అటుల గానిచో నే వరుస ననుసరించి తారతమ్యమును నిర్ణయించుట? నేను క్రింది వరుసను సూచింప గోరెదను:—

1. పరస్పరానుగము, లేక ప్రణయప్రేమ
2. గర్భధారణార్హత
3. ప్రసక్తిగల కుటుంబముల వారి యంగీకారము, ఒప్పుదల, మరియు ఆ యా కులములవారి యోగక్షేమము.
4. ఆధ్యాత్మిక పరివర్తనము

ఇందులకు మీయభిప్రాయ మేమి?

వివాహసమయమున వధువునుగురించి 'నీకెనమండ్రుగురు సంతానముకలుగుగాక,' అనుచు పెద్దలుచేయు ప్రాచీనకాలపు దీవన ననుసరించి చూడగా, వివాహమునకు పరమ గమ్యము సంతానముగనుటయేయని హిందూశాస్త్రములు నిర్ధారణచేయుచున్నవన వలెను. వివాహితుల సంభోగము సంతానము కొరకు మాత్రమేగాని కామతృప్తికొరకుకాగూడదను మీవాదము దీనివలన బల పడు

చున్నవి. సరే. మగబిడ్డయా, ఆడుబిడ్డయా యను విచక్షణలేకుండ, నొక్క బిడ్డతో వధూవరులు దృప్తిపడగలరని మీయీప్సితమా? మఱియు మీరు స్వక్రమముగ నంగీకరించి నట్టి వంశాభివృద్ధి మగసంతానము ద్వారా మాత్రమే యుచితరీతిని సాగగలదనెడు భావము మనలో నున్నది. కావున పుత్రికాజననముకంటె పుత్రజననమునే హెచ్చుగ కాంక్షింతురు. ఇటుల పుత్రికాసంతానమును గూర్చిన ప్రబలాపేక్షను బట్టి, పుట్టగల ఆడుబిడ్డలకు తోడుగా పుత్రసంతాన ప్రాప్తిని చేర్చు విధమున, నొక్క బిడ్డను మాత్రము గనగోరు మీ పరమాదర్శమును మార్చవలయునని మీ రంగీకరింపరా?

సంతానమును గనుటకు మాత్రమే సంభోగ కార్యమును నియమించుకొనిన వివాహితులు బ్రహ్మచారులుగనే యెంచబడ వలయు ననుటలో నేను సంపూర్ణముగా మీతోడ నేకీభవించుచున్నాడను. వివాహమునకు పూర్వమును, పిమ్మటనుగూడ నిష్కళంక వర్తనులై ఇంద్రియనిగ్రహమును సాధనచేసిన దంపతుల సందర్భములో నొక్కసారి సంభోగించినంతనే గర్భధారణ యగుననుటలోను మీతోడ నే నేకీభవించుచున్నాడను. మీరు పేర్కొనిన మొదటిసూత్రమునకు నిదర్శనముగా మనశాస్త్రములలో శ్రీ వశిష్ఠునియొక్కయు, అరుంధతియొక్కయు కథ కలదు. అరుంధతి వశిష్ఠుని భార్య. ఆమె తనభర్తతో సంయోగము పొందుట కేవలము మాతృత్వము బడసి తత్సంబంధ ధర్మముల నిర్వహించుకొఱకే యగుటంజేసి యామె యాజ్ఞకు పంచభూతములు సయితము విధేయత జూపవలసిన వయ్యెను. ఆమె నూర్వురు కొమరులకు తల్లియైయున్నను, నిర్దుష్ట బ్రహ్మచారిణి యని విశ్వామిత్రుడామె నభినందించియున్నాడు. కాని ఆడుశిశువు మగశిశువు, నను విచక్షణ లేక, ఒక్కబిడ్డను గనుట మాత్రమే పరమావధియను మీ ప్రవచనమునకు హిందూశాస్త్రములలో ప్రమాణముగలదాయని నేను శంకించుచున్నాను. ముందుగ నాడుపిల్లలుపుట్టుటసంభవించినచో, నొక్క మగశిశువు కలిగెడివఱకు గృహస్థధర్మము సాగింపవచ్చుననునంత మేరకు మీయాదర్శమును పెంచుటకు మీ రొప్పుకొందురేని, పెక్కుమంది దంపతులకు తృప్తినొసగుట కెంతో యుపకరించునని నే నెంచుచున్నాను. లేనిచో, మొదటిశిశువు కలిగెడి వఱకుమాత్రమే సంభోగధర్మమునుగడపి, ఆ శిశువు మగవాడైనను, ఆడుదైననుగూడ, నంతటితో యావజ్జీవము బ్రహ్మచర్యదీక్షను వహించుట మొదట పెండ్లియే చేసికొనకుండుటకంటె కఠినతరవ్రత మగునట్లు నేనులు

భావింతురని నా భయము. కామవాంఛ నరుని ప్రాకృతస్వభావమనియు, ఇంద్రియనిగ్రహము సాధనచే సంపాదించు నుత్తమగుణమునను భావము నాకు క్రమేణ కలుగుచున్నది. ఇంద్రియనిగ్రహము, మతము, ఆధ్యాత్మికజీవనము ననునవి నరు డుద్గమించుటకు సోపానములుగ నున్నవి. నరుని పరిణామమున కిది సహజధర్మము. అందుమూలముననే ఇంద్రియనిగ్రహమువ కంత యాదరణ గల్గినది. సంతానాభివృద్ధిసాధనముగా మాత్రమే సంభోగమేర్పడిన దనెడు నాదర్శమును పాలించు మానవుని నే నెంతయు గౌరవింతును. ఏ పరిస్థితులందైనను సంయోగము సలుపుట విషయలోలత యగుననియు నే నంగీకరింతును. కాని, దాని నతిహీనమగు పాపకార్యమని దూషించుటకు నేను సిద్ధపడను. తమ నైజప్రేరణను నిగ్రహింపజాలని దంపతులను పతితజీవులనుగా నెంచి తేలికగా దౌర్భాగ్యులని పిలుచుటకుగాని, ఛీకొట్టుటకుగాని నేను పూనుకొనజాలను.

వివాహసంబంధములం గూర్చిన ఆయా నిషేధములకు గల శాస్త్రీయములగు నాధారముల నే నెఱుగను. కాని, ధర్మమును, ఆత్మనిగ్రహము ననుష్ఠానము చేయుటలో సాహాయ్యపడు సాంఘికాచారమునకు నీతిశాస్త్రాంగీకారముండితీరవలయు నని స్పష్టముగ నాకు దోచుచున్నది. అన్నచెల్లెండ్రు పెండ్లిచేసికొనుటదగదను నిషేధమునకు మూలము గర్భ-ఆధానమునకు సంబంధించినది యగునెడల, అది మేనత్త మేనమామల బిడ్డలు పెండ్లిచేసుకొను నాచారమునకును సమానముగా ననువర్తింపవలసి యుండును. కనుక, అట్టి నిషేధము లాచరణలో నున్న యే సంఘమునందైనను వానిని గౌరవించుటయే క్షేమకరసూత్రమగును. నాకుత్తరము వ్రాసినవారు తెలిపిన ఆదర్శవివాహముయొక్క నియమావళికి నేను సామాన్యముగ నొప్పుకొనగలను. కాని, వానిప్రాముఖ్యతను గూర్చిన వరుసక్రమమును నేను మార్చి ప్రణయప్రేమను

తుదిని పెట్టగోరెదను. ప్రణయప్రేమకు ప్రథమస్థాన మిచ్చుట వలన తక్కిననియమములుబొత్తుగ పాటింపబడకయేపోవచ్చును. దాదాపుగా నిరర్థకమై పోవచ్చును. కాబట్టి, వివాహావరణము సంఘాధ్యాత్మిక వికాసమునకు ప్రథమస్థాన మొసగవలసి యుండును. దానిపిమ్మట సేవాదర్శ ముండవలెను. కుటుంబ క్షేమము, సంఘాభ్యుదయము మూడవస్థానమును, పరస్పరానురాగము లేక ప్రణయప్రేమ యనునది తుది నాల్గవ స్థానము నాక్రమింపవలయును. తక్కిన మూడు నియమములను చేకూరని పక్షమున ప్రణయప్రేమ యొక్కటియే వివాహమునకు సక్రమమగునాధారముగా పాటింపదగదని దీని భావము. మరియు ననురాగము లేనియెడల, తక్కిన నియమములు సఫలములయినను కూడ, అదే తీరున వివాహము నిషిద్ధముగా నెంచవలయును. గర్భ-ఆధానయోగ్యతను కూడ నియమావళినుండి తొలగించివేయవలయు నని నా యభిప్రాయము. ఏమందురా, సంతానము గనుట వివాహమునకు ప్రధానోద్దేశము గనుక, గర్భ-ఆధానయోగ్యత కేవలము మొకానొక ప్రత్యేక నియమముగా నెంచనేరాదు. అది లేనిది వివాహమే జరుగదగదుగదా!

హిందూశాస్త్రములు పుత్రసంతానముం గూర్చి యభిమానముం జూపుననుట నిశ్చయము. కాని, కాయికపుష్టి యధికముగా పాటింపబడి, జీవనపు బోరాటమునకు సమర్థమగు పురుషబలము ప్రధానముగా నుండి తీరవలసిన కాలమునందా సిద్ధాంత మేర్పడియున్నది. అందువలన ఒక నరునికి గల కొమారులసంఖ్య పౌరుషమునకును, బలమునకును చిహ్న

ముగా నెంచబడెడిది; మరియు నధికసంతానము కలుగు నవకాశము కొరకప్పుడు బహుభార్యాత్వ మంగీకరింపబడి ప్రోత్సహింప బడెడిది. కాని, వివాహమును మన మొక పవిత్ర సంస్కారముగా నొప్పుకొంటిమేని, ఒక్క బిడ్డ కలుగుటకు మాత్రమే యందవకాశముండును. అందువలననే మన శాస్త్రములందు మొదటపుట్టిన బిడ్డ 'ధర్మజ' అనగా ధర్మము కారణముగా పుట్టినట్లును, తదనంతరము పుట్టిన బిడ్డలందరు 'కామజ' అనగా కామము కారణముగా పుట్టినట్లును వర్ణించుటకు హేతువైనది. కుమారునకు, కుమార్తెకు నెట్టి భేదమును గుర్తింపజాలను. అట్టి భేదభావము ద్వేష ప్రేరకమును, దోషమునని నా యభిప్రాయమై యున్నది. పుత్రజనన మెట్టిదో పుత్రికాజననము నట్టిదిగనే సమాదరణీయమై యుండవలెను.

వశిష్ఠవిశ్వామిత్రుల కథ కేవలము సంతానముకలుగుకొఱకగు సంభోగ ముత్తమ బ్రహ్మచర్యాదర్శమునకు విరుద్ధము కాదని తెలుపుట కొరక శ్రేష్ఠమగు నుదాహరణగా నున్నది. కాని యా కథ యావత్తును శబ్దార్థ ప్రకారము గ్రహింపవలసిన యవసరము లేదు. విషయవాంఛా తృప్తి కొరకైన సంభోగము పశుదశకు మరల్పునట్టిదనియు, దానిని దాటి యూర్ధ్వగమనము చేయుట నరుని విధియనియు తెలియవలెను. అయినను, అటుల చేయలేకపోవుట భార్యాభర్తల నడుమ మహాపాప మనియు, నిందార్హ మనియు నెంచజాలము. ఈ లోకములో కోట్లాది నరులు జిహ్వాలాలసతృప్తికై తినువారు గలరు. అదేతీరున కోట్లాది దంపతులు విషయవాంఛా తృప్తికై సంభోగించుచున్నారు. వారటుల చేయుచునేయుందురు.

కూడను. మరియు తన శాసనోల్లంఘనము చేసినందుకై ప్రకృతి తమమీద పడవేయు నసంఖ్యాకములగు విపత్తుల రూపమున శిక్షల ననివార్యముగ ననుభవించుచుందురు. పూర్ణబ్రహ్మచర్య దీక్షయొక్కగాని, లేక గృహస్థ, బ్రహ్మచర్యము యొక్కగాని ఆదర్శము ఆధ్యాత్మికమును, నుత్తమము నగు జీవనమునకై పాటుపడువారికొరకేసుడీ! అటువంటి జీవితమున కాయాదర్శముండియే తీరవలయును.

---

## కారుణ్య సోదరీగణము

జాఫ్నాయందలి ఉడివిల్ బాలికా కళాశాలలో నిట్లుపన్యసించెను

ఈ ప్రొద్దు మిమ్ము గలసికొనినందు కెంతయు నానందించుచున్నాను. మీ హృదంతరాళములనుండి ప్రేమపూర్వకముగ వచ్చిన చిన్నిచిన్ని కానుకలను సాధారణపు ముల్లెలో కలిపివేసిన మీసంకల్పము నా కంతగా నచ్చలేదు. అయినను, మీ ముల్లెను మామూలు ముల్లెలో కలిపివేసిన భావమునకు దారమగు నర్థమును చెప్పెదగాక! బాలురకంటె మీ రెక్కుడు నమ్రతగలవారు గనుక, మీరేమేని ఇచ్చియేయుండినటుల నాకు తెలియవలదని కోరియుందురు. కాని, భారతదేశమంతటను వేలకొలది, లక్షలకొలది బాలికలను కలిసికొనుచుండు నాకు తెలియకుండా, తాముగావించు మేలికర్జములను బాలకలీనాడు దాచిపెట్టుట దుస్సాధ్యమగు పనియే సుండీ!

ఇంతియకాదు; కొందఱు బాలికలు తాము చేయు చెడ్డ పనులను సయితము నాకు తెలుప జంకరు. ఇప్పుడు నాయెదుట నున్న బాలికలలో నొక్కర్తుకయైన పాపకార్య మొనరించు నది లేదని నా యభిప్రాయము. మిమ్ము పరీక్షించి శోధించుటకు నాకు వ్యవధి లేదు గావున, మిమ్ము ప్రశ్నలువేసి విసిగింప బోను. కాని మీలో చెడ్డపనులుచేయు బాలికలెవరేని యున్న యెడల, ఆస్థితి వాటిల్లినచో, వారి విద్యాభ్యాసము వ్యర్థమైన దని నేను వారికి చెప్పగోరుచున్నాను.

మీతల్లిదండ్రులు మిమ్ము నట్టి ఆటబొమ్మలైపోవుటకు బడికి బంపుటలేదు. అందుకు మారుగా మీరు దయామయులగు తోబుట్టువులుగా తయారు కాగలరని వారి యాశయము. విశిష్టరూప వస్త్రధారణ చేయువారు మాత్రమే 'కారుణ్యసోదరీగణ' మను బిరుదుగాంతురని తలచి పొరబడకుడు. తన మేలును తక్కువగ జూచుకొనుచు, తనకన్న పేదలను, దురదృష్టవంతులునగువారి మేలును హెచ్చుగ పాటింప మొదలిడిన తోడనే యొకర్తుక 'కారుణ్యసోదరి' యగును. నాకిప్పు డొసగబడిన ముల్లెకొఱకై తృణమో, పణమో యిచ్చి మీరు 'కారుణ్యసోదరీగణము' యొక్క ధర్మమును నెరవేర్చితిరి. ఏమందురా, నా కొసగిన యీముల్లె మీకన్న బీదలును, అదృష్టహీనులు నగువారికొఱకై వినియోగపడనున్నది.

ఒకచిన్న నాణెము నొసగుట తేలికపని; స్వయముగ నొక చిన్న కార్యమునుచేయుట హెచ్చుకష్టము. మీరెవరికొఱకై డబ్బు నిచ్చితిరో వారిపై మీకు కరుణయే యున్నయెడల, మీరింకొక యడుగు ముందునకు వేసి, ఆజనులు తయారుచేయు ఖద్దరును

ధరించవలయును. ఆఖద్దరును మీాయెదుటికి తెచ్చినప్పుడు, 'ఇది మీాతకగనున్నది, దీనిని మేము ధరింపజాలము' అందు రేని, ములో స్వార్థత్యాగబుద్ధి లేదని నాకు తెలిసి పోవునుసుడీ !

హెచ్చుకులము—తక్కువకులము, స్పృశ్యులు—అస్పృశ్యులు అనుభేదములు మీారు పాటించుట లేదు. అదిచాల మంచివిష యము. మరియు మీాహృదయములును ఆత్రోవ నేసడచుచు, ఏ యితరబాలికలకంటెనో మీా రగ్రగణ్యులని తలంపకుందు రేని అయ్యది మఱింత పుణ్యవిశేషముగ నుండును.

పరమేశ్వరుడు మిమ్ము కరుణించుగాక !

## ఆదర్శ సతీధర్మము

జాఫ్నా రామనాథ బాలికాకళాశాలయందు శ్రీగాంధీజీ యిట్లుపన్యసించిరి:—

ఈ యుదయము నేనిచ్చటికి వచ్చుట నాకు నిజముగా సంతోషదాయకము. జాఫ్నాలోని వివిధ విద్యాసంస్థలను సంద ర్శించుచు నేను చేయుసంచారమున కిది మెఱుగుపెట్టునట్లున్నది.

ప్రతి సంవత్సరము నీ దినము నొక పండువుదినముగా జేసికొని, ఖద్దరుద్యమమునకై ద్రవ్యము ప్రోవుచేయుదుమని మీారు చేసిన వాగ్దానము నాహృదయమును కఱిగించివేసినది. ఇది వ్యర్థపు వాగ్దానము కాదనియు, ఈవాగ్దానమును మీారు పరమధర్మముగా నిర్వహింతురనియు నేనెఱుంగుదును. ఎవరి నిమిత్తమై నేనీ సంచారము సాగించుచుంటినో, తిండికై అల్లాడిపోవు ఆ లక్షలాది బీదజనులు యీా సోదరీలలామలు

పూనిన దీక్షను గ్రహింపగల్గుదురేని వారి హృదయము లానందముతో నుప్పొంగిపోవునని నే నెఱుగుదును; కాని యెవరి మేలు గోరి యీ ముల్లెను మీకు నాకిడితిరో, మఱియు సింహాళములో ననేకముగా ముల్లె లొసగబడియున్నవో అట్టి నోరులేని ప్రజానీకమున కిట్టి సంగతులను నేను వివరింప యత్నించినను గూడ అర్థమే చేసికొనజాల రనిన మీకు విచారము కలుగును. వారి దౌర్భాగ్యజీవనగతిని గుఱించి నేనెంతగా వర్ణించి చెప్పినను యథార్థస్థితి యెట్టిదో బహుశః మీకు నేను తెలుపజాలను. వారికొఱకును, మఱియు నిట్టి వారి కొఱకును మీ రేమి చేయవలసియుందురను ప్రశ్న వెంటనే నాకు దాపరించుచున్నది. మీ రింక కొంచెము నిరాడంబరముగ నుండవలయు ననియు, జీవితమున నింక కొంచెము శ్రమను సహింపబూనవలయు ననియు సూచించుట తేలికయే. కాని, అట్టుల సూచనలు చేయుట యీ సమస్యతో నాట లాడుట వంటిదే యగును.

ఇట్టి సంకల్పము లెన్నియో నన్ను రాటపుప్రశంసపదఱికి జేర్చుచున్నవి. ఆ దరిద్రకోటులకును, మీకును సహమ సంబంధము చేర్పఱమకొనగలిగితిరేని మీకును, వారికిని, ప్రపంచమునకును గూడ మేలు చేకూరగలదని నేడు నేను మీకు చెప్పుచున్నటులనే నాలో నే ననుకొనెడివాడను.

ఈ విద్యాలయమున మతబోధ గలదు — చాల మంచిది. సుందరమగు దేవళము గూడ మీ కిక్కడ నున్నది. మీరు మీ దినచర్యను దైవార్చనతో ప్రారంభింతు రని మీ కార్యక్రమసూచికను బట్టి తెలియుచున్నది. ఇదంతయు మంచిదే,

యున్నతి గూర్చునదియే. దినక్రమేణ యీ అర్చనము ననుసరించి యేదియో ఆచరణ సాగనియెడల నిదంతయు నొక వేడుకరూపమగు క్రతువుగా మాత్రము పరిణమించి యూరక పోవును. కావున నేను చెప్పునదేమనగా, ఈ అర్చన పరిణామముగా రాటమును చేబట్టుడు; ఒక యరగంటసేపు దానిని త్రిప్పుడు; నే నభివర్ణించిన లక్షలాది దీనజనుల స్మరింపుడు; భగవంతుడు సాక్షిగా నేను వారికొఱకై నూలు దీయుచున్నానని పలుకుడు. మీ రటుల మనస్ఫూర్తిగ చేసితిరేని, మీ భక్తిచర్య వలన మీ రింకను వినయసంపన్నులై, యున్నతులై ఆ జ్ఞానముతో ఆడంబరమునకు గాక మీ శరీరముల నాచ్ఛాదించు కొఱకు మాత్రమే వస్త్రధారణముచేయు బాలను నారగునెడల, మీరు తప్పక ఖద్దరును ధరించుటకు సంకోచింపరు. మఱియు నా లక్షలాది దీనజనులతో బాంధవ్యమును గూర్చుకొనినవా రగుదురు.

ఈ కళాశాలలోని బాలికలకు నేను చెప్పదలచిన దంతయు నిదియే కాదు.

సర్ రామనాథముగారు మీయెడల జూపు నాదరాభిమానములకును, మఱియు రామనాథపతిగారును, ఆపైక్రింద నుద్యోగము చేయువారును మీయెడల జూపు శ్రద్ధకును మీరు పాత్రులగుదురేని మీరింకను చాల పనులు చేయవలసి యుందురు. స్వతంత్రమగు నభిమానముతో ప్రాతవారగు విద్యార్థినులు నిర్వహించు కార్యములను మీరు ప్రకటించు ప్రతిలో సూచింపబడుట చూచితిని. ఈ ధోరణి గల ప్రకటనపత్రికలను చూచితిని. ఫలానివారికి ఫలానివారికి వివాహముజరిగినదనే ప్రక

టున లెన్నో! సుమారు ఇరువది రెం డిరువదియైదు సంవత్సరముల యీడువచ్చిన బాలిక వివాహము చేసికొనుటలో నాకేమియు దోషము కాన్పించుటలేదు. కాని, యీ ప్రకటన పత్రములలో నొక్క-దానియందైనను యీ బాలిక సేవకొఱకై స్వాత్మార్పణము గావించిన దను నిట్టి ప్రకటన నాకు కాన్పించదయ్యెను. కాబట్టి బెంగుళూరునందలి మహారాజాబాలికాకళాశాల విద్యార్థినులకు నేను చెప్పినవిషయమును మీకును చెప్పగోరుచున్నాను. విద్యాలయముల నుండి మిమ్మును పంపివేయగనే మీరాట బొమ్మలై ప్రయోజనకరమగు జీవితమునుండి అదృశ్యులైపోవుదు రేని విద్యా ప్రచారకులును, మహోదారు లగు దాతలును నడుపు మహోద్యమములవలన ప్రతిఫల మంతగా దక్క-జాలదు.

పాఠశాలలను, విశ్వవిద్యాలయములను విడుచు త్రోడ్తోడనే విద్యార్థిను లనేకులు ప్రజాజీవితము నుండి మఱుగుపడిపోవు చుందురు. ఈ సంస్థలోని మీ రటుల కాదగదు. ఎమెరికన్య సాదృశ్యముం జూడుడు; ఇంక నటువంటి వారి యాదర్శముం గనుడు. వారు విచారణాధికారపదవుల నిర్వహించుచున్నారు. వా రవివాహితలుగనే యుండిపోయి రనిన నేను పొరపడుటలే దనుకొందును.

ప్రతి బాలికయు, ప్రతి భారతకన్యయు వివాహమాడుటకే జన్మించుటలేదు. ఒక్క- పురుషునికి సేవచేయుటకు మారుగా, ప్రజాసేవకాత్మార్పణము గావించుకొనిన బాలికలనెంతమందినో యీనాడు మీకుజూపగలను. పార్వతి, సీతవంటివారు సాధ్య మగుచో వారిని మించిన యుత్తమవనితలు హైందవ బాలికల నుండి బయలుదేరవలసిన తరుణము మించుచున్నది.

మీరు శైవులని చెప్పుకొందురు గదా ! పార్వతీసతి యేమి చేసినదో మీ రెఱుగుదురు. భర్తకొఱకై ఆమె ధనరాసుల నెచ్చించలేదు; తా నమ్ముడు వోవుటకును నొప్పుకొనలేదు. నేడామె హిందూ జాత్యంతరిక్ష పథమునందు సతీస వ్రతమున ప్రకాశించుచున్నది. అట్లగుట కళాశాలలం దుండి యామె గడించిన బిరుదుపత్రమువలన గాదు; ఎన్నడును కనివిని యెఱుంగని యపూర్వ తపశ్చర్యవలన !

ఇచ్చటను నసహ్యాకరమగు కట్నముల పద్ధతి యున్నదని వింటిని. అందువలన యువతులకు తగిససంబంధములు దొఱకుట లేదట ! ఈడునచ్చిన బాలికలు—మీలో కొందఱు ఈడునచ్చిన వారే గదా ! అటువంటి ప్రలోభములను తిరస్కరింపవలయును. ఈ దుష్టాచారముల నెదిరించితిరేని, మీలో కొందఱు యావజ్జీవము గాని, చాల కాలము వఱకు గాని కన్యలుగా నుండవలసి యుండును. పిమ్మట మీ వివాహమున కనుకూలమగు తరుణము వచ్చునప్పుడు మీరు మీ సహధర్ముని వరించుటలో, ధనము గాని, ఖ్యాతి గాని లేక దేహసౌష్ఠవము గాని కలిగిన పురుషుని కొఱకై తహతహ పడజనదు. పార్వతీదేవి వలె భవ్య శీలమును సూచించు నసమాన లక్షణములు గల నొకనికొఱకై యన్వేషింపుడు. పార్వతీసతి కడకు వచ్చి నారదుడు శివు నెట్లు వర్ణించెనో మీ రెఱుగుదురు గదా ! ఒడలెల్ల బూడిద పూసికొను శుష్కదరిద్రుడు; అందచందములా పూజ్యము; బ్రహ్మచర్యవ్రతు డని చెప్పినాడు. సరే. 'అతడే నా భర్త కాగలడు' అని పార్వతీసతి పలికినది. మీలో కొందఱు తపస్సు సలుపసమకట్టిన గాని శివుని బోలువారిని బడయజాలరు. పార్వతీదేవి

వలె వేలకొలది వత్సరములు మీరు తపము లాచరింపజాలరు. దుర్బల తనువులతో మీరు రటుల చేయజాలరు గాని మీ జీవిత కాలమునందైన నటుల జేయగలరు.

ఈ నియమములను మీ రనువర్తింతురా? బొమ్మలరాజిలో గలసి మటుమాయమై పోవుటకు నిరాకరించుడు. పార్వతి, దమయంతి, సీత, సావిత్రుల బోలు సతీలలామ లగుటకు ప్రయత్నించుడు. ఇట్టి సంస్థయొక్క గౌరవమునకు మీరు పాత్రులగుట అప్పుడే గాని అంతవఱకును గాదని సవినయముగ దెలుపుచున్నాను.

భగవంతుడు మీ కట్టి యాశయ ప్రోత్సాహముల ప్రసాదించు గాక. మీ కటువంటి ప్రేరణ కలిగిననాడు భగవంతుడు మీ యీప్సితముల నీడేర్చును గాక !

## బాల్య వివాహ పీడ

చెన్నపురిలో నిటీవల జరిగిన ఘోరసంఘటనను గుఱించిన ప్రకటనాంశమును కజిన్సుసతి నాకు బంపినది. బాల్యవివాహము వలని ఘోరసంఘటన మది. బాలిక పదమూడేండ్లది; ఆమెభర్త యిరువదియారేండ్లవాడు. ఆ యాలుమగలు కూడి పదమూడు దినములు కాపురముచేసిరో లేదో ఆ బాలిక అగ్ని కాహుతియైనది. ఆ భర్తృనామకుని దుస్సహము, నమానుషము నగు నిర్బంధ చేష్టలకు దాళజాలక యా బాల ఆత్మహత్య గావించుకొనె నని పంచాయతీనారు తీర్పు చెప్పిరి. ఆ బాలిక యొక్క మరణవాఙ్మూలము భర్త యామె బట్టకు నిప్పంటించినటుల

తెలుపుచున్నది. కటా! కామోద్రేకునికి వివేక మెక్కడ? జాలి యెక్కడ?

ఆ బాలిక యెట్టుల ప్రాణములవిడిచెనో యనుసంశయము మన కక్కఱలేదు. నిశ్శంకముగా నంగీకరింపదగిన యంశము లివి :-

1. పదమూడేండ్ల ప్రాయముననే బాలికకు పెండ్లి చేయబడినది.
2. ఆమెకు కామవాంఛలేదు; భర్తలాలనలకు లొంగలేదు.
3. భర్త క్రూరనిర్బంధముల సాగించినాడు.
4. బాలికకు ప్రాణభంగము వాటిల్లినది.

ఒక క్రూరాచారమునకు ధర్మాంగీకార మొసగుట మతము గాదు; దుర్మత మనవలయును. స్మృతులు పరస్పర విరుద్ధ వాక్యములతో నిండియున్నవి. సుప్రసిద్ధమును, శిష్టజనాంగీకృతమునగు ధర్మమునకును, ముఖ్యముగ నాస్మృతులే శాసించు నీతిసూత్రములకును విరుద్ధములుగానుండు వాక్యములను ప్రక్షిప్తములని త్రోసి వేయవలసియుండును. మను వందలి పశుత్వమును పురికొల్పుచు శ్లోకముల వ్రాయ సమకట్టు కలమే బ్రహ్మచర్యమును ప్రబోధించుచు వ్రాయగల్గుటకల్ల. బ్రహ్మచర్య మననేమియో యెఱుంగక పాపకర్మమున దిగబడిన నరుడు మాత్రమే రజస్వలగాని కన్యకు వివాహముచేయ కుండుట పాపమని వక్కాణింప జాలును. రజస్వలయైన చాలకాలమునకు బాలికకు వివాహముచేయకుండుట పాపమనుట చెల్లును. రజస్వలాత్పూర్వము వివాహసంకల్పమైనను కలుగజాలదు. రజస్వలయైన వెంటనే బాలిక బిడ్డలుగన సమర్థురాలగు ననుటయు, బాలుడు మూతిమీద మీసము మొలకెత్త ప్రారంభింపగనే సంతానమును గనసమర్థుడగు ననుటవంటి విడ్డూరపు మాటయే.

ఈ బాల్యవివాహపు టాచారము నైతికముగను, కాయిక ముగను గూడ ననర్థదాయకమే. ఏమన అందువలన నీతి క్షీణించును; కాయికబలమును అధఃపతన మగును. అట్టి దురాచారముల నామోదించుట మూలమున మనము స్వరాజ్యము నకును, సర్వేశ్వరునకును దూరులమై పోవుచున్నాము. ఒక బాలికపసితనము నెడ లక్ష్యములేని వానికి భగవంతుడని నను లక్ష్యముండదు. ఇలగఱచు నరునకు స్వాతంత్ర్యసంగరమున పోటుమానిసియై నిలుచు బలముండదు. అట్టి స్వాతంత్ర్యము లభించినను వానికి దాని నిలుపుకొను సమర్థత యుండదు. స్వరాజ్యరణ మన కేవలము రాజకీయాందోళనము మాత్రము కాదు; సర్వతోముఖప్రబోధమే. సాంఘికముగను, నైతికముగను ఆర్థికముగను, రాజకీయముగను, విద్యావిషయికముగను సర్వ విధముల ప్రబుద్ధదశయే అది.

సమ్మతివయస్సును పెంచుటకు శాసననిర్మాణము సాగుచున్నది. అల్పసంఖ్యాకులను పట్టుకొని దండించుటకది ప్రయోజనకారి కావచ్చును. కాని జనసామాన్యమును పట్టుకొనిన కీడు నివారింపగలది శాసననిర్మాణము కాదు. ప్రజాభిప్రాయమును మేల్కొలుపుటచేత నట్టిది సులభసాధ్య మగును. అటువంటి సందర్భములలో నేను శాసన నిర్మాణమునకు వ్యతిరేకిని గాను. ఐనను ప్రజాభిప్రాయకృషికి నే నెక్కుడు ప్రాముఖ్యత నిత్తును. బాల్యవివాహములకు విరుద్ధముగా ప్రజాభిప్రాయ మున్నచో చెన్నపురి సంఘటన అసంభవమై యుండును. అందు ప్రసక్తిగల యువకుడు నిరక్షరకుక్షి యగు కర్షకుడు గాడు; చుఱుకైన చదువరి యగు టైపిస్టు (చేతిముద్రణ వ్యాపారి). పసిబాలికల వివా

హాములకు గాని, గర్భాదానములకు గాని ప్రజాభిప్రాయమే విరుద్ధముగ నుండియున్నయెడల అతడా బాలికను వివాహమాడుటయు, నామెను స్పృశించుటయు నసంభవమై యుండెడిది. సామాన్యముగా పదునెనిమిదేండ్ల వయస్సునకు లోబడిన బాలికల కెన్నడును వివాహము చేయదగదు.

## బాల్య వివాహ మండనమా ?

యంగ్ ఇండియా పాఠకు లొకరిట్లు వ్రాయుచున్నారు :—

**1926** ఆగస్టు **2౬** తేదీ గల యంగ్ ఇండియా పత్రికలో ప్రకటింపబడిన 'బాల్యవివాహపీడ' అనెడు వ్యాసమునందు ఈ క్రింది వాక్యమును జదువుట వలన నాకు చాల బాధ కలిగినది :—

'బ్రహ్మచర్య మన నేమియో యెఱుంగక పాపకర్మమున దిగబడిన నరుడు మాత్రమే రజస్వల గాని కన్యకు వివాహము చేయకుండుట పాపమని వక్కాణింపజాలును.'

మీ అభిప్రాయమునకు భిన్నముగా నుండు అభిప్రాయము గలవారి యెడ ఆదరభావమును మీ రేల జూపజాలరో నా కర్థమగుట లేదు. బాల్యవివాహముల విధించుటలో హిందూస్మృతికర్త పూర్తిగా పొరబడెనని మీరు నిశ్చయముగ చెప్పనోపును. ఐనను బాల్యవివాహములే జరుగవలయునని పట్టుపట్టువారు 'పాపకర్మమున దిగబడినవా' రని పలుకుట నర్హమని నాకు తోచుచున్నది. వివాదములందు చూపవలసిన మర్యాదను హద్దు మీరినట్లు కాన్పించుచున్నది. నిజమునకు, బాల్యవివాహములకు వ్యతిరేకముగ నట్టి వాదనను నేను వినుట కిదియే మొదటి సారి. నాకు తెలిసినంతవఱకు హిందూసంఘ సంస్కర్తలు గాని లేక క్రైస్తవబోధకులు గాని యెన్నడు నట్లని యెఱుగరు. కాబట్టి, కనీసము ఎదురుపక్షమువారి యెడ నౌదార్యము చూపు సందర్భమున

నిర్దుష్టమూర్తియే యని నేను విశ్వసించు మహాత్మాగాంధిగారి వ్రాతలో యిట్టి వాదమును గాంచినప్పుడు నాకు గల్గిన వింత నూహించుడు.

మీ రొకరిద్దరిని గాక హిందూస్మృతికర్తలలో ప్రతివానిని నాక్షేపించి యున్నారే! నాకు తెలిసినంతవఱకు ప్రతి స్మృతికారుడును బాలికల విషయములో లేప్రాయముననే వివాహము చేయవలయునని విధించియున్నాడు. మీ రనునట్లు బాల్యవివాహముల విధించు వాక్యములు ప్రక్షిప్తము లని నిర్ణయించుట సంభవము కాదు. ఈ బాల్యవివాహపుటాచార మొకరా రాష్ట్రమునకు గాని, యొకరా వర్ణమునకు గాని మాత్రము చెందియున్నది కాదు; భారతదేశములో నిది విశ్వజనీనాచారమై యున్నది. మఱియు నిది రామాయణకాలము నుండి వచ్చుచుండిన అత్యంత పురాతనాచారముగ నున్నది.

ఆడపిల్లలకు లేప్రాయమున వివాహములను చేయుటను హిందూస్మృతికర్తలు విధించుటకు గల కారణము లెవ్వియై యుండునో సంగ్రహముగ దెలుపుటకు ప్రయత్నించెద గాక. ప్రతి బాలికకును విధిగా నొక భర్త యుండుట వాంఛనీయ మని వారు భావించిరి. అట్లుండుట బాలికల మనశ్శాంతికిని, సౌఖ్యము కొఱకు నెంత యవసరమో, సామాన్యముగా సంఘక్షేమమునకును నంతకు తక్కువగాని యవసరమే యైయున్నది. ప్రతి బాలికయు నొక పతిని బడయవలయు ననిన, వరనిర్ణయమును తల్లిదండ్రులు చేయవలయునే గాని, ఆ నిర్ణయమును బాలికలకే విడిచివేయ దగదు. లేక యా నిర్ణయమును బాలికలకే విడిచివేసిన పక్షమున చాలమంది బాలికలు అవివాహితలుగా నుండిపోవుటయే తటస్థించును. అటు లగుట బాలికలు వివాహమాడ నిచ్ఛగించరను కారణమున గాదు; వారు తమకు దగిన వరులను నిర్ణయించుకొనుట చాల కష్టమగును. అది యపాయకరము గూడను. ఏమన, అనుచితమగు వలపులకును, నీతిబాహ్య చేష్టలకును హేతువు కావచ్చును. యోగ్యులుగా జూపట్టు యువకులును నిమాయికు లగు బాలికల నీతివర్తనమును భంగపఱచవచ్చును. మఱియు వరనిర్ణయము తల్లిదండ్రులు చేయుచో బాలికలకు లేప్రాయముననే వివాహములు జరుగవలసి యుండును. వారికి వయస్సు వచ్చునెడల వారెవరినో మోహించి

తల్లిదండ్రులు నిర్ణయించిన వరులను పెండ్లాడ నిరాకరింపవచ్చును. బాలిక యును చిన్నతనముననే పెండ్లియైనచో ఆమె భర్తతో నేకీభవించి వాని కుటుంబమున కలిసిపోవును. ఈ యైక్యత హెచ్చుసహజముగను, నిర్దుష్టముగను నుండును. స్థిరపడిపోయిన భావములును, అలవాట్లును గలిగి యీడు వచ్చిన బాలికలైనచో వైరీతిని నూతన కుటుంబములకనుసరణముగ మారుట కష్టము కావచ్చును.

బాలికలయొక్కయు, వారి సంతానము యొక్కయు నారోగ్యముక్షీణిం చుననుటయే బాల్యవివాహములకు గల ప్రధానమగు ఆక్షేపణగ నున్నది. ఈ క్రింది కారణములనుబట్టి ఈ యాక్షేపణ యొప్పదగినది కాజాలదు. వివా హప్రవయస్సు హిందువులలో హెచ్చుచునేయున్నది. కానిజాతిక్షీణించుచునే యున్నది. వంద లేక యేబది సంవత్సరములకుపూర్వము పురుషులు, స్త్రీలును సామాన్యముగా నిప్పటి కంటె హెచ్చు బలాఢ్యులుగను, ఆరోగ్యవంతులు గను, చిరజీవులుగను నుండెడివారు. అయినను బాల్యవివాహముల యాచార మప్పుడే హెచ్చుగ నుండెను. విద్యనేర్చియాలస్యముగ వివాహము చేసికొనిన బాలికల శరీరదార్ఢ్యము, సామాన్యముగా చదువులు తక్కువైయై లేబ్రాయము ననే పెండ్లిండ్లుచేసికొనిన బాలికలశరీరబలముకన్న హెచ్చుగనుండుటలేదు. దీనిని బట్టిచూడ, బాల్యవివాహములు కొందఱు విశ్వసించునటుల శరీర సౌష్ఠవమును తగ్గించుననుటకు హేతువే కాన్పించదు.

యూరపుసంఘమును భారత సంఘమును రెంటిని మీరుబాగుగ నెఱుంగు దురు. యూరపుఖండమున సతులకంటె భారతభూమియందలి సతులు హెచ్చు పతిభక్తి కలవారో కారో, పేదలందు యూరపుఖండము నందలి భర్తల కంటె - భారతభూమి యందలి భర్తలు తమ భార్యలను హెచ్చు ప్రేమతో జూతురో లేదో, యూరపు వారియందు కంటె భారతీయులందు ప్రతికూలదాంపత్యములు తక్కువగ నున్నవో లేవో, యూరపియను సంఘ మునందు కంటె భారత సంఘమునందు దాంపత్యనీతి హెచ్చుగునో కాదో మీరు చెప్పగల్గుదురు గదా! ఈ సందర్భములలో భారతదేశపు వివాహములు

యూరపుఖండ వివాహముల కంటె నెక్కుడు సఫలత గాంచుచున్నచో, నింక హిందూ వివాహములందు ప్రధానలక్షణమై పఱఁగు లేఁబ్రాయపు వివాహపద్ధతి నిందార్హము కాజాలదు గదా!

ఆడపిల్లలకు లేఁబ్రాయముననే వివాహముల జరుపువిధిని నిర్ణయించుటలో, సామాన్యముగా సంఘము యొక్క అనగా స్త్రీ పురుషు లిరువురి యొక్క యథార్థమగు క్షేమము తప్ప అన్యమగు నుద్దేశముతో హిందూస్మృతికర్తలు వర్తించియుందు రని నేను విశ్వసింపజాలను. ప్రతికూల పరిస్థితు లెన్ని వచ్చినను, తన పవిత్రతను సంరక్షించుకొనుచు, విచ్ఛిన్నమై పోకుండ నిలువగలిగిన హిందూసంఘమునకు ఆడపిల్లల లేఁబ్రాయపు వివాహము లొక ప్రధాన లక్షణ మని నా నమ్మకము. ఇదంతయు మీరు విశ్వసించక పోవచ్చును. ఐనను ఆడపిల్లల లేఁబ్రాయపు వివాహముల శాసించిన మహానీయు లగు హిందూస్మృతికర్త లెల్లరు 'బ్రహ్మహత్య' యను నేమియో యెఱుంగక 'పాప కర్మమున దిగబడిన' వార నెడు నభిప్రాయమును విడిచివేయుదురు గాక యని మేము నిరీక్షింప దగదా?

మీరు ప్రస్తావనకు దెచ్చిన చెన్నపురి సంఘటనము మిగుల నసాధారణమైనది. ఆ బాలిక ఆత్మహత్యగావించుకొనె నని పంచాయితీదారులే నిర్ణయించి యుండిరి. కాని యా బాలిక తన భర్తయే తన బట్టలకు నిప్పంటించె నని పలికినది. ఈ విరుద్ధ వాఙ్మూలముల సందర్భమున, మీరు నిస్సంశయముల నిర్ణయించు పరిస్థితులు యథార్థము లని నమ్ముట చాల కష్టముగ నున్నది. పదుమూడు వత్సరములకు లోబడిన యీడు గల బాలసతుల యుదంతములు లక్షలకొలదిగా గలవుగదా. భర్త క్రూరనిర్బంధము వలన ఆత్మహత్యగావించు కొనిన యుదంత మొక్కటియేని యింతకు పూర్వము విని యుండలేదే! బహుశః చెన్నపురిలో విశిష్టసందర్భము లేనేని యుండనగును; లేఁబ్రాయమున జరిగిన వివాహము ప్రధానముగా మరణకారణము కాకుండ నోపును.

కవివరు డనలేదా?

"రహస్యముగా అంతరాత్మను బాధించు కష్టల సౌఖ్యము నణచి పట్టు

టకై అనుకూలమగు వేదాంతములను కల్పన చేయుటకు కష్టమంతగా నకలేదు' అని.

ఈయంగ్ ఇండియా పాఠకుడు ఇంకొక్కయడుగు ముందుకు వేసినాడు. ఈయన అనుకూలమగు వేదాంతమును కల్పన చేయుటేగాక, యథార్థ విషయములను త్రోసివేసినాడు. నిరాధారమగు కథనమును దీసికొని తనవాదనమంతను స్థాపన చేసినాడు.

నేను స్మృతికర్తలకు దోషము నారోపించియుండలేదుగాన, నిరాదరణ జూపితినను నేరమును జారవిడుతుగాక. మాతృత్వభారమును భరింపజాలని అర్భకురాలుగ నుండు వయస్సునందు వివాహము జరిగితీరవలయు నని పట్టు పట్టువారికి దోషము నారోపించుటకు నేను సాహసించితిని. సజీవుడైయున్న పురుషుని నిందచేయు నెడ మాత్రమే-అదియు నిష్కారణముగా నీచోద్దేశము నారోపించు నెడ మాత్రమే - నిరాదరణప్రశ్న సంభవమగును; ఊహాకల్పితపురుషుని సందర్భమున నది సంభవమే కాజాలదు. సరే-బ్రహ్మచర్యమును బోధించు నాయాస్మృతుల మూలకర్తలే, పసిపిల్లల పెండ్లిండ్లను నిర్బంధముచేయు వాక్యములనుగూడ వ్రాసి రనుటకు విశేషించి కట్టియాధారమైన గలదా? మానవశరీరవృద్ధిసంబంధమగు ప్రధాన ధర్మముల గుఱించిన గాఢతరాజ్ఞానమువలన గాని, అవినీతివలన గాని ఆ మహర్షులు దోషులు గాజాల రని యూహ చేయుటలోనే హెచ్చు ఔదార్యముండునుగదా!

శైశవ వివాహములనగా ఇరువదియైదేండ్లకు లోపున జరుగు వివాహములని యర్థము. కాన శైశవ వివాహము

లకు భిన్నమగు బాల్యవివాహములను విధించు ప్రమాణములు కానుపించిననుకూడ, ప్రత్యక్షానుభవమును, భౌతికశాస్త్ర విజ్ఞానమును ఆధారముగ దీసికొని వానిని నిరాకరింపవచ్చును. హిందూసంఘమునందు బాల్యవివాహవిధి సార్వజనీనమనుమాట యొక్క సత్యత్వమును నే నంగీకరింపజాలను. లక్షలకొలది బాలికలు వివాహమనుమాట విన, అనగా పసివారుగా నుండగనే భార్యాత్వముబూని జీవించుటను జూడ, నాకు దుఃఖముగల్గును. ఏ పదునొకండేండ్ల యీడుననో లక్షలకొలది బాలికలు కాపురము చేయవలసిన వారైయుండినచో, హిందువులేనాడో జాతిత్వేన వినాశము పొందియుండెడివారే.

మఱియు తల్లిదండ్రులే వారిభర్తలను నిర్ణయించుచుండెనను, అట్టి వివాహములు పసితనముననే గర్భాదానములుజరుగుటకు మూలము లయ్యెడివని నిర్ధారణచేయుటకును వీలుండదు. ఇంకను బాలికలే తమవరుల వరింపవలసివచ్చినను వలపులును, అనుచిత చేష్టలును సాగుననుటయు సత్యము కాజాలదు. ఇంతేకాను, యూరపులోనయితము స్వయంవరణ సహవాసములు విశ్వజనీనములు కావు. మఱియు హిందూబాలికలలో నేలకొలది బాలికలకు పదునైదేండ్లపిమ్మటనే వివాహములగుచున్నవి. ఐనను వారి భర్తలను తల్లిదండ్రులే నిర్ణయించుచున్నారు. మహమ్మదీయులలో యీడువచ్చిన కొమరితలకు విధిగా తల్లిదండ్రులే వారి భర్తలను నిర్ణయింతురుగదా! ఆ నిర్ణయమును బాలికలు తమకు తామే చేసికొనుటయా లేక వారి తల్లిదండ్రులు చేయుటయా యను ప్రశ్న వేఱు; అది యాచారము ననుసరించి జరుగును.

నాకుత్తరము వ్రాసిన యతడు వయస్సువచ్చిన సతుల బిడ్డలు బాలసతుల బిడ్డలకంటె దుర్బలు రనుటకు నిదర్శన మేమియు చూపియుండలేదు. భారతదేశమును, యూరపు నందును నాకుగల యనుభవమునకు భిన్నముగా వారి నీతి వర్తనముల తారతమ్యవివక్షత చేయుటకు నేను నిరాకరించవలసి యుండును. ఒకవేళ వాదనకొఱకని, యూరపులోని సాంఘిక నీతి భారతదేశములోని సాంఘికనీతికన్న హీన మనినను, ఆస్థితి యీడువచ్చిన పిమ్మట వివాహములు జరుగుటనలని ఫలితమే నని స్వతస్సిద్ధముగ నిర్ణయ మగునా?

తుదకు చెన్నపురియుదంతమును విలేఖరికి సహకారి కాదు. యథార్థవిషయములను పూర్తిగా నిర్లక్ష్యము చేయుటవలన వేగిఱపాటుతో జరిగినదే నాని ధర్మనిర్ణయ మని దాని ప్రస్తావనచే తేలుచున్నది. దానికి సంబంధించిన నా వ్యాసము నతడు తిరిగి చూచునెడల ఋజువైన యుదంతముల ననుసరించి మాత్రమే నానిర్ణయము జరిగినదని యతడు కనుగొనజాలును. మరణహేతు వేమైయుండు నను సంగతివలన నా నిర్ణయము మారదు. ఋజువైన విషయము లివి:—

1. ఆ బాలికది పసితనము.
2. ఆమెకు కామేచ్ఛ లేదు.
3. భర్త నిర్బంధములు పెట్టినాడు.
4. ఆమె మరణించినది.

ఆమె భర్తయొక్క దుష్టకామమునకు లొంగని కారణముచేత ఆత్మహత్య చేసికొనెనా అది దౌర్భాగ్యమే గదా? లేక

భర్తయే హత్యచేసినయడల అది యంతకన్నను దోషకార్య మగును. ఆ బాలిక చదువునేర్చుకొనుటకు, ఆటలాడుకొనుటకు తగిన దశయం దున్నది. అంతియేకాని సతీత్వము వహించుట కును, గృహనిర్వహణభారము వహించుటకును, భర్తయొక్క లేక యజమానియొక్క నిర్బంధమును సహించుటకును సమర్థు రాలై యుండలేదు.

నాకు లేఖవ్రాసిన యాయన సంఘములో నున్నతపదవి నాక్రమించిన వ్యక్తియే. ఉన్నత విద్యల గఱచి నట్టియు, యోచనాపరు లగు పుత్రపుత్రికలు ఘనతరకార్య నిర్వాహ కులు కాగలరని సంఘమాత యువ్విళ్ళూరుచుండును. నైతిక ములును, సాంఘికములును, ఆర్థికములును, రాజకీయములు నగు నెన్నెని కీడులకు మనము లోనై యున్నాము. వానిని నవరించుటకు ఓరిమితోడి విచారణ, నిపుణమైన పరిశోధన, నిశిత మైన కార్యదక్షత, నిర్దుష్టమైన వివరణము, విశుద్ధమగు యోచ నాశక్తి మఱియు తొట్రుపాటు లేనట్టియు నిష్పక్షపాత మగు నట్టియు తీర్మానమును అన్నియు కావలసియుండును. ఎంత కష్ట మైననుగాని సత్యప్రకటనమునకై పాటుపడని యెడల, ఆ సత్య మునే యనుసరించనిచో మనదేశమునకును, మన మతము లకును, మన జాతీయోద్యమమునకును తీరని యపకారము చేసినవార మగుదుము.

## బాల్య వివాహపు ఘోరానర్థములు

బాల్యవివాహ నిరోధకసంఘమువారు బాల్యవివాహములం గురించి యుపయోగకరమును, బోధ్యమునగు నొక కరపత్రమును ప్రకటించి యున్నారు. అందలి ప్రధానాంశముల నీ క్రింద నుల్లేఖించుచున్నాను :—

15 సంవత్సరముల యీడునకు లోపల వివాహితులయిన బాలికల సంఖ్యలను వయస్సువారీగా 1931 వ సంవత్సరపు జనాభా లెక్కలు యిట్లు తెలుపుచున్నది :—

| వయస్సు | | | | నూటికెంతమంది అవివాహితలు. |
|---|---|---|---|---|
| 1 | సంవత్సరము లోపువారు | | | .8 |
| 1 | సం. మొదలు | 2 | సం. వఱకు | 1.2 |
| 2 | ,, | 3 | ,, | 2.0 |
| 3 | ,, | 4 | ,, | 4.2 |
| 4 | ,, | 5 | ,, | 6.6 |
| 5 | ,, | 10 | ,, | 19.3 |
| 10 | ,, | 15 | ,, | 28.1 |

కాబట్టి ఒక యేడాది యీడు రాకమునుపే దాదాపుగా ప్రతి నూరుమంది బాలికలలో ఒక బాలికకు వివాహమైయున్నది. 15 సంవత్సరముల లోపు వయస్సుగల బాలికల వర్గములలో ప్రతి వర్గమునందును ఇట్టి ఘోరస్థితియే కానవచ్చుచున్నది.

దీని ఫలితముగా మన దేశమునం దున్న బాలవితంతువుల సంఖ్య నమ్మశక్యము కానంతగా నున్నది. ఆ సంఖ్యల జూడుడు :—

| | | | | | అసలు సంఖ్య |
|---|---|---|---|---|---|
| ఒక యేడాదిలోపు వయస్సుగల వితంతువులు | | | | | 1515 |
| 1 | సం. మొదలు | 2 | సం. వఱకు | ,, | 1785 |
| 2 | ,, | 3 | ,, | ,, | 3485 |
| 3 | ,, | 4 | ,, | ,, | 9076 |
| 4 | ,, | 5 | ,, | ,, | 15019 |
| 5 | ,, | 10 | ,, | ,, | 105482 |
| 10 | ,, | 15 | ,, | ,, | 185339 |

బాల్య వివాహముల వలని యనర్థముయొక్క పరిమాణము కొద్దియే యనియు, ఆ యాచారము విశ్వజనీనమనియు తఱచుగా చెప్పుచుందురు.

కాని యీసంఖ్యలనుబట్టి తేలిన బాలవితంతువుల సంఖ్యయేగాక, ఆసంఖ్యలో శతాంశమైననుకూడ, సదయహృదయు లగు ప్రజలుగాని, పరిపాలకులు గాని యీదౌర్భాగ్య స్థితికి మూలమగు కారణముల నాపివేయకుండ ఒకటి క్షణ కాలమేని యుపేక్ష చేయజాలరు. ఈ సందర్భములో నొకటి విషయము మాత్రము జ్ఞప్తియం దుంచుకొన వలయును. ఈ బిడ్డలలో నధికసంఖ్యాకులకు పునర్వివాహ మసంభవము!

బాల్యవివాహముల వలని మఱొక యనర్థ మేమన, లేప్రాయముననే తల్లులయినవా రనేకులు ప్రసవకారణముగా మరణించు చున్నారు. భారత దేశములో ప్రసవకారణముగా జరుగు మరణముల సగటుసంఖ్య సంవత్సరము నకు రెండు లక్షలు! దీని లెక్కవేసి చూచినచో గంట కిరువది మరణములు తటస్థించుచున్నట్లు తేలును. ఇటుల మరణించు వారిలో అధికసంఖ్యాకులు ఇరువది సంవత్సరముల లోపు బాలికలు.

సర్ "జాన్ మెగా"గా రేమనుచున్నారో వినుడు :—

"లేప్రాయమున బిడ్డల తల్లులైనవారిలో ప్రతినేయిమందికిని నంషమంది తమ పసితనము గడవకముందే ప్రసవించి మరణమువాత బడవలసినవా రగు చున్నారు!" బాలింతలుగా మరణించువారిని గూర్చిన సంఖ్యలు ప్రత్యేక ముగా మనకు దొఱకుటలేదు. ఇంగ్లాండు దేశములో నట్టి మరణములు పది వేలకు నలుబదియైదు మాత్రము కాగా, భారత భూమిలో పదివేలకు రెండు వందల నలుబదియైదు తటస్థించుచున్నవి!

చివఱకు బాల్యవివాహముల యనర్థము తల్లులపాలిటనే గాక బిడ్డలపాలి టను, తత్కారణముగా జాతిపాలిటను పడుచున్నది. భారతజాతిలో పుట్టిన పసిపాపలలో వేయింటికి నూటయెనుబదియొకరు మరణమువాత బడు చున్నారు.

ఈ సందర్భములో ఇంగ్లాండులో వేయింటికి అరువదిగను, జపానులో వేయింటికి ఇరువది నాలుగుగను నున్న శిశుమరణముల సంఖ్యతో పోల్చి

చూచుకొనినచో భారతదేశపు దౌర్భాగ్యము ప్రత్యక్షగోచరము కాగలదు. ఈ దౌర్భాగ్యదశను నివారించుటకు వీలుకలదని జ్ఞాపకముంచుకొన్న, నెడల పరితాపము హెచ్చగును. ఏమన, విషయపరిజ్ఞానముతో గూడిన సంఘాభిమానము లేకపోవుటయే యీ దుర్దశ యథేచ్ఛగా పెరిగిపోవుటకు కారణమగుచున్నది.

ఈ విషయములందన్నింటను నే యీషణ్మాత్ర పురోభివృద్ధి గోచరించినను, అది అత్యంతము మందముగ జరుగుట మహాశోచనీయ మనవలయును. ఉదాహరణకు జూడుడు. **1921** వ సంవత్సరమున ఏడాదిలోపు వయస్సుగల వివాహితలు **9066** మంది యుండగా, **1931** వ సంవత్సరమున అట్టివారి సంఖ్య **44082** కి పెరిగినది. అనగా జనసంఖ్యలో, హెచ్చుదల పదియవవంతు మాత్రమే యైయుండగా యీవివాహితలసంఖ్య ఐదుశెట్లు పెరిగినది. మఱియు **1921** వ సంవత్సరములో ఏడాదిలోపు వయస్సుగల వితంతువులు **759** మంది యుండగా **1931** వ సంవత్సరమునందు అట్టివారు **1515** మంది యుండిరి. ఆ పిమ్మట జనాభా సంఖ్యలు అత్యల్పమగు బాగును మాత్రమే సూచించుచున్నవి. ఈ యనర్థముల తొలగించుటకై సాగింపబడు ఉద్యమముల గమనముకన్న, జనసంఖ్యయొక్క పెరుగుదల హెచ్చగుచున్నది. ఈ కీడులను రూపుమాపుకొనుటకగు తీవ్రచర్యల యవసరము మునుపటికంటె నీనాడు హెచ్చుగ నున్నది. ఈ విషయములో ప్రజలయొక్కయు, పాలకులయొక్కయు కర్తవ్యమును పురికొల్పుటను మించిన యత్యావశ్యకధర్మము భారతదేశనారీజనోద్ధరణమునకు వేఱొక టుండజాలదు.

ఈ సంఖ్యలు మనలనందఱను సిగ్గుతో తలలు వంచుకొనజేయవలసియున్నవి. అయినను అందువలన కీడు తొలగదు. ఈ బాల్యవివాహముల యనర్థము గ్రామములలోను కనీసము పట్టణములలో నున్నంత యున్నది. ఈ సంస్కరణము ప్రధానముగా స్త్రీలపని! పురుషులకును భాగమున్నదనుట నిశ్చయమే.

నరుడు పశువుగా మారినయెడ అతడు తర్క వాదములకు చెవియొగ్గడు. తల్లులే తమ విధాయక ధర్మమును, విశేషాధికారమును గ్రహించునటుల ప్రబోధము చేయవలసియున్నది. వారి కీబోధను స్త్రీలుగాక మఱెవరు చేయగలరు? కాబట్టి, అఖిలభారత మహిళాసంఘమువారు పేరును సార్థకపఱచుకొనునటుల, గ్రామాదులలో తమ ప్రచారమును సాగించవలయునని సూచింప సాహసించుచున్నాను. కరపత్రముల ప్రకటనలు కొంత ప్రయోజనకరములే కాని, అవి పట్టణములందు వసించు కొలదిమంది ఆంగ్లభాషాసంప్రదాయము నెఱింగినవారికి మాత్రమే యుపకరించును. కాని, గ్రామములందలి నారీజనముతోడి పరిచయము సంస్కర్తల కవసరమై యున్నది. ఎన్నడేని అదియు ఘటిల్లిననుగూడ అంతమాత్రాన కార్యము సులభమైపోయిన దనరాదు. ఏదోయొక దినమున, ఏమేని ఫలితార్థమును మనమాశింపగల్గుచో, ఆ తెన్నునసే పని ప్రారంభము కావలసియున్నది. అఖిలభారత మహిళాసంఘమువారు అఖిలభారత గ్రామోద్యోగ సంఘముతో నెన్నడేని చేతులు కల్పుకొందురా? గ్రామ ప్రచారకు లెవరును, స్త్రీలుగాని, పురుషులుగాని యెంతటి ప్రజ్ఞావంతులైనను, కేవలము సంఘసంస్కరణ నిమిత్తము గ్రామవాసుల దాపునకు పోనక్కరలేదు. గ్రామజీవనముయొక్క అన్నియంశములను వారు స్పృశింపవలసియుందురు. గ్రామసేవ యనగా మఱల చెప్పుచున్నాను. యథార్థమగు విద్య-అనగా చదువుట, వ్రాయుట. లెక్కల గణించుట మాత్రమేకాదు. మానవజీవులు జిజ్ఞాసాపరులని భావింప బడుదురు గావున, 'యథార్థమగు వివేకపూర్వక జీవ

నము' యొక్క అవసరములనన్నింటిని గ్రామవాసులు గ్రహించునటుల వారి హృదయములకు వికాసము గలిగించుటే సత్యమగు విద్యాప్రచారము.

## దిక్కులేని విధవలు

శోకహతుడగు మిత్రుడొకడు 17 వత్సరముల ప్రాయముగల యొకబాలిక దుస్థితిని వర్ణింపుచు నుత్తరము వ్రాయుచున్నాడు.

ఆబాలికయొక్క భర్త, రెండు నెలలబిడ్డ, మామ, ఇద్దఱు మఱదులు—అనగాఅత్తవారింటగల యెల్లఱు క్వెట్టా భూకంపమున హతులైరి. విలేఖరి ఆ బాలిక సజీవయై కట్టుబట్టలతో మాత్రము ఆపదతప్పి రాగల్గినదని తెలుపుచున్నాడు. ఆమె వానిపినతండ్రికూతురు. ఆమె నెట్లోదార్చుటో వానికి తెలియుట లేదు. ఆమె నేమి చేయుట? ఆమెకును అపాయము లేకపోలేదు. కాలికి దెబ్బ తగిలినది; అదృష్టవశమున ఎముక విఱుగలేదు. విలేఖరి యిట్లు తన యుత్తరమును ముగించుచున్నాడు :—

ఆమెను లాహోరులో తల్లియొద్ద విడిచినాను. ఆమెకును, ఇతర బంధువులకును ఆ బాలిక పునర్వివాహము చేసికొనిన బాగుండునని సూచన చేసినాను. కొందఱు సానుభూతితో విన్నారు; కొందఱు నా సూచనను విని కినిసినారు. ఈ నా పినతండ్రి కొమరిత వలెనే చాలమంది బాలికలు దుఃఖార్తలైనవా రుందు రనుట నిస్సందేహము. దురదృష్టవంతురాండ్రగు నిట్టి వితంతువుల గూర్చి ఒక సానునయంపుమాటను తెలుపుదురుగాక.

చిరకాల దురభిప్రాయములకు గుఱియైయున్న యిట్టి విషయముల సందర్భమున నాకలముగాని, నావాక్కుగాని యేమి

చేయజాలునో నాకు తెలియకున్నది. పునర్వివాహము చేసి కొనుటలో, భార్యచచ్చిన వానికెంతటి హక్కుగలదో భర్త చచ్చిన యామెకు నంతటి హక్కుగలదని పెక్కుతడవలు వ్రాసి యున్నాను. ఐచ్ఛికవైధవ్యము హిందూమతము నందొక యమూల్యమగు వం మగును; కాని బలాత్కార వైధవ్యము శాప మనవలయును. చాలమంది వితంతువులైన యువతులు, కాయికనిరోధభయ మంతగా నుండదను దిలాసాకంటె, హిందూ ప్రజయొక్క దూషణభయము లేదను దిలాసా పూర్తిగానున్న యెడల, జంకు లేకుండ పునర్వివాహము చేసికొందురని నే చాలవర కభిప్రాయపడుచున్నాను. కాబట్టి, క్వెట్టా ప్రమాదము వలన శోకార్తిప్రాలైన యీసోదరివలె దౌర్భాగ్యదశలో పడియున్న వితంతుయువతులకు పునర్వివాహము చేసికొను ప్రోత్సాహ మీయవలసినదే. వారు పునర్వివాహము చేసి కొన గోరుదురేని నిందారోపణ యుండదని ధైర్యము చెప్పవల యును. మఱియు వారి కనుకూల సంబంధములు కుదుర్చుటకై ప్రయత్నములును చేయవలయును. ఈపని సంస్థలు పూనుకొని చేయదగినది కాదు. ఆ వితంతువులకు బంధువు లయిన సంస్కర్తలు వ్యక్తిత్వేనా యీపనికి పూనవలయును. మఱియు తమ బంధువర్గములో పట్టుదలతోను, మర్యాదతోను, విరసము లేకుండను తీవ్ర ప్రచారము సాగింపవలయును. వారు కృత కృత్యులయిన నసందర్భములందెల్ల ఆ యుదంతములకు బహుళ ప్రచారము గావించవలయును. భూకంపసమయమున వితంతువు లైన బాలికలకు ప్రత్యక్షఫలము ఆ తీరున—మఱియు ఆతీరున మాత్రమే కలుగుట సంభవ మగును. ఈ ఘోరాపదస్మృతి

తాజాగానున్న సమయమున ప్రజాసామాన్యముయొక్క సాను భూతిని సులభముగా సముపార్జింపవచ్చును. ఇప్పు డీ సంస్కారము పెద్దగా సాగినయెడల, సామాన్యపరిస్థితుల యందు వైధవ్యము సంప్రాప్తించిన బాలికలు సయితము ఇష్టముండినచో తేలికగా వివాహములు చేసికొనగల్గుదురు.

## బలాత్కార వైధవ్యము

జూలియస్ సీజరు కాలమునాటి సిసిలీ ద్వీపవాసుడగు 'డియోడరను' అనున్నాతడు 'విశ్వచరిత్ర' యనుపేరు రచించిన చిన్ని పొత్తమునుండి 'వైధవ్యము, సహగమనము'ల గురించి వ్రాసిన యీ దిగువ బోధ్యవ్య విషయమును ప్యారెలాల్ గారు వెలికి దీసినారు:—

"యువకులును, యువతులును వివాహము చేసికొన గోరినప్పుడు తమతల్లిదండ్రుల నిర్ణయము ననుసరించి గాక, పరస్పరామోదముతో వివాహ మాడెడివారు. కాని, యుక్తవయస్సు రానివారి వివాహములు జరిగినప్పుడు వారి విచక్షణయందు లోపములు తఱచుగా జరుగుచు వచ్చినని. ఉభయపక్షముల వారును తమ సంయోగమునుగురించి పశ్చాత్తాపము జెందినప్పుడు చాలమంది స్త్రీలు నీతిచెడి కామాతురత వలన పరపురుషులను మోహించెడివారు. వారు మొదట వరించిన భర్తలను వదలివేయగోరి బహిరంగముగా సగౌరవముగా వదలివేయ జాలక విషప్రయోగముచేసి వారి యాటంకమును తొలగించుకొనెడివారు. ఈ విషమును తమదేశములో వారు సులభముగా నెంతేని సంపాదింప గలిగెడివారు. ప్రాణమునుదీయు శక్తిగల యోషధుల నేక విధము లగునవి కలవు. కొన్నింటిని పొడిచేసి అన్నపానములలో కలిపిన చాలును. మరణము సంభవించెడిది. ఘోరమగు నీ యలవాటు సాధారణ మైపోయి నప్పుడు, చాలమంది ప్రాణములిట్లు నాశనముకాగా, దోషులను దండించినను, అది అట్టి పాపాచరణమునుండి యితర భార్యలను మరలింప సమర్థము కాకుం

టును తెలిసికొనినప్పుడు, భార్య గర్భవతిగా నుండినను, లేక యిదివఱకే పిల్లలగని యుండినను తప్ప, మరణించినభర్తతోపాటు దహనము చేయబడ వలయునని శాసనము గావించిరి. ఆ శాసనమునకు లోబడనియెడల నట్టి స్త్రీ జీవించి యున్నంతకాలము అవివాహితగనుండ వలసినదనియు, అపవిత్రురాలువలె యాగాది క్రతువుల దరిరాకుండ బహిష్కరింపబడవల ననియు శాసించిరి.”

ఈ యుల్లేఖింపబడిన భాగములు ఆ క్రూరాచారముల రెంటియొక్క వ్యుత్పత్తిని యథాతథముగా తెలుపునవగు నెడల, మనపై విధింపబడిన శాసనమువలన సహగమనమును అణచివేసినందుకు మన మెంతయు కృతజ్ఞులమై యుండుటకు హేతువు గలదు. వివాహమనగా నేమియో యెఱుంగజాలని బాలికల నిర్బంధవైధవ్య మనెడి రోగమునుండి హిందూసంఘమును అన్యులవలన విధింపబడు శాసన మేదియు రక్షింపజాలదు. ఈ సంస్కరణము మొదట ప్రజానీకముయొక్క పరిజ్ఞానబలము వలనను, రెండవదిగ వితంతుబాలికలకు వివాహములు చేయ వలసిన ధర్మమును తల్లిదండ్రులు తెలిసికొనుటవలనను సాగ వలసియున్నది. బాలికలు వివాహమాడ నిష్టపడనియెడల, వివాహమాడుట దోషము కాదని వారి మనస్సులకు నచ్చ చెప్పుటవలన సాగింపగల్గుదురు. యుక్తవయస్సురాని బాలికల సందర్భమున నిది సహజ మగును. అట్టి వితంతువులు యుక్త వయస్సు వచ్చినవారి సందర్భమున, వారు వివాహము చేసికొన గోరనిపట్ల, వివాహముగాని కన్యలవలె వివాహమాడుటకు వారికి స్వేచ్ఛ గలదని చెప్పుటకంటె నేమియు అవసర ముండదు. బాలికలును వయస్సువచ్చిన స్త్రీలునుసహా, తమ వెండి బంగారు గొలుసులను, కడియముల నలంకారములుగ భావించు విధ

మును, ఖైదీలు తమ యలంకారములుగ భ్రమించుచో వారి సంకెళులను విచ్ఛేద మొనరించుట చాల కష్టపువని.

## ఆదర్శ సతీత్వము

ఒక బొంబాయి పత్రికలో ప్రకటితమైన సతి లేక సహగమనము సందర్భమున తన యభిప్రాయమును తెలుపుమని శ్రీగాంధీజీని కోరుచు నొక వారీమణి వ్రాయగా ఆ విషయమును గూర్చి శ్రీ గాంధీజీ యిటుల నవజీవన పత్రికలో వ్రాసిరి :—

ఆ సంఘటన ప్రకటనయందు తెలుపబడిన తీరుగ సత్యము కాకుండుఁగాక యనియు, ప్రస్తావనలోని యా నారీమణి జబ్బు వలననో, యేదేని ప్రమాదమువలననో మరణించెననియు, ఆత్మహత్య జేసికొనియుండదనియు ఆకాంక్షింతును. మన పూర్వీకులవలన 'సతి' అన నేమియో వర్ణింపబడియున్నది. ఆ వర్ణన యీనాడును చెల్లును. భర్తయెడల స్థిరతర భక్త్యనురాగములు గలిగి, ఆభర్త జీవితకాలమునందును, తదనంతరమును వానికి నిస్స్వార్థసేవ లొనర్చుటలో కీర్తిని గడించి, మనోవాక్కాయ కర్మములందు నిష్కళంకజీవితమును నడపు స్త్రీ సతి యనబడును. భర్త మరణకాలమునందు ప్రాణత్యాగము చేసికొనుట వివేక కార్యము కాదు. ఆత్మయొక్క స్వభావమును గూర్చిన అజ్ఞానమునే అది సూచించును. ఆత్మ అమరము, నిర్వికారము నంతర్యామియునై యున్నది. అది స్థూలశరీరముతోపాటు నాశమందదు; ఐహికబంధనమునుండి విముక్తి బడయువఱకు నొక యుపాధిని విడిచి మఱొక యుపాధిని పొందుచునే యాత్ర సాగించుచుండును. అసంఖ్యాకులగు ...

లును స్వానుభవముతో నిది యథార్థమని గ్రహించియున్నారు. ఇష్ట మున్నచో నీ నాడును నెవరేనియు దాని ఋజువు చూడ వచ్చును. కావున నీ వాస్తవిక విషయములం బట్టి ఆత్మహత్య యెటుల సమంజసము కాగలదు ?

మఱియు వివాహ మనగా కేవలము స్థూలశరీరముల కల యిక కాదు. ఆత్మలయొక్క సంయోగ మనికూడ దాని భావము. వివాహ మనునది కేవలము స్థూలమగు బాంధవ్య మగుచో, దుఃఖార్తయగు భార్య భర్తయొక్క చిత్రపటమునో, విగ్రహమునో పెట్టుకొని తృప్తిపడవచ్చును. ఆత్మవినాశనము మాత్రము పూర్తిగ నిష్ఫలమనక తప్పదు. మరణించిన జీవి నది పునర్జీవితుని చేయలేకపోగా మర్త్యలోకమునుండి మఱొక జీవిని హరించుచున్నది.

స్థూలోపాధిసంయోగము ద్వారమున ఆధ్యాత్మిక సంయో గమే వివాహముయొక్క పరమాదర్శమై యున్నది. అందు మూలమున నుద్భవమగు ప్రేమ దైవికము లేక విశ్వవ్యాప్తము నగు ప్రేమకుమూలాధారముగ నుపయోగపడవలయును. అమర మూర్తి మీరాబాయి యిట్లు గాన మొనరించుటకు కారణ మదియే : "భగవంతుడే నాదుభర్త – అన్యులు కారు."

దీనిని బట్టి దెలియదగినదేమి ? వివాహము పశువాంఛా తృప్తికొఱకు కాక సాధన మని సతి యెప్పుకొనదు. తన భర్త యందు తన వ్యక్తిత్వము పూర్తిగ లయమొనర్చుట మూలమున నహంకార మమకారరహిత మయిన పవిత్రసేవాధర్మమును ప్రాపించుట కొఱకు సాధనముగా వివాహమును గ్రహించును. అట్టినారీమణి తన సతీత్వమును భర్తమరణకాలమున శవదహ

నాగ్నిలో జొచ్చుట మూలమున ఋజువు చేయజూడదు. కాని సప్తపదికర్మసమయమున తాను చేసిన ప్రమాణమును వైరాగ్య వృత్తివలనను, స్వార్థత్యాగము వలనను, అహంకారరాహిత్య బుద్ధివలనను, భర్తయొక్కయు, వాని కుటుంబముయొక్కయు, దేశముయొక్కయు సేవకై యాత్మార్పణము గావించుకొనుట వలనను, తాను శ్వాసించు ప్రతిశ్వాసమునందును, ఆమె ఋజువు చేయ బూనుకొనును. కాయిక సుఖములను, ఇంద్రియ భోగములను ఆమె విసర్జించును. సంకుచితములగు గృహచ్ఛిద్రముల తోడను, కుటుంబవ్యవహారములతోడను, వైరాగ్యవృత్తితోడను, ఆత్మ శిక్షణమువలనను అధికాధికముగా తన సేవాసామర్థ్యమును వృద్ధి గావించుకొనుచు, తన భర్తతోడ సంపూర్ణముగ నైక్యానుసంధానము గావించుకొనుటవలన, విశ్వము నంతటి తోడి యైక్యాను సంధానమును సాధించుకొనుటకును, తన యవకాశము నంతను సద్వినియోగపఱచును. తాను వివాహమాడిన భర్తయొక్క ఆత్మ మృతిచెందలేదనియు, చిద్రూపమై నిలిచి యున్నదనియు గ్రహించి పునర్వివాహమును గుఱించిన తలంపు నైనను దఱిరానీయదు.

పాఠకు డీసందర్భమున నిట్లు శంకింపబోలును:—

'మీరభివర్ణించు సతి వ్యసనమునచేగాని, పశువాంఛలచేగాని స్పృశింపబడని వ్యక్తి. ఆమెకు సంతానకాంక్ష యుండదు. ఆమె వివాహము చేసికొను టెందులకు ?'

దానికిసమాధాన మిది. ఈనాటి మన హిందూసంఘము నందు అత్యధికుల సందర్భములో వివాహ మనునది వారి యిచ్ఛాను సారము జరుగు విషయము కాదు. పూర్తిగ తల

క్రిందులై పోయిన మన కలియుగమునందు శీలమును కాపాడు కొనుటకును, ఇంద్రియనిగ్రహ సాధనోపాయముగను వివాహమనునది యవసరమైయున్నదని నమ్మువారు గలరు. వివాహ కాలమునందు పూర్తిగ పశువాంఛారహితులుగ లేక కొంత కాలమునందు బ్రహ్మచర్యాచరణ పరాయణులై తమ గృహస్థ జీవితమే తమ పరమావధిని జేర్చు బలతరపరిత్యక్త సాధనమని గ్రహించినవారల సాదృశ్యములను నేను స్వయముగా నెఱుగుదును. నేనభివర్ణించిన 'సతీ' ఆదర్శము ఊహాప్రపంచమును దాటిన స్థానము లేని యొకానొక యసంభవమును, అప్రాప్యము నగు నేదో అఖండబోధమాత్రము కాదు. ఈ మన వ్యావహారిక ప్రాపంచిక జీవితమునందే అనుష్ఠించి సాధింపదగినదిగనే యున్నది. అందు కొఱకే యీ సాదృశ్యముల పేర్కొంటిని.

అయినను, యీ 'సతీ' ఆదర్శమును ప్రాపించుటకై సాధారణముగా ప్రయత్నించు భార్యామాతృత్వమును సయితము పడయునని యొప్పుకొనుటకు నేను సంసిద్ధమే. కాబట్టి పైన పేర్కొనిన వివిధలక్షణములతోపాటు పిల్లలను పెంచుట యెట్లో, వారికి శిక్షణ గఱపుట యెట్లో యను విషయముల జ్ఞానము సయితము నేర్చియుండవలయును. ఆమె బిడ్డలు యథార్థమగు దేశసేవకులుగా తయారు కావలసియుందురు.

ఈ పైన నేను పేర్కొనిన యంశము లన్నియు భర్తకు కూడ సమానముగా నన్వయించును. తన విశ్వాసమును, అఖండపతిభక్తిని, భార్య విధిగా చూపవలసియున్న తీరుననే భర్తయు తన విశ్వాసమును, పూర్ణాభిమానమును భార్య యెడల చూపవలసియుండును. ఒకపక్షమున నొకరీతి పరిమాణ

ప్రమాణములను, రెండవ పక్షమున వేఱొకరీతి పరిమాణ ప్రమాణములను నియమింప దగదు. ఐనను మరణించిన భార్యతోపాటు శవదహనాగ్ని కాహుతియైన భర్తనుగూర్చి యెందేని విని యున్నామా ? భర్త మరణసమయమున విధవయైన స్త్రీ సర్వార్పణము గావించు నాచారమునకు మూఢ విశ్వాసాజ్ఞానములును, పురుషుని యహంకారమత్తతయు హేతువులై యుండునని మనము సులభముగా నంగీకరింప నగును. అటులగాక యొకానొక కాలమున ఆ యాచారమునకు సార్థకత యుండెనని ఋజువు చేయు నవకాశమున్ననుకూడ, ఈ కాలమున ఆయాచారము అనాగరకచేష్ట యనక తప్పదు. భార్య యనగా భర్తయొక్క బానిసకాదు; ఆమె వానియొక్క సహధర్మచారిణి.ఆతని'అర్ధాంగి' యనియు,'సహవాసిని'యనియు, 'సహూద్యోగిని' యనియు ప్రసిద్ధికలదు. ఆమె వానితోడ సరిసమానహక్కులను, సరిసమాన విధులను పంచుకొను సర్వత్ర గల భాగస్వామినియై యున్నది. కాబట్టి, భార్యాభర్తలు పరస్పరము పాటింపదగిన విధులను, లోకము నెడ నిర్వర్తింప వలసిన ధర్మములును అభిన్నములుగ నుండును. అవి యొండొరులను బంధించునవిగను నుండును.

కాబట్టి, ప్రస్తావనలో నున్న సోదరియొక్క ఆత్మబలి యర్పణము వ్యర్థమైన దనుకొనెదను. ఆమె ఆదర్శముగా నితరు లనుసరించుటకు దగినది అని యనలేము. మరణించుటలో నామె సాహసమును నేను మెచ్చుకొనుట లేదాయని నన్నడుగ వచ్చును. నా అంతరాత్మ సాక్షిగా 'లే' దనియే నాజవాబు. ఇట్టి సాహసము నే, దుర్మార్గులు చూపుట నెఱుగనా ? అయి

నను అందుకొనుటకై యెవరును వారి నభినందింపజూడరే! ఆత్మ హత్యను విచక్షణలేకుండ కొనియాడుటవలన అజ్ఞానభరితయగు నేసోదరినో, బుద్ధిపూర్వకముగ కాకుండనైనను, నేను అప మార్గమున పెట్టినవాడను కానేల? 'సతీత్వ' మన పావిత్ర్యము; ఒక పరమపూర్ణావస్థ! మరణించుటమూలమున అట్టి పావిత్ర్యా దర్శము ప్రాపింప గల్గుట కల్ల. అనుదినము సాగించు నిరంతర సాధనవలనను, నిరంతరాత్మార్పణభావము వలనను మాత్రమే ఆ పరమగమ్యమును చేరుట సాధ్యము కాగలదు.

## ఆదర్శ దుర్వినియోగము

బాలవితంతువుల పునర్వివాహమును గుఱించిన యొకరి లేఖలోని యంశములు:-

బాల వితంతువులకు వారి తల్లిదండ్రులు పునర్వివాహము చేయవలయునని మీరనుచున్నారు. కన్యాదానము, అనగా శాస్త్రవిధి ననుసరించి తన కొమార్తె లను వివాహమునందు దానముచేసిన తల్లిదండ్రులు పునర్వివాహము చేయ గల్గు టెట్లు? తమ యల్లునిగూర్చి తమ కుమార్తెపై తమకుగల స్వామ్యముల నన్నింటిని భక్తిపూర్వకముగ పరమ పవిత్రక్రతువుద్వారా త్యాగమొనరించిన తల్లిదండ్రులు, ఆయల్లుని మరణానంతర మా కుమార్తెను మఱొక పురుషునికి ఒసగు టెట్లు సాధ్యపడగలదు? ఇష్టమున్నచో ఆమెయే వివాహము చేసికొన వచ్చును. కాని ఆమె తనతల్లిదండ్రుల వలన తనభర్తకు దానముగా నొసగబడి యుండెగావున, ఆభర్త మరణానంతరమును పెండ్లిచేరట నామె నెవరికేనిఇచ్చి వేయుట కిప్పుడు ప్రపంచములో నెవరికిని అధికారముండదు.అదేకారణముచేత, తనభర్త మరణసమయమున అతడు విస్పష్టమగు సమ్మతి నొసంగియుండిన తప్ప, ఆమె పునర్వివాహము చేసికొనును నెడల, విశ్వాసశూన్యురాలును, పతిభక్తి విహీనురాలుననిపించుకొనును. విచక్షణదృష్టితో చూచు నెడల, చాలమంది

సనాతనులలో ఆచారముగనున్న కన్యాదానవిధి ప్రకారము వివాహము చేయబడిన వితంతువు-ఆమె పసిబాలయైనను, యువతియైనను, వృద్ధయైననుతన భర్త పునర్వివాహము చేసికొనుటకు అనుజ్ఞ నిచ్చియుండనిచో, తిరిగి పెండ్లి చేసికొనుట సాధ్యపడునదికాదు. మఱియు సత్యముగ సనాతనుడగు భర్త ఎవడును అట్టి యనుజ్ఞ నిచ్చుట కోడంబడడు. అందుకుమారుగా తనభార్య శక్తియున్నచో సహగమనము చేయుటకే యిష్టపడును; లేదా యెటులో తనను స్మరించుకొనుచు మిగత జీవితకాలమును గడుపగోరును. అట్టి పాతివ్రత్యము ఈశ్వరభక్తి చర్యయే కాగలదు. ఈరీతిగా నతడు కోర్టులో హిందూవివాహము యొకటియు, వైధవ్యధర్మము యొకటియు ఉన్నతాదర్శముల సంరక్షించు నుద్దేశ్యమే వానిని ప్రేరేపించును. హిందూ వివాహము, వైధవ్యధర్మము రెండును పరస్పరము ఏకధర్మాంగములేగాని స్వతంత్రవిషయములు గావు.

ఇట్టి వాదనలు మహోన్నతాదర్శమును దుర్వినియోగము చేయుటగా నేను భావింతును. విలేఖరి సదుద్దేశ్యముతో వ్రాసినాడనుట నిస్సంశయమే. కాని, స్త్రీ పాతివ్రత్యమును గుఱించిన వాని యత్యాతురపాటు ప్రాథమిక న్యాయసూత్రమును విస్మరింప జేసినది. పసిబిడ్డల సందర్భములో కన్యాదాన మన నర్థమేమిటి? తన బిడ్డలపైన సొత్తుపైనవలె తండ్రి కేమేని స్వామ్యముండునా?

అతడు వారిసంరక్షకుడే గాని యజమానియా? తనపోషణలో నున్నవారి క్షేమలాభముల నతడు బేరములో పెట్టి యమ్మివేయ జూచుచో, వాని పోషణాధికార గౌరవములను కోల్పోవును. మఱియు దానమును గ్రహించు నధికారము బడయని యొక పసివానికి దాన మిచ్చుటెట్లు? దానస్వీకారాధికారములేని పట్ల దానమే లేదు. కన్యాదాన మనునది

ఆధ్యాత్మికభావగర్భితమైన పరమరహస్యమగు మతక్రతు వనుట నిశ్చయము. అట్టిసందర్భములో శబ్దార్థమును బట్టుకొని వాదులాటకు దిగుట భాషను, మతమును దుర్వినియోగము చేయుటగును. అట్లగుచో, పరమార్థభావగర్భితమైన పురాణములయొక్క శబ్దార్థమునే ప్రధానముచేసి, భూమి వేయితలలుగల పాము నెత్తిన పెరుగు నొక పళ్లెరమువలె నున్నదనియు, పరమేశ్వరుడు పాలసముద్రమధ్యమున నొక యాకును పడకగాగొని నిద్రపోవుననియు యథాతథముగ విశ్వసించుటయు చెల్లుననవలసినదే యుండును!

పసిబిడ్డగా నుండిన తన కుమార్తెను బుద్ధిచాంచల్యముతో వ్యసనగ్రస్తుడగు ముసలివానికో లేక యిరువది యేండ్లలోపు బాలునకో యిచ్చి పెండ్లిచేసి తన సంరక్షణాధికారమును దుర్వినియోగము గావించు తండ్రిగాని, తల్లిగాని ఆబిడ్డ వితంతువగుపట్ల ఆమెకు పునర్వివాహము చేసి యైనను తమ పాపమునకై ప్రాయశ్చిత్తము చేసికొనుట సమంజసము. నే నిదివరలో నొకసారి వ్రాసినటుల అటువంటి పసివారల వివాహములు మొదటనే చెల్లవనుశాసనమున్నచో బాగుండును.

## వితంతు పునర్వివాహము

ఒక మిత్రుడిటుల తన మనోవేదనను తెలుపుచున్నాడు:—

దుఃఖార్తలగు మన వితంతుసోదరీమణుల గూర్చి మీరేమేని యెందుకు వ్రాయరు? పూర్వాచార పరాయణులగు వారి తల్లిదండ్రులును పోషకులును సహేతుకమగు దేనిని చెవిసోకనీయరు. వితంతువులే యుద్యమ ప్రారంభము చేయుటకు లేల మీరు ప్రోత్సహించుట లేదు?

ఇంకను నెన్నియో దురాచారములు మనలో నున్నవి; అసహ్యపు కట్నాలపద్ధతి, గర్భాదాన సమయమునను, ఎవరేని మరణించినప్పుడును సంతర్పణములు చేయుట మున్నగు నవెన్నియో కలవు.

వితంతువుల పునర్వివాహములు కొంత పరిమితిననుసు నవసరములే. కాని మన యువకులు పవిత్రులు లయినప్పుడే ఆసంస్కారణము సాగగలదు. వారు పవిత్రులేనా? వారి విద్యాభ్యాసము వలన వారికేమేని ప్రయోజనము కలుగుచున్నదా? పసితనము నుండియు బానిస ప్రవృత్తి మనలో పట్టుదలతో ప్రవర్ధనము గావింపబడుచున్నదిమనము స్వతంత్రముగా యోచనయే చేయజాలని స్థితిలో నుండ నిక మనము స్వతంత్రముగా కార్యాచరణము చేయజాలు టెట్లు? కులకట్టుడులకును, విదేశ విద్యావిధానమునకును, పరదేశీయుల పరిపాలనకును సమానముగా బానిసలమై యున్నాము. మన కేయే సదుపాయము లొసగబడుచున్నను, అవి యన్నియు మనకు సంకెళులే యగుచున్నవి. మనలో నెందఱు తమ స్వంత ఇండ్లలోనున్న వితంతువుల గతిని గూర్చి యాలోచించువారు గలరు? డబ్బునకు కక్కుఱితి పడనివారెంత తక్కువగ నున్నారో చూడుడు. ఆ వితంతువులను తమ తోబుట్టువులుగను, తల్లులుగను చూచి వారిమర్యాదను కాపాడ జూచువారి సంఖ్య యెంత స్వల్పముగ నున్నదో! తమ ధర్మ ర్ణయమునకు కట్టుబడి నిలిచి, కులమువా రేమిచేసినను సరియే యని సాహసించువా రెంత యరుదుగా నున్నారో! పాపము, దిక్కుమాలిన వితంతు వెవరి ప్రాపు కోరుట? నేనామె నెట్లోదార్చగలను? 'నవజీవన' పత్రికను చదువువారు వారిలో నెందఱుందురు? చదువుదురుపో, అకోలది మందిలో నెందఱు తమ

నిర్ణయముల ననుసరించి నడవ గల్గుదురు? అయినను గూడ నే నప్పుడప్పుడు 'నవజీవన' పత్రికలో వితంతు విలాపముల విని పించుచునే యున్నాను. అవకాశ మున్నచో నింకను అటుల చేయగలననియే నాయాస! ఈలోపుగా తమ పోషణలో బాలవితంతువు లున్ననా రెల్లరు వారికి వివాహములు చేయుట తమ విధిగా పాటింతురు గాక యని వారికి మనవి చేయు చున్నాను.

ఈ విలేఖరి మన సాంఘికాచారము లెంత ఘోరముగ నున్నవో బాగుగ వెల్లడించియున్నాడు. సంఘ మంతయు శిథిలమైపోయి యుండ, ఇక్కడ నక్కడ నేవిహా అతుకులు బొతుకులు పెట్టినంతమాత్రాన మనకు తృప్తి కలుగు టెట్లు? ప్రేతకర్మల సందర్భమున సంతర్పణలు చేయుట శుద్ధఅనాగరక కార్యము. గర్భాదాన సమయపు సంతర్పణ లందుకు తీసిపోవు. ఇవియు, నింక నిట్టి యాచారములును శ్రద్ధగా విచారింప దగి నవియే. మన ప్రజల నైతిక ప్రబోధముతోడను, యోచనా స్వాతంత్ర్యముతోడను మాత్రమే సంపూర్ణ సంస్కరణ సాధ్యము కాగల్గును. ఎంతకాలము మన యోజనయు, మనచర్యయు స్వాతంత్ర్యహీనములై యుండునో అంతకాలమును మనము సాగించు నతుకు బొతుకుల పనులు కేవలము వ్యర్థములై పోక తీరదు.

## నిరుద్ధ మానవసంఘము

అస్పృశ్యులు మాత్రమే నిరుద్ధమానవసంఘము కాగా. హిందూసంఘమున బాలవితంతు వ్యక్తికన్న తక్కువ స్థితి ననుభవించు టలేదు. వంగదేశము నుండి ఒక రిట్లు వ్రాయుచున్నారు :—

మహమ్మదీయులలో వితంతు పునర్వివాహమును గురించి యేలాటి నిషేధమును లేదు; మరియు ఒక పురుషుడు నలువురు భార్యల వఱకును పెండ్లి చేసికొనుట కవకాశ మున్నది. యథార్థమునకు మహమ్మదీయు లనేకులు ఒకరు తక్కువ హెచ్చుమంది భార్యలనే చేసికొనుచున్నారు. కాబట్టి మహమ్మదీయులలో పురుషు లెవ్వరును వివాహము లేనివారై పోవుటలేదు. కావున వితంతుపునర్వివాహమున కాటంకము లేని సంఘములలో, స్త్రీల సంఖ్య పురుషుల సంఖ్యకంటె చాల హెచ్చుగానున్నదనుట సత్యముకాదా? మరియు వితంతు వివాహము లంగీకృత మగు సంఘములందు బహుభార్యాత్వము సయిత మంగీకరింపబడవలసియుండు ననుటయు నిజమే కాదా?

హిందువులలో వితంతు వివాహములు సామాన్యములైనయెడల, తరుణ వయస్కులగు వితంతువులు తమను పెండ్లాడు నటుల యువకులను ప్రోత్సహించి, అసలు వివాహమే కానట్టి బాలికలకు వరులు దొఱకుటే అసంభవముగ నొనర్పరా?

అప్పుడు హిందూపురుషుడు ఒకరు భార్యకంటె హెచ్చుమందిని వివాహము చేసికొను నవకాశము లేనియెడల, ఇప్పుడు వితంతువులు చేయుచున్నటువంటి గాని, లేక చేయుచున్నారని యనుమానించుచున్నటువంటి గాని పాపకార్యముల నన్నిటిని అవివాహితలగు బాలికలు కావించకుందురా?

వితంతువివాహములను ప్రతిపాదించునప్పుడు విచారణలోనికి దీసికొనవలసియుండు ప్రేమభావము, పవిత్రమగు గార్హస్థ్యజీవనము, పతివ్రతా ధర్మము మొదలగు విషయములను గురించి మీకు జ్ఞప్తిచేయకయే విడుచుచున్నాను.

వితంతువులు పునర్వివాహము చేసికొనకుండ నడ్డు వెట్టు నుత్సాహములో పడి, విలేఖరి చాల విషయములను విస్మరించుచున్నాడు. మహమ్మదీయులు ఒక్క భార్యకంటె హెచ్చు మందిని, పెండ్లాడు నవకాశ మున్నమాట నిజమే. కాని,వారిలో

నధికసంఖ్యాకు లొక్కొక్క భార్యను మాత్రమే చేసికొను చున్నారు. హిందూమతము బహుభార్యాత్వమును నిషేధించుట లేదని పాపము విలేఖరికి తెలిసియున్నటుల లేదు. హిందువులలో గొప్పగొప్పవారు ఒక్కభార్యకంటె హెచ్చుమందిని చేసికొనుట తెలిసిన విషయమే. చాలమంది సంస్థానాధీశులు అసంఖ్యాకులను పెండ్లాడుదురే! ఇంకను వితంతు వివాహము ఉత్తమకులములలో మాత్రమే నిషేధింపబడు చున్నదనియు విలేఖరి ఘోషించుచున్నాడు. చతుర్థకులమునకు చెందిన యనేకులలో వితంతువులు నిరాఘాటముగా వివాహముల చేసికొందురు. అయినను అనర్థము లేవియు మూడుట లేదు. ఒక భార్యకంటె హెచ్చుమందిని స్వీకరించుట కవకాశమున్నను గూడ సామాన్యముగా నెప్పటికప్పుడు ఒక్కరుకతోడనే వారు తృప్తిపడుచున్నారు.

తరుణవయస్కలగు వితంతువులు యువకపురుషులనందఱను తామె గ్రహింతురనియు, అవివాహితలగు బాలికలకు వరులు దొఱకకుండ జేతురనియు విలేఖరిచేసిన సూచన సంఖ్యాప్రమాణ తారతమ్య మెంతమాత్రము నతడెఱుగడని తెలుపుచున్నది. తరుణవయస్కలగు బాలికల శీలమునుగూర్చి మితిమీరిన హాని యాందోళన వానిమనస్సుస్వస్థముగ లేనట్లును సూచించుచున్నది. కొలదిమంది వితంతువులు పునర్వివాహము చేసికొనుటవలన అనేకసంఖ్యాకలగు కన్యలకు పెండ్లి యవకాశము లేకుండ బోవు టెన్నడును సంభవించదు. ఒకవేళ నటువంటి సమస్యయే సంభవించునెడల అదియీనాడు జరుగుచున్నట్టి అతిబాల్యవివాహముల

ఫలితార్థమని గ్రహించవలసియుండును. అటువంటివిపత్తునకు పరిహార మతిబాల్యవివాహముల నిషేధింప వలసియుండును.

పసితనములోనున్న వితంతువు సందర్భములో ప్రేమ, గృహస్థజీవనపవిత్రత మున్నగువాని గొడవ నెంతతగ్గించిన నంత మంచిది.

కాని, యీవిలేఖరి నాయభిప్రాయము నసలే గ్రహింపజాలక పోయినాడు. సర్వోపర్వత్రా వితంతువివాహములు జరుగవలయునని నేనెన్నడును ప్రతిపాదించుటలేదు.

సర్ గంగారాముగారు ప్రోవుచేసినట్టియు, నీపత్రికలో సంగ్రహరూపమున జూపబడినట్టియు సంఖ్యావివరములు పదునైదుసంవత్సరముల యీడువఱకుగల వితంతువులకు సంబంధించినవి మాత్రమే. పాపమీ దౌర్భాగ్యజీవులకు పాతివ్రత్యధర్మమన్న నేమియో తెలియదు. ప్రేమయన వారెఱుగనే యెఱుంగరు. ఈ బాలికలకువివాహమేకాలేదనినచో నెక్కువనిజమును చెప్పినట్లగు. వివాహమనగా, అది యుండవలసిన తీరున ఒక పావనక్రతువును, నవ్యతరజీవన హేతువైనయెడల, వివాహమాడవలసిన కన్యలు పూర్ణపరిణామదశ నందియుండవలయును; తమ జీవనసహధర్ము లవరించుటలో ప్రమేయముగలవారై యుండవలయును; మఱియు తమచర్యల సాధకబాధకముల గ్రహించినవారుగా నుండవలయు. కేవలము పసివారల సమాగమమును గార్హస్థ్యమనుటయు,నందు పతియని పేర్కొనబడు పసివాడు చనిపోవుచో ఒక పసిబాలకు వైధవ్యమును విధించుటయు, మానవునియెడలను, మాధవునియెడలనుగూడ ఘోరాపచారమేయగును.

యథార్థమగు హిందూవితంతు వొక పెన్నిధియేయని నేనెంతును. ఆమె, హిందూమతము మానవజాతి కనుగ్రహించిన యొక వరప్రసాద మనందగును. శ్రీరామాబాయి అటువంటి వరప్రసాదము! కాని బాలవితంతువుల యునికి హిందూమతమునకే యొక మచ్చ యనక తప్పదు. శ్రీరామాబాయి యున్నను ఆమచ్చ కొక పరిహారము కాజాలదు.

## బాలభార్యలు — బాలవితంతువులు

చెన్నపురి పచ్చయప్పా కళాశాలలో శ్రీ గాంధీజీ తన యుపన్యాసమున నిటుల వాక్రుచ్చిరి :—

ఒక తమిళ విద్వాంసుడు బాలవితంతువుల గురించి విద్యార్థుల కుపన్యసింపు డని నాకు వ్రాసినాడు. ఈరాష్ట్రము నందలి బాలవితంతువుల యిక్కట్లు, భారత దేశమందలి యితరప్రాంతముల బాలవితంతువుల యిక్కట్లకన్న చాల మిక్కుటముగ నున్నవని ఆయన తెలుపుచున్నాడు. ఈ వాక్యముయొక్క యథార్థతను పరీక్షించుటకు నా కవకాశము చిక్కలేదు. కాని, నాచుట్టు నున్న యువకజను లగు మిమ్మును నేను కోరున దేమన, మీ కొకింత యౌదార్యోపేతమగు సాహసభావము గలిగియుండు డనుటే. మీ రద్దానిని కలిగియుంటిరా, మీకొక చక్కని సూచన చేయుచున్నాను. మీలో నధికసంఖ్యాకులు వివాహము కానివా రనుకొనెదను. మీలో చాలమంది 'బ్రహ్మచారు'లనియు నమ్ముచున్నాను. మీలో చాలమంది యనుటకు కారణమేమన, విద్యార్థులెట్టివారో నే నెఱుగుదును. తనతోడి దగు నొక బాలికపై కామదృష్టిని పోనిచ్చిన విద్యార్థిని 'బ్రహ్మచారి' యన దగదు. వితంతువు కానట్టి బాలికను

పెండ్లాడనని శపథము చేయుడని కోరుచున్నాను. వితంతు బాలికకై వెదకుడు; వితంతు బాలిక లభింపదా వివాహమే మానుకొనుడు. ఆదీక్షనుపూని దానిని లోకమునకు చాటుడు; మీ తల్లిదండ్రులకును, వారు లేనిచో మీ తోబుట్టువులకును ప్రకటించుడు. నిర్దుష్టముగా నుండుటకై వితంతుబాలికలని వాడుచున్నాను. కారణ మేమందురా వివాహము పేరిట జరుగు కలాపమునందు సమ్మతి నొసగుటలో పాల్గొనజాలని పదిపదునైదేండ్లలోపు బిడ్డలను, వివాహమైన పిమ్మట తన భర్తయనబడు వానితో నెన్నడును కాపురము చేసియుండని పసిబిడ్డను, హఠాత్తుగా వితంతువని పేర్కొనుటను నేను సహింపను; ఆమె వితంతువుకాదు. అది అపార్థకల్పనము. భాషను దుష్ప్రయోగము చేయుటే పరమ పాతక కార్యము. హిందూమతమునందు వితంతువనెడు శబ్దమునకు పవిత్రభావము కలదు. వితంతువుగా జీవనముగడపు టన నేమియో యెఱింగిన కీర్తిశేషురాలగు రామాబాయి రణదేవివంటి వితంతువునకు నేను పూజ లర్పింతును. కాని తొమ్మిదేండ్ల పసిబిడ్డకు భర్తయననేమో తెలియదే. అటువంటి బాలవితంతువు లీరాష్ట్రమున నుండుట సత్యము కాదందురా నావాదము నేలకూలినట్లే; లేక, అటువంటి బాలవితంతువులు గలరా, మఱియు మీ రా కళంకము నుండి పునీతులు గాగోరుదురా, వితంతుబాలికలనే పెండ్లాడుటకు దీక్షవహించుడు. ఒకజాతి కావించు నిట్టి పాపములన్నియు నాజాతిని కాయికముగా పట్టి పీడించునని విశ్వసించు నంతటి మూఢవిశ్వాసము గలవాడను నేను. ఇట్టి మనపాపములన్నియు ప్రోగై మనలను బానిసల గావించి యణగద్రొక్కు చున్నవని

నానమ్మకము. మీరూహ చేయఁగల్గినంత శ్రేష్ఠమైన రాజ్యాంగపద్ధతి 'హౌస్ ఆఫ్ కామన్సు' వారినుండి యెగిరివచ్చి మీ శిరస్సులపై వ్రాలు ననుకొనుడు. ఆ రాజ్యాంగపద్ధతిని వినియోగము చేసికొనుట కర్హతగల స్త్రీలును, పురుషులును మీయం దుండురేని, అది స్వర్గమే కాగలదు. తన నైసర్గిక ప్రాథమికావసరములను దీర్చుకొనుటకై కోరుపట్ల బలాత్కారముగా నష్టపెట్టబడిన వితంతు లోక ముండక యున్నను, అంతకాలము స్వపరిపాలనము చేసికొనుటకు గాని, ఇతరుల పాలించుటకు గాని, లేక ముప్పదికోట్ల ప్రజగల మహాజాతి యొక్క గతిని నిర్ణయించుటకు గాని అర్హులగు పురుషసంఘమని మనము చెప్పకొనగల్గుటసంభవ మగునని మీ రూహింతురా? అది మతమ్ము కాదు; దుర్మతము. హిందూమతాభిమానభరితుడనైయే నే నిట్లనుచున్నాను. నాలోని పాశ్చాత్యభావము లిట్లు పలికించుచున్నవని పొరబడకుడు. నిష్కళంకమగు భారతమాతృభక్తితో నిండి నిబిడీకృతమైన హృదయముగలవాడ నని చెప్పకొనగలను సుడీ. నేను పాశ్చాత్యులనుండి చాల విషయములను గ్రహించి జీర్ణించుకొనిన మాట నిజమే. కాని, యిది యట్టిది కాదు. ఇటువంటి వైధవ్యమునకు హిందూమతమున ప్రమాణమేదియు లేదు.

నేను బాలవితంతువుల గూర్చి చెప్పిన దెల్ల బాలభార్యలకును అనువర్తించును. పదియారేండ్ల వయస్సునకు లోపుగల బాలికను పెండ్లియాడబోనను నంతవఱకైనను మీరు రూఢిగా కామనిగ్రహము పూనునట్టి సమర్థులు కావలయును. నాయిష్టమునకు వదలుచో కనీస మిరువదేండ్లవఱకైన పెంచ నెంతును.

భారతదేశమునందు నయితము ఇరువదేండ్లు శ్రేష్ఠమైనదే యగును. బాలికల అకాలప్రౌఢిమకు బాధ్యులము మనమేగాని భారతదేశపు శీతోష్ణములు కావు. ఏమనియెదరేమొ; ఇరువ దేండ్ల ప్రాయపు బాలికలను విశుద్ధశీలము గలవారిని, కళంక రహితవర్తనలను తమ్మనుసరించి తీవ్రముగ రేగుచున్న యౌవన వేశ ముల నిగ్రహింప జాలిన వారి నెందఱినో నే నెఱుగుదును. ప్రౌఢత్వముంజూచి ముచ్చట పడకుందుముగాక. బ్రాహ్మణ విద్యార్థులు తా మీమాత్రము ననువర్తింప జాలమనియు, పదు నారేండ్ల వయస్సుగల బ్రాహ్మణవధువులు దొఱుకరనియు, నావయస్సు వచ్చువఱకు తమకూతుళ్ళకు పెండ్లి చేయకుండ నుంచు బ్రాహ్మణులు చాల నరుదుగనుందురనియు, పదమూడు, పదిరెండు, పదేండ్లకు లోపుగ బ్రాహ్మణబాలికలను వివా హము చేయుదురనియు మీకు నాతో వాదింప వచ్చును. అప్పుడా బ్రాహ్మణ విద్యార్థులకు నేను చెప్పునదిది: మీ రాత్మనిగ్రహము పూనజాలని యెడల బ్రాహ్మణత్వమును విసర్జించి వేయుడు. బాలప్రాయమున వితంతువై పదునారేండ్ల వయస్సువచ్చిన బాలికలను వరించుడు. ఆప్రాయపు బ్రాహ్మణ వితంతువు లభించనిచో, మీ కిష్టమగు నేబాలిక నైనను చే పట్టుడు. పదిరెండేండ్ల బాలికను బలాత్కరింప బూనుటకంటె వర్ణాంతర (మతాంతర) వివాహము చేసికొనిన బాలుని హిందు వులదైవతము తప్పక క్షమించునని నేను మీకు తెలుపు చున్నాను. మీ హృదయములు పవిత్రవంతములు గాక, మీ కామముల నడంచు కొనజాలరేని విద్యావంతులగుటయే మానివేయుడు. మీ విద్యాలయము సద్గ్రంథముగు విద్యాలయము

మని మీరు పేరొందిరి. కావున, శీలమునం దగ్రగణ్యులు గాదగిన బాలురను సిద్ధముచేయునట్టి అగ్రగణ్యసంస్థయను పేరును నిలువబెట్టుతీరున మీరు జీవితముల గడపవలయునని నేను కోరుచున్నాను. శీలరహితమగు విద్య యేపాటిది? సాధారణ పవిత్ర వర్తనము శూన్యమగుచో నాశీల మేపాటిదగును? బ్రాహ్మణత్వ మన నేను భక్తి జూపుదును. వర్ణాశ్రమధర్మ పక్షముపూని వాదించువాడను నేను. అయినను అస్పృశ్యతను సహించు బ్రాహ్మణత్వము – కన్యావైధవ్యమును సైచు బ్రాహ్మణత్వము– కన్యకల చెఱజూచి యోర్చుకొను బ్రాహ్మణత్వము నాకు సహింపరానివి. అట్టిది బ్రాహ్మణత్వమునొక్క అపహాస్యస్వరూప మనందగును. అందు బ్రాహ్మణోచితవిజ్ఞానము లేదు. యథార్థమగు శాస్త్రార్థవివరణ మందు చూపట్టదు. అట్టిది కేవల పశుత్వము. సత్యమగు బ్రాహ్మణత్వ మంతకన్న నెంతో విశుద్ధమైనది. ఈ నా కొలదిపాటి విమర్శనావాక్యములు మీ హృదయములందు గాఢముగ నాటుకొను గాక. నేనిట్లు ప్రసంగించుచుండగా నే నీ బాలురను కనుపెట్టి చూచుచున్నాను. ఇట్లు నా హృదయావేదనను వెలిబుచ్చు కొనుచుండగా నొక్కరు ముసిముసినవ్వులునవ్వుట నాచెవులబడి, నామనస్సు చివుక్కు మనినది. నేను మీ మేధస్సులతో సల్లాపమునకు రాలేదు; మీ హృదయములగూర్చి మొఱలిడుటకు వచ్చి యున్నాను. దేశమాత మీపై యాశ లిడుకొని యున్నది. నేనిప్పుడు చెప్పినది మీ కవశ్య మక్కఱవచ్చు విషయముసుడీ!

## ఆవేశపూర్వకాధిక్షేపము

ఒక వంగదేశపుపాఠశాల ప్రధానోపాధ్యాయు డిటుల వ్రాయుచున్నాడు :-

చెన్నపురిలో విద్యార్థులకు, వితంతుబాలికలను మాత్రమే వివాహము చేసికొను డనుచు మీ రొసగిన సలహాయును, నుపన్యాసములును మమ్ము భయకంపితుల జేసినవి. కావున వినయపూర్వక మయ్యు ఆవేశపూర్వకము నగు నా యధిక్షేపమును తెలుపుకొనుచున్నాడను.

హిందూవితంతువులకు ప్రపంచములో ఘనతమము లేక అత్యున్నతతమ మగు స్థానము నొసగిన యావజ్జీవబ్రహ్మచర్యము నవలంబించు నుత్సాహమును వమ్ముచేయుటకే ఆతీరు సలహా ఉపకరించును; మఱియు ప్రాపంచికభోగ మనెడు కల్మషమున బడద్రోసి, ఒకటిజన్మలో బ్రహ్మచర్యదీక్షద్వారమున మోక్షమును ప్రాపించు నవకాశమును నాశనము చేయును. వితంతువులయెడ నీవిధముగా మీరు చూపు సానుభూతి వారికెంతయు ననర్థదాయక మగును; మఱియు నెవరి పెండ్లి సమస్య ఇకాలమున కష్టసాధ్యమును క్లిష్టతరము నై పోయినదో అట్టి కన్యలకు మిక్కిలి అపకారకరముగ నున్నది. మీయొక్క వివాహసిద్ధాంతము జన్మాంతరమును గూర్చియు, పునర్జన్మమును గూర్చియు, నింకను ముక్తిని గూర్చియు సయితము హిందువుల సిద్ధాంతములను తల్లక్రిందులుచేసి వేయుచున్నది; మఱియు హిందూజాతిని మాకు క్రీతికరము గాజాలని పరజాతుల స్థితికి దిగద్రోయునదిగ నున్నది. మనజాతి అవినీతిపాలైన దనుట నిస్సంశయమే; అయినను హిందూపరమాదర్శములకై మన దృష్టిని మరల్చుకొని, చేతనైనంత త్వరితగతిని ఊర్ధ్వగమనము చేయ ప్రయత్నము చేయవలయునేగాని అన్యజాతుల సాదృశ్యములకును, ఆదర్శములకును పరాధీనులమై పోవగదు. అహల్యాబాయి, రాణీ భవానీ, బేహులాదేవి, సీత, సావిత్రి, దమయంతి మున్నగు నారీరత్నముల యాదర్శములు హింధూజాతికి దారిజూపుగాక. వారి యాదర్శముల ననుసరించి మనము సంఘమును నడపుదముగాక. కాబట్టి యిట్టి క్లిష్టసమస్యలమీద మీ యభిప్రాయములను కట్టిపెట్టి, సంఘము దేనిని శ్రేష్టమని భావించునో దాని ననుసరింపనిండని మిమ్ము నత్యంత వినయముతో వేడుకొనుచున్నాను.

ఈయప్రదేకపూర్వకాధిక్షేపము నన్ను పశ్చాత్తప్తుని చేయుట గాని మార్చుటగాని లేదు. స్వతంత్రేచ్ఛ గలిగినట్టియు, బ్రహ్మచర్యమహిమను నెఱింగినట్టియు, దాని ననుష్ఠించు దీక్షగలట్టియు నొక్క వితంతువు నైనను నాసలహా తన యుద్దేశమును మార్చుకొన జేయుదు. కాని, వివాహపుతంతు నడచు కాలమున, వివాహ మన నర్థమునే యెఱుగనట్టి పసివారుగా నుండిన బాలికలకు నాసలహా, వారనుసరించిన యెడల, చాల దుఃఖశాంతిని గూర్చగలుగును. వారి సందర్భమున 'వితంతువు' అనెడు పదమును ప్రయోగించుట మహాపవిత్ర భావగర్భితమైన ఒక నామమును ఘోరతర దుర్వినియోగము చేయుటే యగును. ఈ విలేఖరి యుద్దేశ్య ప్రకారమే నామమాత్రముగా వితంతువులనబడు వీరిని పెండ్లిచేసికొన వలసినదనియు, లేదా పెండ్లినే మానుకొనుడనియు నే నీ దేశమందలి యువకులకు సలహా నొసగుచున్నాడను. బాలవైధవ్య కళంకమునుండి పునీత మొనరింపబడునప్పుడే, వివాహధర్మముయొక్క పవిత్రత సంరక్షింపబడిన దగును.

వితంతువులు బ్రహ్మచర్యమును నవలంబించినంతనే మోక్షమును పడయుదురనుమాట కనుభవము నాధార మేమియు కాన్పించుటలేదు. ఆ యఖండానంద పదప్రాప్తికి కేవలము బ్రహ్మచర్యావలంబనము కన్న ననేకవిషయము లవసరమై యుండును. మఱియు నితరులచేత బలవంతముగా నియమింపబడిన బ్రహ్మచర్యమువలన పుణ్యముగాని, పురుషార్థముగాని లేదు. ఇంకను దుర్వర్తనముతో నిండియున్న సంఘముయొక్క నీతిని పూర్తిగహరించి రహస్యముగ దుర్వృత్తులకు దారితీయును.

నా స్వంత అనుభవమును బట్టి వ్రాయుచున్నానని విలేఖరి గ్రహించునుగాక.

నా సలహా వలన బాలవితంతువుల పట్ల ప్రాథమిక న్యాయమైనను జరుగుపాటి ఫలితము కలుగునెడల, నేను నిజముగా సంతోషింతును. మఱియు నాకారణముచేత నితరకన్య ఏ పసితనములోనే పురుషుని కామముకొఱకు కమ్ముడు బోవుటను మాానుగా, వయస్సులోను జ్ఞానములోను పరిణతి పొందు వఱకును వేచియుండు నవకాశము బడయ గల్గుదురు.

జన్మాంతరము — పునర్జన్మ లేక ముక్తియున్నదను వానిం గూర్చిన విశ్వాసమునకు విరుద్ధమగు సిద్ధాంతమేదియు వివాహమును గుఱించి నేను ప్రతిపాదించుట లేదు. నీచజాతులని విలేఖరి సగర్వముగా వర్ణించునట్టి లక్షలాది జనులలో వితంతు పునర్వివాహముం గుఱించిన నిషేధము లేదని వారకు తెలియగుదురుగాక. భార్యావియోగము పొందిన పురుషుల పునర్వివాహము పైవిశ్వాసమునకు భంగకరముకానిచో, వితంతువులని అక్రమముగా పిలువబడు బాలికల యథార్థవివాహము ఆ ఘనతరవిశ్వాసమునకెటుల విరుద్ధము కాగలదో నాకర్థమగుట లేదు. నా విషయములో జన్మాంతరము — పునర్జన్మ యనునవి వట్టిసిద్ధాంతములుగాక దినదినము ఘటిల్లు సూర్యోదయమును బోలు ప్రత్యక్ష ప్రమాణ సంఘటన లగునని విలేఖరి తెలిసికొను నిమిత్తము వ్రాయుచున్నాను. ముక్తి యనునది నాయావచ్ఛక్తితో ప్రయత్నించి సాధింప నెంచు యథార్థవిషయము. మఱియు ఆముక్తిం గూర్చిన ధ్యానమే యీబాల వితంతువులయెడ జరుగుచున్న అపరాధమును గుఱించిన సవి

మర్శకమగు జ్ఞానమును కల్పించినది. ఆధునిక కాలమున నిక్కృష్టులపాలై శోకాంచిత్తలగు బాలవితంతువులను, అమృతస్వరూపలగు సీత మొదలగు వారి దివ్యనామములతో చెప్పి మనవిలే ఖరిదలై, ఒకేసారికో, సర్వవిధముల పౌరుషము పోనాడుకొనిన మనము పేర్కొనకుండుటయుగాక.

తుదిమాట, హిందూమతమున యథార్థవైధవ్యము మహామాన్యతముగ కొనియాడబడినది. అదెంతయు సమంజసమే. అయినను నే నెఱింగినంతవరకు, వేదకాలములో వితంతువుల పునర్వివాహ మెంత మాత్రమును నిషేధింపబడి యుండలేదు. అయినను నా యాక్షేపము సత్యమగు వైధవ్యమును గుఱించి కానే కాదు; అట్టి వైధవ్యమునకు మాఱుగ అత్యంత క్రూరమగు పరిహాసరూపముం దాల్చినదే. నేను ప్రస్తావనకు దెచ్చిన బాలికలను అసలువితంతువులని పేర్కొనుటయే అధర్మము. తనలో నేపాటి యైనను దయార్ద్రతతో గూడిన సాహసముగల ప్రతిహిందువును దుర్భరమగు దుఃఖపాశము నుండి వారిని విముక్తుల గావించుటయే న్యాయము. కాబట్టి, ప్రతి హిందూయువకుని గోర్కెయు, నన్యాయముగా వితంతువులని పేర్కొనబడుచున్న యీకన్యల తప్ప యితరుల వివాహము చేసికొననని శపథము చేయుకొనుచు నేను గావించిన సలహాను సవినయముగను, ధృఢతరముగను మఱల వక్కాణించుచున్నాను.

## అసలునకే మోసమా ?

నేను బాగుగ నెఱిగిన యొక విలేఖరి కేవలము పండిత వివాదముకొఱకై యీ క్రిందిసమస్యను బయలుదేఱదీసినట్లు

తలచుచున్నాను. ఏమన ఆయన యుగ్గడించు భావములు వారివి గావని నే నెఱుంగుదును. "ఈనాటి మన నైతిక వ్యవస్థ అస్వాభావికమైనది కాదా ?" యని ఆయన ప్రశ్నించుచున్నాడు. అదియే సహజమైన దైనచో, సర్వత్రా సర్వయుగములందును నొకేతీరున నుండెడిది. కాని, ప్రతిజాతియు, ప్రతి సంఘమును ప్రత్యేక ప్రత్యేక వివాహధర్మముల నియమించుకొని, వానిని నిర్బంధముగ ననువర్తింప జేయుటలో పశువులకన్న హీనతరస్థితికి పడిపోవుచున్నవారలే! ఏమందురా, పశువులలో గానరాని వ్యాధులెన్నియో మానవులందు సర్వసామాన్యమై పోవుచున్నవి. శిశుహత్య, గర్భనాశనము, బాల్యవివాహము ననునవి మృగజాతిలో అసంభవములై యుండగా, వివాహము నొక పవిత్రక్రతువుగా పాటించు సంఘమునందు ఘోరశాపములుగా ప్రబలుచున్నవి. నీతి, ధర్మములని మన ముగ్గడించు నియమములవలన మూడుచున్న అనర్థముల కంతు లేకున్నది. హిందూవితంతువుల దుర్భరావస్థ చూడుడు-అందుకు మనము పాటించు వివాహధర్మములు కాక కారణమ్ము వేఱేమి కలదు ? కావున ప్రకృతి దిశకేల మనము మరలరాదు? పశుజాతి జీవనవిధానము నేల యనువర్తింపదగదు?

ఈపైన క్లుప్తముగ వివరించిన వాదనను, పాశ్చాత్యదేశములందలి స్వచ్ఛంద ప్రేమవాదులు సాగించుచున్నారు, లేక యింతకన్న ప్రబలతర కారణములనే పేర్కొనుచున్నారో నే నెఱుగను. కాని వివాహసందర్భమును కడు మూఢాచారముగా నెంచు భావవైఖరిమాత్రము పాశ్చాత్యలోకమునుండి దిగు

మతి యొనదనుట స్పష్టము. ఆ వాదన సైతము పాశ్చాత్యుల నుండియే యెరువు దెచ్చుకొనునదైనచో సమాధానము చెప్పుట కష్టమైన పనికాదు. నైతిక స్వభావమునందును, నైతిక వ్యవస్థలందును నరుడు పశువుకన్న శ్రేష్ఠుడనుట సత్యము. ఒక తెగ కనువర్తించు ప్రకృతిధర్మము వేఱొకతెగ కనువర్తించు ప్రకృతిధర్మముకన్న భిన్నముగ నున్నది. నరుడు తర్కజ్ఞానము గలవాడు; విచక్షణ చేయగలడు; ఒక విధముగు స్వతంత్రేచ్ఛ వానికున్నది. పశువున కట్టిది శూన్యము. అది స్వతంత్రబుద్ధి కలదికాదు. ధర్మము, అధర్మము, లాభప్రదము, నష్టదాయకము నను తారతమ్యము చేయజాలదు. మానవుడు స్వతంత్రబుద్ధి కలవాడు గాన, ఈ తారతమ్యముల గుర్తింప సమర్థుడు; తన యున్నతప్రవృత్తి నతడు పాటించు నప్పుడు పశువుకన్న శ్రేష్ఠుడు కాగలడు; మఱియు తన నీచప్రవృత్తి ననువర్తించు నప్పుడు పశువుకన్న నికృష్టదశకు జారగలడు. పుడమిని మిక్కిలి అనాగరకజాతులుగా నెన్నబడువారు సయితము నేదోరీతిని కొన్ని సంభోగనియమములను పెట్టుకొనుచునే యున్నారు. అసలు నియమము పెట్టుకొనుటే మూఢత్వ మను నెడల, నియమమే లేని స్వచ్ఛంద వృత్తియే మానవధర్మ మన వలసి వచ్చును. నరు లందఱును నీతిశూన్య మగు విధానమునే అవలంబించు నెడల, ఇరువది నాలుగు గంటలలోపల సర్వము గందఱగోళములో పడిపోవును. నరుడు స్వభావము చేతనే పశువుకన్న కామోద్రేకము హెచ్చుగా కలవాడు గావున, నియమము లన్నియు తొలగించిన తోడ్తోడనే, కట్టు తెగిన వాని కామము అగ్నిపర్వతమునుండి బ్రద్దలు కొట్టుకొనివచ్చు

శిలాప్రవాహమువలె ప్రపంచమంతటిని ముంచి నరజాతి నంతను దగ్ధపటలము చేసివేయకుండునా? మృగజాతికి సాధ్యముగాని నిగ్రహశక్తియు, త్యాగేచ్ఛయు నరునికిగలవు. కావుననే అతడు మృగముకన్న శ్రేష్ఠు డనుటకు హేతు వయినది.

ఈకాలమున సామాన్యములైపోయిన కొన్ని జాడ్యములు వివాహధర్మముల నతిక్రమించుటచేత వచ్చిపడుచున్నవియే. వివాహధర్మముల నిసుమంతయు మీరక, విలేఖరి మనసులో నున్న జాడ్యముల వేనివలననైనను బాధపడు నొక్క మానవ వ్యక్తి యైనను నుండెనేమో తెలియగోరెదను. శిశుహత్యలు, బాల్యవివాహములు మొదలగున వన్నియు వివాహధర్మముల నతిక్రమించుటవలన గలుగు నష్టములే. ఎందుకనగా, పురుషుడుగాని, స్త్రీగాని యుక్తవయస్సు వచ్చి, ఆరోగ్యముగలిగి, యింద్రియనిగ్రహము గలవారై, సంతానార్థు లైనప్పుడు మాత్రమే సహధర్మచారిని చేకొనదగునని శాస్త్రము విధించుచున్నది. ఈ శాసనమును నిష్కర్షగా పాటించుచు, వివాహబంధమును పవిత్ర వ్రతముగా నంగీకరించువారు సుఖదూరులుగను, దుఃఖభాజనులుగను నుండు తరుణ మెన్నడును రాదు. వివాహమును పవిత్ర దీక్షగా స్వీకరించినపట్ల, ఆ కలయిక భౌతికశరీర సంబంధమైనదగాక, పవిత్రాత్మ సంయోగమై విరాజిల్లుచు, నేయొకరి మరణాంతర మైననుగూడ అభేద్యమై నిలిచియే యుండును. ఇట్లు సత్యమగు ఆత్మసంయోగము పఱగు నెడల విధవ గాని, విధురుడు గాని పునర్వివాహమును తల పెట్టుట అసంభవమును, అక్రమమును, అధర్మమును నగును. సత్యమగు వివాహధర్మమును పాటించని వివాహము నా పేరున

పిలుచుటకే అర్హమము గాదు. ఇక్కాలమున యథార్థమగు వివాహములు బహు స్వల్పముగా నున్న వనిన ఆ దోషము వివాహవ్యవస్థ కంటగట్టుట తగదు. ప్రస్తుత మమలులో నున్న ఆచారమునే సంస్కరింపవలయును.

వివాహము నీతికి సంబంధించినట్టి గాని, మతమునకు సంబంధించినట్టిగాని చుట్టరికము కాదనియు, కేవల మొక యాచార మాత్ర మనియు, మఱియు నది నీతికిని మతమునకును విరుద్ధ మగు నాచార మనియు, కావున నంతమొందింప దగిన దనియు మన విలేఖరి వాదించుచున్నారు. నా మనవి యేమనగా, వివాహ మనునది మతమును సంరక్షించుట కగు కంచె వంటి దని. ఆ కంచెను పాడుచేసిననాడు మతమే ముక్కచెక్కలై పోవును. మతమునకు మూలాధార మింద్రియనిగ్రహము; ఇక వివాహ మనగా ఇంద్రియనిగ్రహమే గాని యితరము కాదు. ఇట్టి యింద్రియనిగ్రహము నెఱుగని మనుజునకు ఆత్మ సాక్షాత్కారాశ సున్న. నాస్తికునకు గాని, జడవాదికి గాని ఇంద్రియ నిగ్రహము యొక్క ఆవశ్యకతను ఋజువుచేయుట దుర్లభము. కాని, మాంసమయ శరీరము యొక్క నశ్వరస్వభావమును, ఆత్మ యొక్క శాశ్వతత్వమును నెఱింగిన వనున కాత్మశిక్షణ మును. ఆత్మనిగ్రహమును లేనిది ఆత్మసాక్షాత్కార మసంభవ మను జ్ఞానము నైజముగ గల్గును. ఈ తనువు కామమునకు క్రీడారంగము కాగలదు. లేదా ఆత్మసాక్షాత్కారమునకు దివ్య దేవళమును కాగలదు. ఈ రెండవదే యగుపక్షమున స్వైర వృత్తి కనకాశ ముండదు; ఆత్మ నిరంతరము తనువు నంకుశము వేసిపట్టియే యుంచవలయును.

వివాహబంధము సడలి యున్న యెడలను, ఇంద్రియనిగ్రహము శూన్య మగు నెడలను, స్త్రీ కలహకారణ మగుచున్నది. మానవులును మృగములంత నిగ్రహశూన్యు లగుచో తిన్నగ వినాశమార్గమును బట్టినవా రగుదురు. మన విలేఖరి యేయనర్థముల గూర్చి మొఱలిడుచున్నాడో, ఆ యనర్థములు వివాహవ్యవస్థను రూపుమాపుట వలన గాక, ఆ వివాహవిధులను సక్రమముగ గ్రహించి ఆచరించుట వలననే తొలగింప సాధ్యమగు నని నా దృఢాభిప్రాయము.

సపిండుల వివాహములను కొన్ని సంఘములందు నంగీకరించుటయు, మఱికొన్ని సంఘములందు నిరాకరించుటయు గల దని నే నంగీకరింతును. కొన్ని సంఘములు బహు భార్యాత్వమును నిషేధించుచుండ మఱికొన్ని సంఘము లనుమతించుటయు నిజము. అన్ని సంఘములకును సమ్మతమగు నేకైక నీతిశాస్త్రముండుట వాంఛనీయమని యొప్పుకొనినను, అట్టియేకత్వము లేని కారణమున సమస్త నియమములను త్రోసిపుచ్చవలయునను వాదన కవకాశము కాన్పింపదు. మన యనుభవజ్ఞానము వృద్ధియైన కొలదిని మన నీతియు సామ్యావస్థనందుచుండగలదు. ఈ దినములలో నయితను ప్రపంచమందున్న నీతిభావము ఏకపత్నీత్వమునే యుత్తమాదర్శముగ గ్రహించుచున్నది; మఱియు బహు భార్యాత్వమును విధించు మత మెక్కడను లేదు. దేశకాలములను లోనై ఆచరణయందు స్ఖాలిత్యములు చూపట్టుచున్నను ఆదర్శము మాత్రము భంగ మగుట లేదు.

వితంతు పునర్వివాహమును గుఱించిన నాయభిప్రాయ మును మరల నుద్ఘాటింపవలసిన యవసరము లేదు. బాల వితంతువుల వివాహము వాంఛనీయమగును కాక, అటువంటి బాలవితంతువులుగల తల్లిదండ్రులు వారికి పునర్వివాహములు చేయుట విధి యనియు నేను భావించుచున్నాను.

## బాల వితంతు దర్శనము

బెజవాడనుండి యేలూరు వెళ్లుచుండగా, నూతనముగా వైధవ్యము సంప్రాప్తించిన యొక బాలిక 1400 రూప్యముల విలువగల తన నగలను నా కర్పింపదలచి యున్నదనియు, మేము పోవలసియున్న పెదపాడు గ్రామమునకు రెండుమైళ్ల లోపుగ నున్న పల్లెలోని తన యింటికి వన్ను రాగోరుచున్న దనియు నాతోడ చెప్పిరి. ఆమె కులము వారు ఘోషాపద్ధతిగల వారు. గాన, అందునను క్రొత్తగ వితంతువైన బాలిక యిలు వెడలి వచ్చుటగాని, మఱియు బహిరంగ సభాస్థలికి వచ్చుట గాని యెంత మాత్రమును వీలుపడదయ్యెను. ఆమె నగలనిన నాకంత వ్యామోహము కలుగలేదు. మఱియు ఆ బాలవితం తువు విలువ గల తన నగల నన్నింటిని నిచ్చి వేయ సమకట్టెనని నాతోడ చెప్పినవారిమాట నమ్మలేక పోతిని. అయినను ఆమె లేబ్రాయపుటాలనియు, నూతనముగా వితంతువయ్యె ననియు (వితంతువైన కన్యయనియు) వినుట చాలును. నన్నామె యింటికి దీసికొని వెళ్లుటకు, నేనటుల వెళ్లినందుకు సంతోషించి తిని. ఆ బాలిక పేరు సత్యవతీదేవి. ఆమె యిరువది యేండ్ల

లోపు వయసు గలది. ఆమె భర్త గొప్పగ జదువుకొనిన జాతీయవాది. ఆమెకు తెలుగుభాష బాగుగ వచ్చును. ఆమె సాహసవంతురాలును, కృతనిశ్చయయు నని గ్రహించితిని. ఆమె తలిదండ్రు లిరువురును సజీవులై యున్నారు. నాకు తెలిసినంతవఱ కామె తన నగల నన్నింటిని నా చేతులలో నిడినది. అవి పూర్తిగా 1400 రూప్యముల విలువ గలవిగా నాకు గోచరించినవి. తన్నాశ్రమమునకు దోడ్కొనిపొమ్మని యర్థించు చీటి నొకదానిని గూడ నా చేతిలో పెట్టినది. నేను సత్యవతిని దర్శించినప్పు డామె తల్లిదండ్రు లక్కడనే యున్నారు. ఆమె తన నగలను ఖద్దరుద్యమమునకై యిచ్చివేయుట వారి కిష్టముగనే యుండెను. ఆ బాలిక నొక మూల బంధించియుంచుట తగ దనియు, కుటుంబములోని యితర బాలికలతో సమముగ నామెను జూడవలయు ననియు తల్లిదండ్రులకు చెప్పితిని. తాను వితంతు వైన మాత్రాన నగలను త్యజింప నక్కఱలే దని యా బాలికకు చెప్పినాను. కాని ఆమె నిశ్చయము మారలేదు. తన కింక వానితో బని లేద నెను. ఆమె తల్లిదండ్రు లను మతించిన యెడల నే నామె నాశ్రమమునకు దోడ్కొనిపోయెద నంటిని. వా రా సంగతిని విచారింప వాగ్దానముచేసి, నా పర్యటనానంతరము నాతో బంపుదు మని బాలికతో చెప్పిరి. ఆమె తండ్రి నిస్సందేహముగా జాగరూకుడై మానము దాల్చి యున్నను, తన కుమార్తె యెడ నాదరభావముతో నున్నటుల కాన్పించినాడు. ఆ వితంతువున కింతకు మించి యెట్టి మోదా ర్పను సమకూర్ప జాలనందుకు విచారపడితిని. విచారభరిత హృదయముతో నామెను వీడ్కొని వెడలితిని.

పెదపాడులో నా యుపన్యాస మామె ప్రస్తావనతో సరి పోయినది. ఘోషాపద్ధతిని ఛేదించివేయు డనియు, ఆ బాలిక కేమాత్రమైన నిచ్ఛ యున్నయెడల నామెను పునర్వివాహము చేయుటలో నామె తల్లిదండ్రులకు చేయూత నొసగవలయు ననియు శ్రోతలకు చెప్పితిని. పదునెనిమిది వత్సరముల యువకు నకు భార్యావియోగము సంభవించెనేని యాతడు పునర్వివా హము చేసికొనదగును గదా! అట్టియప్పుడు అదే వయస్సు గల వితంతువునకా హక్కేల యుండదగదు? విజ్ఞానప్రేరిత మగు నైచ్ఛికవైధవ్యము జాతి కొక యమూల్య నిధియే. కాని, అజ్ఞానపూర్వకమును, నిర్బంధము నగు వైధవ్యము మన కొక కళంకము. శ్రోతలు కడుశ్రద్ధతోడను, ఆదరము తోడను వినిరి. ఆ బాలవితంతువు యొక్క తండ్రియు నా సభలో నున్నాడు. తన నగల నిచ్చివేయవలయు నను సంకల్ప మా వితంతువునకు కలిగినదే యనియు, పునర్వివాహము చేసికొనవలయు నను కోరిక యేమాత్ర మామెకు లేదనియు నాపిమ్మట నాకు తెలియ వచ్చినది. ఆమెకు గల గొప్ప వాంఛ బాగుగ చదువుకొని తుదకు జాతీయసేవకై తన జీవితము నర్పింపవలసినదిగా నున్న దని వింటిని. ఆమె సునిశ్చితాభిమతనే యది యయ్యెనేని సత్యవతీదేవి ధన్యురాలు. ఇష్టమువచ్చినప్పుడు పునర్వివాహము గావించుకొనుటకై, అటువంటి వితంతువులకు నిరాఘాట మగు నవకాశమును హిందూసంఘము కల్పింపవలయును. అను దినము హిందూగృహములందు సత్యవతీదేవి చరిత్ర ప్రదర్శిత మగుచునే యుండును. లోలోన పునర్వివాహచింతతో క్రుగ్గి పోవుచు, నొక క్రూరాచారమునకు భయపడి అటుల చేయ

సాహసింపజాలని ప్రతి వితంతువు యొక్కయు శాపము, క్షంతవ్యము కాజాలని బానిసతనమున నామె నణచిపట్టియుంచునంతకాలమును ఆ సంఘము యొక్క తలపై పడియే యుండును.

## స్త్రీజన స్వాతంత్ర్యము

చెన్నపురియందు సుప్రసిద్ధసంఘసేవకురాలగు డాక్టరు ముద్దులక్ష్మిరెడ్డిగారు ఆంధ్రదేశముననే నొసగిన యుపన్యాసములపై నాధారపడి నాకొక దీర్ఘమగు లేఖను వ్రాసిరి. అందుండి హృద్యములగు నీ క్రిందిభాగముల దెలుపుదుగాక!

బెజవాడనుండి గుంటూరు వరకు మీ ప్రయాణములో, సంస్కరణము యొక్క గొప్ప అవసరమును గురించియు, మన ప్రజలలోని దైనందినాచారములందు జరుగవలసిన పరివర్తనమును గురించియు మీరు వెల్లడించిన భావములు నాకు బాగుగ నచ్చియున్నవి.

వైద్యవృత్తి చేయు నొక స్త్రీ నగు నేను మీ యభిప్రాయములతో సంపూర్ణముగ నేకీభవించు చుంటినని సవినయముగా మనవి చేయుచున్నాను. ఐనను సంఘసంస్కరణమును, శ్రేష్ఠతరశౌచమును, ప్రజారోగ్యవృద్ధిని, విద్య తనతోడ నిజముగా దీసికొనరాగల్గు నెడల, మన స్త్రీజనము యొక్క విద్యాద్వారమున మాత్రమే, ఆఫలితమును సాధింపజాలుదుమని దయయుంచి నన్ను చెప్పనిండు.

ఇప్పటికి సాంఘికపద్ధతి ననుసరించి, విద్యార్జనకుగాని, శరీరముయొక్కయు, మనస్సుయొక్కయు, పూర్ణపరిణతికి గాని, ఆత్మవికాసమునకు గాని తగిన యవకాశము బహుకొలదిమంది స్త్రీలకు మాత్రమే లభించుచున్నదని మీ రభిప్రాయపడుటలేదా?

ఆచారములయొక్కయు, నియమముల యొక్కయు భారము క్రిందపడి

వారివ్యక్తిత్వమే నిర్లక్ష్యముగా నణగ ద్రొక్కివేయబడుచుండెనని మీరు భావించుటలేదా ?

కాయిక, మానసిక, ఆధ్యాత్మిక పరివర్తనమును బాల్యవివాహములు మూలనాశనము చేసివేయుటలేదా ?

బాలభార్యలయొక్కయు, బాలబాలింతలయొక్క యావేదనలును, మన వితంతు జనముయొక్కయు, నిరాధారముగ వదలివేయబడిన సతులయొక్కయు ఉపశాంతి యెఱుంగని శోకములును తత్క్షణమే నివారింపవలసిన యావశ్యకతను దెలుపుటలేదా ?

కల్లకపట మెఱుగని పసిబాలలను నీతి చెడిన వ్యభిచారజీవనమున కరుణా లేశములేక మతము పేరిట నణచిపట్టు నాచారమును సహించుటయో, చూచియు చూడనట్లూఱకొంటయో, హిందూసంఘమునకు న్యాయమగునే?

ప్రాచీన హిందూదేశమున మైత్రేయి, గార్గి, సావిత్రివంటి నారీమణులు బలసాహసముల తోడను, స్వతంత్ర భావనాశక్తి తోడను, ప్రారంభోత్సాహముల తోడను వర్తింపగలిగి యుండిరి. బ్రహ్మసమాజము, ఆర్యసమాజము, అర్థహీనము లగు నాచారములను, క్రతువులను, కర్మకలాపములను తొలగించి వేసిన హిందూమత మనదగు దివ్యజ్ఞానసమాజము మున్నగు నుదారమతధర్మములకు చెందిన స్త్రీరత్నము లనేకు లీనాడు సయితమటువంటి సద్గుణములతో వెలయుచున్నారుగదా! ఇట్లుండ హిందూస్త్రీలు, ఏకొలదిమందియో తప్ప, చాలవఱకు సంఘదౌర్జన్యమునకు లోబడి సంఖలకు ఫలితముగా నాయుత్తమలక్షణముల గోల్పోయిరని మీరు తలపోయుట లేదా ?

మన జాతీయదుర్బలతకు మూలమును, మన ప్రస్తుతాధఃపతనమునకు కారణము నగు ఈ సాంఘికదురాచారములకు దగిన పరిహారమును గని పట్టుటకై మన జాతీయపక్షవాదులు అనగా కాంగ్రెసువారు పూనిక వహించి యుత్సాహావేశపరులు కావలదా? లేదా సాహసమునకు, విజ్ఞానమునకు ఆదర్శమూర్తులై, నిర్దుష్టవర్తనులగు భార్యలుగను, తల్లులుగను వెలసి, అన్నిటి

కంటెను భావికాలపు భారతరాజ్యాంగనేత్తలుగా నున్న సంతానమునకు శిక్షణ నొసగి, దారిజూపి, వారనుదినసదభ్యాసములను, నిర్మలవర్తనమును సంపాదించుకొన సమర్థుల గావించుట యను తమ పవిత్రధర్మమును నిర్వహింపజాలునటుల తాము కాయికముగను, నైతికముగను, మానసికముగను, ఆధ్యాత్మికముగను పూర్ణవికాసము పడయు నిమిత్తము, తమ స్త్రీల నణచిపట్టియుంచిన దాస్యశృంఖలముల తొలగించునటుల ప్రజాసామాన్యమునకు బోధ చేయుట కైనను కనీసము ప్రయత్నములు సాగింపరాదా?

ప్రతి జాతికిని, ప్రతి వ్యక్తికిని స్వాతంత్ర్య మనునది జన్మహక్కని కాంగ్రెసు సభ్యులు విశ్వసింతురేని, ఎట్టికష్టనష్టములకైన నోర్చి దానిని తాము సాధింప దీక్షబూనిన వారగుదురేని, తమ స్త్రీలయొక్క సమగ్రవికాసమున కడ్డువగులు దుష్టాచారవ్యవహారములనుండి వారికి విడుదల సమకూర్పవలదా? ఇది తమ చేతిలోనున్న పనియేగదా?

మన ఋషిసత్తములు, మన కవివరులు, మన భక్తావతంసులు అట్టి ధర్మమునే గానముచేసి యుండిరే! 'స్త్రీజాతిని గౌరవింపని దేశముగాని, జాతిగాని యెన్నడును ఘనతకెక్కి యుండలేదు. మరియు, నింక ముందు ఘనత గాంచబోవుటయులేదు. మీజాతి యింత యధోగతి బడియుండుటకు ప్రధానకారణము సాక్షాత్తు పరాశక్తిస్వరూపిణు లగు మీ స్త్రీగణమునెడ మీకు గౌరవము లేకపోవుటయే. అల జగజ్జననీస్వరూపలే యగు స్త్రీజనమును మీ రుద్ధరింపరేని, మీరు తరించుటకు వేఱొక మార్గముగలదని యూహింపకుడు'. అని శ్రీవివేకానందస్వామి యెలుగెత్తి చాటియున్నాడు!

తమిళ కవిశేఖరుడగు కీర్తిశేషుడు సుబ్రహ్మణ్య భారతి మహాశయుడును అదేభావమును వెలువరించి యున్నాడు.

కాబట్టి, స్వాతంత్ర్యసంపాదనమునకు సక్రమమైనట్టియు, సునిశ్చయమైనట్టియు నీ మార్గము నవలంబింపుడని మన పురుషవరులను మీ పర్యటన సందర్భమున దయచేసి మీరు ప్రబోధము గావింప ననుగ్రహింతురా?

కాంగ్రెసువాదులీ బాధ్యతను వహింపవలయునని డాక్టరు ముద్దులక్ష్మీదేవి కోరుట సంపూర్ణముగ సమంజసమనక తప్పదు. వ్యక్తిగతముగను, సమిష్టిగను కూడ చాలమంది కాంగ్రెసువాదులీ ఘనకార్యమునకు పూనుచున్నారు. ఈ దురాచారము చూపులకు గోచరించు విధమున పైపై విషయము గాక చాలలోతుగ వేళ్లు పాతుకొనియున్నది. ఇయ్యది స్త్రీజనవిద్యాస మాత్రమును సంబంధించిన దోషము కాదు. మన విద్యాపద్ధతికి యానత్తునకును సంబంధించిన క్రుళ్లుడే యిది. మఱియు మన మధిక్షేపింపవలసినది యీ యాచారమో, ఆ యాచారమో కాదు; తప్పక తొలగించి వేయవలసినట్టి దురాచారమని నిర్ణీతమైనదాని పట్ల సయితము చలనము చూప నిరాకరించు మన స్తబ్ధత్వమే మన కున్న యనర్థము. మఱియు తుదకీ యాక్షేపణాంశము పట్టణవాసులగు మాధ్యమికవర్గమునకు సంబంధించినదనుట మాత్రమే సత్యము. భారతదేశపు కోట్లాది జనములో వీరు నూటికి పదునైదుగురు మాత్రమే. పల్లెలలో వసించు అశేష ప్రజాసామాన్యమునందు బాల్యవివాహము లరుదు. కాన, వితంతు పునర్వివాహమునకు సంబంధించిన నిషేధము వారి నంతగా బాధించుట లేదు. వారి పురోవృద్ధి నరికట్టు నితరానర్థములు వారికున్న మాట సత్యమే. స్తబ్ధత్వ మిరువురికిని సమానమే. అవసరముగా కావలసిన దేమన, విద్యావిధానమును పూర్తిగ మార్పుచేసి, జనసామాన్యమున కనువగు పద్ధతితో పునస్సంస్థాపనము గావించవలసి యున్నది. చిన్నవారితో పాటు పెద్దలకును విద్యగఱపు నవసరమును గుర్తింపని యే పద్ధతియు సహింపదగినదియే కాజాలదు.

మాతృభాషలకు స్వతస్సిద్ధ మగు ప్రధానస్థానము నంగీకరింపని యే విధానముగాని యీ సమస్య నిసుమంతయు స్పృశింప నోపదు. ఎట్టిదైనను కానిండు. ప్రస్తుతము విద్యావంతమైయున్న వర్గము ద్వారా మాత్రమే యీ పని జరుగవలసి యున్నది. కాబట్టి విశాల సంస్కరణ మేదేని జరుగవలసి యున్నచో నిప్పటి విద్యావంతవర్గము యొక్క మనస్తత్వము రూపాంతరము పొందవలసి యుండును. మనకు భారతదేశమునందు గల కొలది మంది విద్యాకలిత లగు నారీమణులు తా మధిష్ఠించి యున్న పశ్చిమ పర్వతాగ్రముల నుండి భారతదేశపు సమతలములకు దిగి వచ్చుటకై సాదరమతితో సమ్మతింపవలసియుండు నని నేను డాక్టరు ముద్దులక్ష్మి సతీలలామను మనవి చేయుచున్నాను. తమ యుపేక్షను, ఇంకను స్త్రీల యెడ తాము గావించిన యపరాధములను పురుషులు నిస్సందేహముగా నిందార్హులే; అందుకై వారు ప్రాయశ్చిత్తము చేసికొనవలసినవారే. కాని, మూఢవిశ్వాసముల బాసి, దోషముల గుఱ్ఱెఱిగిన నారీమణులు సంస్కరణమునకు బూనుకొని నిర్మాణకార్యమును సాగింప వలసియుండును. స్త్రీజనవిముక్తి, భారతదేశ స్వాతంత్ర్యము, అస్పృశ్యతానివారణము, జనసామాన్యపు ఆర్థిక సంస్కరణము మున్నగున వన్నియు జనపదప్రవేశమును, గ్రామవాసుల జీవన పునర్నిర్మాణమును లేక సంస్కరణము అనెడు కార్యక్రమముగ పరిణమించును.

## పతిత సోదరి

లజ్జను పోనాడుకొని జీవనమును సంపాదించుకొను స్త్రీలను లిసికొనునట్టి మొట్టమొదటి అనుభవము నాకు గలిగినది.

ఆంధ్రరాష్ట్రములో కాకినాడయందచ్చట అరడజను మందితో కొన్ని నిమిషములపాటు సంభాషణ మాత్రమే జరిగినది. రెండవ సంపర్కము బారిసాలులో ప్రత్యేకపు యేర్పాటుతో వందమందికి పైగా వచ్చిరి. సంభాషణ కనుమతి గోరుచు ముందుగ వారు లేఖ నంపిరి. తాము కాంగ్రెసులో చేరితిమనియు, తిలక స్వరాజ్యనిధికి చందాల నిచ్చితిమనియు, కాని, ఆయా కాంగ్రెసు సంఘములలో నుద్యోగముల కొరకు వలదను నా సలహా తమ కర్థము కాలేదనియు, తెలిపిరి. తమ భావిక్షేమముం గూర్చి నా సలహాను కోరుచుంటిమని తెలుపుచు నుత్తరమును ముగించిరి. ఆ లేఖను గొని వచ్చిన పురుషుడు నే నాయుత్తరమును దీసికొని యవమానము జరిగినటుల భావింతునో, లేక సంతసింతునో తెలియక చాల తబ్బిబ్బు పడినాడు. నా కేదేని మార్గమున్న యెడల ఆ తోబుట్టువులకు సేవ యొనర్చుట నా విధియేనని నమ్మబలికి నేనాయన సంకోచమును దీర్చితిని.

ఆ నా తోబుట్టువులతో నేను గడపిన రెండుగంటల కాలము నా స్మృతిపథమున పెన్నిధియని నా యభిప్రాయము. పురుషులు, స్త్రీలు, శిశువులుగూడిన సుమారు ఇరువదివేల జనసంఖ్యలో తాము మూడువందల యేబదిమంది యుంటిమని వారు నాతో ననిరి. వారు బారిసాలునగర పురుషుల సిగ్గుపాటునకు టెక్కెముగ నున్నారు. బారిసాలు నగర మా చిహ్నము నెంత త్వరితముగా తొలగించుకొనిన నంత తన పేరునకు శ్రేయస్సు గూర్చుకొనినదగును. ఈ బారిసాలుస్థితియే ప్రతినగరమునకును గలదని నా భయము. కాబట్టి, నేను బారిసాలునొక యుదా

హారణగా దెలుపుచున్నాను. ఈ సోదరీమణుల కుపకృతి సలుప వలయు ననెడు సంకల్పమును వ్రాసిన ఘనత బారిసాలునందలి కొందఱు యువకులకు ఘటిల్లినది. ఈదురాచారమును రూపుమాపిన యోగ్యతకూడ తనదే ననుకొనగల యదృష్టము బారిసాలునకే దక్కునుగాక.

పురుషుడు దా బాధ్యుడయిన దురాచారములలో నెల్ల నింత హీనమైనదియు, నింతఘోరమైనదియు, నింతక్రూరమైనదియు, నిటుల మానవజాతిలో శ్రేష్ఠతరార్ధాంశమునకు ద్రోహము జేసిన పాతకమునుబోలునది మఱొకటి యుండబోదు. స్త్రీజాతి 'అబల' సమితి యను భావము నామట్టుకు నాకు లేదు. స్త్రీపురుషవర్గములలో స్త్రీవర్గము హెచ్చుమాననీయమైనది. ఏమన, నేడు నయితము స్వార్థత్యాగమునకును, వినమ్రతకును, విశ్వసనీయతకును, విజ్ఞానమునకును, క్షమాధృతులకును స్త్రీ లాంఛనముగ వెలయుచున్నది. పురుషుని అహంకారపూరితమగు ఘనతరజ్ఞానరాశికన్న స్త్రీయొక్క సహజాంతఃప్రబోధము తఱచుగా సత్యమై యొప్పుచుండును. 'సీత' అను శబ్దమును 'రామ' శబ్దమునకు ముందును, 'రాధ' అనుశబ్దమును 'కృష్ణ' శబ్దమునకు ముందును ప్రయోగించుటలో నొక ధర్మసూత్ర మున్నది. అవినీతితోడి ఈ జూదము హద్దుమీఱి ప్రబలవ్యాప్తి గాంచుచుండుటవలన గాని, నవనాగరికతకు ప్రసిద్ధివడసిన యూరపుఖండమునందు దొరతనము వారిచేతనే కొన్ని సందర్భములం దవలంబనము చేయబడుచుండుటవలన గాని, మానవజాతి వికాసమున దాని కొకస్థానము కలదను భ్రాంతిలో మనము పడిపోదగదు. భారతదేశమునందును

అందుకు దగిన ప్రమాణములున్నవను కారణము చేత నయిత
మా దురాచారమును శాశ్వత మొనర్ప దగదు. మన ధర్మ
విచక్షణను పోనాడుకొనిన క్షణముననే, మఱియు మనకు
నిశ్చితముగా తెలియని పూర్వాచారమును గ్రుడ్డిగా ననుస
రింప నిశ్చయించుకొనిన తోడ్తోడనే, పురోభివృద్ధికి తర్పణము
వదలినట్లే యగును. ప్రాచీనసంస్కృతిలో మాననీయమును,
శ్రేష్ఠము నైన దానికెల్ల మనము వారసుల మని గర్వింపదగునే
గాని, పూర్వపు దురాచారములను పెంపుచేయుచు మనపవిత్రాజ్ఞ
తమున కవమానము కూర్పనగదు. ఆత్మగౌరవోపేతమగు
భారతభూమియందు ప్రతి స్త్రీయొక్క మర్యాదకును, ప్రతి
పురుషుడును తన స్వీయసోదరియొక్క మర్యాదకై బాధ్యు
డగునంతటి బాధ్యుడు కాడా ? స్వరాజ్య మనగా ప్రతిభారత
దేశవాసియు మన సోదరుడో సోదరియో యను భావమును
పూనగల స్థితియే సుడీ !

కాబట్టి యీ వందమంది సోదరీమణుల ప్రోల నేను
వ్యక్తిత్వేనా సిగ్గుతో తలవంచుకొనువాడ నైతిని. వీరిలో
కొందఱు పెద్దవారు; చాలమంది యిరువది ముప్పదియేండ్ల
మధ్యవయస్సు గలవారు; ఇద్దరు ముగ్గురు పదిరెండేండ్ల
వయసునకు లోపు బాలికలు. తమ యుండెటి సంతానముగా
ఆర్గురు బాలికలు, నల్గురు బాలకులు నుండిరనియు, వారిలో
పెద్దవాడు తమకులములోనే యొకతెను పెండ్లాడె ననియు
నాకు తెలిపిరి. అన్యగతి యేదేని సంఘటిలినతప్ప, ఆబాలికలు
తమ జీవితమునంటి జీవితమునకై ఆయత్తపడు తెఱగున పెంచ
బడువారే యనిరి. ఈస్త్రీలు తమ స్థితిని చక్కబఱచుకొన

నవకాశ మెంతమాత్రము సంభవము గాదని యభిప్రాయపడుట నా హృదయమునకు శూలాఘాత మైనది. అయినను వారు బుద్ధిశాలినులు, నమ్రశీలముగలవారు. వారి సంభాషణమున గాంభీర్యము గలదు. వారి ప్రత్యుత్తరములు నిష్కపటము లును, సరళములును. మఱియు, ఆక్షణమున వారి నిర్ణయము వీరత్యాగపూరమైనట్టి నిర్ణయమునకును స్థిరత్వముతో తీసిపోవు నదిగలేదు. వారికి సాయపడు వారుండి చేయూత నిచ్చుచో, నామరునాటి నుండియే తమ ప్రస్తుత జీవనమును పరిత్యజించి, నూలువడుకుటను, నేత నేయుటను చేపట్టుదు మని వారిలో పదునొకండుమంది వాగ్దానము చేసిరి. తక్కినవారు నన్ను మోసగించు కోరిక లేదు గాన, ఆలోచించు కొనుటకు కొంత కాలము కావలయు ననిరి.

ఈ పని బారిసాలుపురవాసులది. పురుషులు గాని, స్త్రీలు గాని సత్యమగు భారతమాతసేవకు లగువారి కందఱకు దగు పనియే యిది. ఇరువదివేల జనసంఖ్య గల చోట నిట్టి అభాగ్య సోదరీమణులు మూడువందలయేబదిమంది యుండిన, భారత దేశ మందంతటను ఏబది రెండు లక్షల ఏబది వేల మంది యుండ నగును కాని, పల్లెలలో జీవించుచు, కేవలము వ్యవసాయమే వృత్తిగా గల భారత దేశ ప్రజలలో నైదింట నాలుగు వంతులు ఈ దుర్వృత్తిచే మైలబడనివారే నని విశ్వసించుచు సంతసింతు గాక. భారత దేశ మంతటను తమ మానము నమ్ముకొని బ్రతుకు స్త్రీల కనిష్ఠసంఖ్య పది లక్షల యేబదివే లుండు నను కొందును. ఈ యభాగ్య సోదరీగణము తమ హీనతను బాసి బయట పడుటకు రెండు నియమము లవసరము లగును. పురు

షుల మగు మానము కామనిరోధమును నేర్చుకొనయువలను; ఈ స్త్రీలు గౌరవ మగు జీవనోపాధిని గడించుకొనుటకు దగిన వృత్తిని కనుగొనవలయును. సహాయనిరాకరణోద్యమము మన లను పునీతుల గావించి, మన దుష్టవ్యాసనముల మూలవ్రజాలని యెడల నది వ్యర్థమే యగును. మఱియు, ఒత్తిడి యధికము గాకుండ నెల్లఱు నవలంబింపగల వృత్తి వడుకుట, నేయుటతప్ప వేఱొకటి లేదు. ఈ సోదరీమణులలో నధిక సంఖ్యాకలు విన్నా హాముమాట తలపెట్టు నవసరము లేదు. అటుల చేయజాల మని వా రొడంబడియే యున్నారు. కాబట్టి, వారు యథార్థ మగు భారతీయ సన్యాసినులు కావలయును. సేవను గుఱించియే తప్ప జీవనమును గుఱించిన పరితాపము లేనివారై, తమ హృదయతృప్తి గలుగునంతగా, వారు వడకగల్గుదురు; నేత నేయగల్గుదురు. పదిలక్షల యేబది వేల స్త్రీలు ప్రతిసిత్య మెని మిది గంటల కాలము నేత నేయు టనిన, దారిద్ర్యపీడ ననుభ వించు భారతభూమి కన్నిరూప్యము లాదాయము లభించినట్లే యగును. ఈ సోదరీమణులు తాము దినమునకు రెండు రూప్య ముల వఱకు సంపాదించుచుంటి మని తెలిపిరి. కాని, పురుషుని కామతృప్తుని గావించుటకై వారి కనేక వస్తుజాలము కావలసి వచ్చెడి దనియు, తాము వడుకుటకు, నేయుటకు పూనుకొని సహజ జీవనము నవలంబించు నెడల వాని నెల్లపరిత్యాగము చేయగల మనియు వా రొప్పుకొనిరి. వారితోడి నా సంభాషణ మును ముగించునప్పటికి, తమ పాపపు జీవనమును విడిచివేయ నిది, తాము కాంగ్రెసు కమిటీలలో నుద్యోగపదవుల నేల పూనదగదో నేను చెప్పకుండనే వారు గ్రహింపజాలిరి. పవిత్ర

హృదయము తోడను, వినిర్మల హస్తముల తోడను దఱిజేరిన తప్ప నెవరును స్వరాజ్య బలిపీఠము వద్ద నాధ్వర్యము వహింపవ నర్హులు కారు.

## అభాగ్య సోదరి

నేను దక్షిణదేశమున స్వీకరించిన అభినందనపత్రములలో మిగుల కనికరము పుట్టించునది వ్యాజస్తుతితో 'దేవదాసీ' లని పిలువబడు వెలయాంధ్రపక్షమున నొసగబడినది. ఈయభాగ్య సోదరీమణుల కాకరమగు జాతికి చెందిన వారివలననది సిద్ధము చేయబడి తేబడినది. ఆయభినందనపత్రమునుదెచ్చినసందర్శకుల వలన ఆ సంఘములో సంస్కరణ జరుగుచున్న దనియు, నైనను బహునెమ్మదిగ సాగుచున్న దనియు తెలిసికొంటిని. ఆ సందర్శకులయందు నాయకత్వము వహించిన యాయన ప్రజాసముదాయయు వారి సంస్కరణయెడ విముఖులుగ నుండిరని చెప్పినాడు. ఈ దెబ్బ నాకు మొట్టమొదట తాకినది. కాకినాడలో అచ్చటి పురుషులతో నేను మాటలాడినప్పుడు దాపరికము లేకుండ మాటలాడితిని. రెండవది బారిసాలులో తగిలినది. అచ్చట ఈ యభాగ్య సోదరీమణులను చాలమందిని కలిసికొంటిని. వారిని 'దేవదాసీ' లని పిలిచినను, మఱేపేరున బిలిచినను సమస్య యొక్కటియే. స్త్రీలలో పెక్కండ్రు పురుషుని కామ వ్యసనముకొఱకై తమ శీలము నమ్ముకొనవలసి వచ్చుచున్నదను విషయము బహులజ్జాకరమును, దుఃఖప్రదమును, మఱియు కడుంగడుతలవంపులు కూర్చునదియు నగును. అబలలని పేర్కొనబడు వీరిపైని బడవేసిన పాతివ్రత్యమును

గురించి శాసనకర్త యగు పురుషుడు ఘోర ప్రాయశ్చిత్తము చేసికొనవలసియే యుండును. పురుషుని పాశములనుండి తప్పించుకొని పూర్ణ వికాసమును పడసి, పురుషుడు గావించిన శాసనమును, వానిచే కల్పింపబడిన సంస్థలను స్త్రీ తిరస్కరించునప్పుడావిప్లవము, నిస్సందేహముగా దౌర్జన్యరహిత మైనదే యైనను, అమోఘముగా పనిచేయ గలదు. అశాస్త్రీయము నవినీతికరమునగు తన వ్యసనములకు మానహీనమగు జీవితమును గడపవలసివచ్చిన యీ వేలకొలది స్త్రీల గతిని గురించి భారతజాతిపురుషు డిప్పుడే యాలోచనలు సాగించుగాక. ఇందులో విచారకర విషయ మేమనిన, ఈ పాపకూపము లందు జొరబడు పురుషులలో అధిక సంఖ్యాకులకు వివాహము లైనందున రెండు విధాల పాపము జరుగు చున్నది. దీక్షాపూర్వకముగ వివాహమాడిన తమ భార్యలయెడ వారుచేయు పాప మొకటి; తమ స్వంతతోబుట్టువుల శీలము నెంత శ్రద్ధతో సంరక్షింపవలసి యున్నారలో అంతటి శ్రద్ధతోడనే సంరక్షింపవలసిన యీ తోబుట్టువుల శీలమును తామే భంగపరచిన పాపము రెండవది. భారతదేశ పురుషజాతి తమ గౌరవమును గుర్తెఱింగిన వారలే యగునెడల ఈ దురాచార మొక్కదిన మైనను నిలువ నోపదు.

మనలో మహాగౌరవనీయు లనేకులు ఈ దుర్నీతిలో మునిగిపోయి యుండనియెడల, ఆకలిగొన్నవాడు అరటిపండును దొంగిలించిన నేరముకంటెను, డబ్బు కక్కుర్తికి లోబడిన జేబులు కత్తిరించు పోరగాని పాపముకంటెను, ఈలాటిపాతక కృత్యము హీనముగ పాటింప కుందుమా? సంఘమున కెక్కు డపకార

కరమును, నీచతరము నగు దోష మేది? సొమ్మును దొంగి లించుటయా, లేక ఒక స్త్రీ మానమును భంగపఱచుటయా? వెలయాలు మానము నమ్ముకొనుటలో తన సమ్మతి నొసగుచున్న దనియు, గుఱ్ఱపు పందెముల జూడ బోయిన కోటీశ్వరుడు తన జేబును కత్తిరించు ప్రముచ్చునకు తన సమ్మతి నొసగుట లేదే యనియు నాతో వాదులాటకు దిగ కుంద్రుగాక. ఒక పసివాడు జేబులోని డబ్బును దొంగిలించు చున్నాడు; ఒక ధూర్తుడు వేఱొకనికి మత్తుమందుపెట్టి వాని సర్వస్వమును కొల్లగొనుచు తదనుకూలమగు పత్రము పైని సంతకము చేయించుకొనుచున్నాడు; వీరిరువురిలో నెవరినేరము హెచ్చు? స్త్రీకమూల్యసంపదయగు లజ్జను జంకుగొంకులేని గూఢకపటవర్తమునచేత పురుషుడు ముందుగ నపహరించి, యా పిమ్మటగదా, యామె యెడ తాను గావించు నపరాధ మునం దామెను గూడ పాల్గొన సమ్మతింప జేయుచున్నాడు? లేదా పంచములవలె, కొందఱు స్త్రీలు పరమ నీచజీవనము గడపుటకే జన్మించుచున్నా రందురా? నేను వ్రాసిన యీ విషయము యొక్క ఫలితార్థముల గుఱించి నెమ్మదిని తల పోయ వలయునని ప్రతియువకుని, వివాహితుడైనను, అవివాహి తుడైనను సరియే నేను కోరుచున్నాను. సంఘమును జెఱచు ఈవ్యాధిని గుఱించి, నైతికమగు నీమారీజాడ్యమును గుఱించి నేను తెలిసికొనినదాని నంతను వ్రాయుటకు నాకు సాధ్యము కాదు. ఆయువకుడే యూహించి శేషమును పూరించునుగాక; ఆపిమ్మట తానట్టి దోషమునకు పాల్పడి యున్నవా డగునేని భయంకరమగు ఆ పాపవృత్తిని గుఱించి సిగ్గుజెంది మరలును

గాక. మఱియు ప్రతివినిర్మలశీలవంతుడును, నెచ్చోనున్నవాడైనను, తన పరిసర ప్రాంతములను పవిత్రీభూతము గావింప శక్తికొలంది ప్రయత్నించుగాక. ఈ రెండవ యంశమును గుఱించి వ్రాయుట సులభమే గాని, దాని నాచరణయందు బెట్టుట కష్టతరమని యెఱుంగుదును. అయ్యది కడు నిశితమైన యంశము. అదటుల నిశితమగు నంశముగావుననే, బుద్ధిమంతులెల్లఱును శ్రద్ధ బూనవలసినవారుగ నున్నారు. ఈ యభాగ్య సోదరీమణులమధ్య పనిచేయుట సర్వత్ర నేర్పరులగువారు మాత్రమే పూనదగినదిగ నున్నది. ఈ నీచపు గుడిసెలలో దూరువారిచెంత జేరి చేయగల ప్రచారకార్యముం గుఱించియే నేను గావించు సూచన లన్నియు!

## భారత స్త్రీలకు విజ్ఞప్తి

విదేశవస్త్ర బహిష్కారముం గుఱించి భారతనారీమణులకు మహాత్ముడు గావించిన విజ్ఞప్తి యందలి యంశములు :—

మీలో కొందఱు సన్నని నాజూకైన రంగురంగు దుస్తులు వాడుకొనువారుగ నున్నారు. దినమున కెన్నియోసార్లు దుస్తులను మార్చుచు నుందురు. అటువంటివా రిప్పుడు ముతక ఖద్దరు చీరల గట్ట నారంభించినారు. ఈ చీరలు తెల్లగా నలుసంత మచ్చయైనను లేక, స్త్రీలకు సహజమగు పవిత్రతను ప్రకటించుచున్నవి. మీరిటుల చేయుటంతయు భారతభూమి క్షేమము కొఱకును, ఖిలాఫత్తు కొఱకును, పంజాబు కొఱకునై యున్నది. మీ పలుకులందు గాని, మీ చేతలందు గాని కపట మనునది లేదు. మీరు గావించునది క్రోధకళంకితము

గాని వినిర్మలత్యాగము. భారతదేశమంతటను స్త్రీలు ఐచ్ఛికముగ జూపిన ప్రేమభరితమగు సానుభూతి భగవంతుడు మనతోడ నున్నాడనెడు విశ్వాసమును నాయందు దృఢపఱచెనని చెప్పుచున్నాను. మనము సాగించు పోరాట మాత్మపరిశుద్ధ్యర్థమనుటకు లక్షలకొలంది భారతనారీమణు లుత్సాహపూర్వకముగా నీ యుద్యమమునందు తోడ్పడుచుండి రనుటకన్న వేఱు ఋజు వనవసరము.

మీరు చాలత్యాగము గావించియున్నారు; ఐనను మీరింకను త్యాగము గావించవలసి యున్నారు. పురుషులు తిలకు స్వరాజ్యనిధికి విరాళములిచ్చుటలో విశేషభాగమును భరించినారు. కాని స్వదేశీయోద్యమము సంపూర్ణమగుట మీ రత్యధికభాగమును వహించిననే సంభవము కాగలదు. మీరు మీ విదేశీవస్త్రరాశినంతటిని పూర్ణముగ నాహుతియిడిననేతప్ప బహిష్కారోద్యమము సుసాధ్యము కాజాలదు. మీపూర్వాభిరుచులు చలింపనంత కాలము పూర్ణత్యాగ మనునది యసంభవమే సుడీ! మనకు భగవంతుడిచ్చిన బిడ్డలతోడనే కృతజ్ఞతాపూర్వకముగా తృప్తులమైయుండుతీరున మనకు భారతదేశమిడు నెట్టివస్త్రములతోడనైనను సంతృప్తిపడవలసియుందుము. ఎదుటివారికి కురూపిగా గాన్పించినను కూడ తనబిడ్డను విడనాడుతల్లిని నేనెందును గాంచియుండలేదు. ఆతీరుననే భారతదేశవస్తువులం గుఱించి మాతృదేశభక్తిభరితలగు నారీమణులయభిమానము నుండవలయును. మీసందర్భములో, చేతితో వడికి, చేతితో నేసిన వస్త్రములుమాత్రమే స్వదేశీవిగా భావింపబడవలయును. క్రొత్తమాప్పుజరుగు సంధికాలమున మీకు ముతకఖదరుమా। ఇనే, ఇబ్బిగా

దొరుకగలదు. దానికే మీరుకోరునట్టియు, మీ కలవియగు నట్టియు శృంగారము సంతతము తోడుచేసికొనుడు. కొలది మాసములపాటు మీరు ముతకఖద్దరుతోడనే తృప్తిపడియుండు నెడల, కొండొకకాలము న సాటిగనలేక ప్రపంచము మత్సరగ్రస్తమై యబ్బురముతో గాంచినసుందరమును, విచిత్రవర్ణసంశోభితమును నగు అమూల్యదుకూలములంగూర్చి భారతదేశమిప్పుడును నిరాశజెందవలసినపని యుండదు. ఆరునెలలపాటు త్యాగమునకోర్చితిరేని, మనమీనాడు సుందరములుగ మన్ననజేయునవి నిజముగ కటువంటివి కానేకావనియు, నిజమగు సౌందర్యము బాహ్యరూపమునందు మాత్రమేగాక, అంతర్యమునందును వెలయుచునుండుననియు మీరు గ్రహింపగల్గుదురని నేను దృఢముగ చెప్పగలను. సౌందర్యములో పూర్ణరూపమగునది కలదు; మఱియు, జీవప్రద మగునదియు కలదు. పాశ్చాత్య దేశముల నుండియు, దూరప్రాచ్యభూముల నుండియు మనము దిగుమతి చేసికొను సన్నని వలువలు మన సోదరీసోదరుల ననేకులను ప్రత్యక్షముగ హతము చేసినవి; మఱియు, మన ప్రియసోదరీ మణులను వేల కొలందిగ మానసికీనజీవనము న బడద్రోసినవి. యథార్థమగు కళ దాని నాశ్రయించువానికి సుఖమును, తుష్టిని, పవిత్రతను చేకూర్చును. మనలో నటువంటి కళ వర్ధిలవలయు ననిన ప్రస్తుతము మీలో నుత్తము లగువారు తప్పక ఖద్దరును వాడవలసియుండును.

స్వదేశప్రణాళిక విజయవంతము కావలయు ననిన ఖద్దరు నుపయోగించుట యవసర మగుటేగాక, మీలో ప్రతివారును తీరిక దొరికినప్పుడెల్ల నూలు వడకవలయును. బాలురును,

పురుషులునుగూడ నూలు వడకవలయునని సూచించియున్నాను. వారిలో వేలకొలదిగ ప్రతిదినము నూలు వడుకుట నే నెఱుగుదును. కాని, పూర్వకాలము నందువలెనే నూలు వడకు బాధ్యత మీామీాద పడవలయును. రెండు వందల సంవత్సరములకు ముందు భారత స్త్రీలు స్వదేశమునకు కావలసిన నూలును మాత్రమేగాక విదేశములకు బంపుటకు గూడ నూలు వడికి యుండిరి. ముతక నూలును మాత్రమే గాక ప్రపంచములోని కెల్ల సన్నని నూలును వారు వడికియుండిరి. మన పూర్వులు వడికిన నూలు వంటిదానిని వడుకుట కింకను ఏ యంత్రమును సమర్థమై యుండలేదు. మన ఖద్దరునకు వలయునంత నూలును రెండు మాసములలో సిద్ధము చేయగలిగితిమా, ఆ పిమ్మట నూలు వడుకు కూటములను, రాట్నపు పోటీలను నేర్పాటు చేసి, మన దేశమందలి దుకాణములనెల్ల చేతితో వడికిన నూలుతో నింపివేయవలయును. ఈపని నెరవేఱుకొఱకు మీాలో కొందరు వడుకుటలోను, ఏకుటలోను, రాట్నముల మరమ్మతు చేయుటలోను ప్రావీణ్యము సంపాదింపవలసియుండును. అనగా నితరంతరకృషి సలుపవలయు నని యర్థము. నూలుదీయుట నొక జీవనోపాధిగ భావించకుడు. మిగుల పేదలగువారి కిది నిస్సందేహముగ బ్రతుకుతెఱవే యైనను, మధ్యతరగతులవారి కిది కుటుంబాదాయము నొకింత బలపఱచుటకు సహకారిగ నుండనగును. రాట్న మనునది వితంతువులపాలిటి ప్రియమిత్రముగ వెలయవలయును. కాని, యీా నా విన్నపమును జదువువారికి దీని నొక ధర్మవిధిగా సూచించుచున్నాను. భారత దేశములోని శ్రీమంతురాం డ్రెల్ల ననుదినము కొంత నూలు

వడుకుటకు బూనుకొందురేని వారు నూలును చౌకచేయ గల్గుదురు; మఱియు సందుమూలమున నితరోపాయములవలన కంటె, వేగముగా నాణ్యమైన నూలు తయారగునట్లు చేయ గలరు.

ఆర్థికముగను, నైతికముగను భారతదేశము క్తి యిట్లు చాల వఱకు మీపై నాధారపడియున్నది. భావిసంతతి వారిని పోషించువారు. మీరలే గాన, భారతదేశభవితవ్యము మీ (మోకాళ్ళ)పై నెలకొనియున్నది. భారతశిశువులను నిరాడంబ రులును, భగవద్భీతి గలవారును, సాహసవంతులును నగు స్త్రీ పురుషగణముగా మీరు సాకగలరు; లేదా దుర్బలులై, జీవన సంగ్రామమున ధీరులై నిలువజాలక, విదేశ సౌకుమార్యములకు మఱగి, తమ భవిష్యజ్జీవితములందు వానిని నిగ్రహింప శక్తిలేని గారాపు టర్భకుల సైతము మీరలే పెంచగల్గుదురు. కొలది వారములలో మీ శక్తి ఎట్టిదో వెల్లడి కాగలదు. మీ యీప్సిత మెట్లుండు ననుటను గుఱించి నా కిసుమంతయును సంశయము లేదు. భారతదేశ మాత్మ విశ్వాసమును పోనాడు కొనునంతగా దాని మూలాధారముల నెల్ల శోషిల జేసిన ప్రభుత్వపుచేతులలోకన్న మీచేతులలోనే దాని యభ్యుద యము హెచ్చు సురక్షితముగనుండగలదు. స్త్రీలసభలలో ప్రతి దానియందును జాతీయోద్యమమును దీవింపు డని మిమ్మర్థించు చుందును. మీ దీవనలు సార్థకములు కాగల్గునంత నిర్మలత, నిష్కాపట్యము, భగవద్భక్తి మీయందు గల వను విశ్వాస ముతోనే నటు లర్థించుచుందును. మీ విదేశ వస్త్రములు విస ర్జించుటచేతను, మీ తీరికకాలములందు జాతీయాభ్యుదయము

కొఱకై నిరంతరముగా నూలు వడుకుట చేతను మీ యాశీస్సులు ఫలప్రదము లగునటుల నిస్సందేహముగా మీరు చేయగల్గుదురు.

## సింహళ స్త్రీలకు మనవి

కొలంబోనగరమున శృంగారప్రియలగు నారీమణుల సభయందు మహాత్ముఁడీ రీతి నుపన్యసించెను :—

మహేంద్రభూపతి సింహళము వచ్చిన కాలమున మాతృదేశసంతానము భౌతికసంపదయందు గాని, ఆధ్యాత్మిక సంపదయందుగాని దైన్యము నెఱుంగదు. అప్పుడు మీ తార ఉచ్చదశయం దున్నది. ఆ యభ్యుదయమును మీరు పంచుకొంటిరి. ఆ బిడ్డ లిప్పుడు తిన తిండి లేక కుందుచున్నారు. వారిపక్షమున నేను భిక్షాపాత్ర చేబూని మీకడకు వచ్చియున్నాను. వారితోఁడి మీ బాంధవ్యమును త్రోసిపుచ్చక, వారియం దభిమానమును పూనుదురేని, మీరు నాకు మీ ధనము నొసగుటే గాక, యితర స్థలములందలి సోదరీగణము లొసగినటుల మీ యాభరణములను గూడ నొసగుదురు గాక. ఎచ్చటెచ్చట సోదరీమణులు బహుళాభరణాలంకృతలై కాన్పింతురో అచ్చట వారి యాభరణములపై నా నేత్రదృష్టి వాలుచుండును. ఆ నగల కొఱకు యాచించుటలో గుప్తమై వేఱొక యుద్దేశ్యమును గలదు; ఆభరణములకొఱకును,అలంకారముల కొఱకును ఆఱాటపడు సతీమతల్లుల భ్రమల తొలగించు భావము నాకు కలదు. ఇతరసోదరీగణముతో నేను మాటలాడునప్పటి చనవును మీ రంగీకరింతురేని,పురుషునికంటె హెచ్చుగా మీరలంకరించు

కొను టేలకో అడుగగోరెదను. పురుషుని మెప్పించుటకై స్త్రీ యటుల నలంకరించుకొనునని స్త్రీజాతిమిత్రులు నాకు దెలుపుచుందురు. ప్రపంచవ్యవహారములలో మీవంతు మీరు చెల్లింపజాలురేని పురుషుని మెప్పునిమిత్తము మీ రలంకరించుకొనుట కొడంబడదగదని చెప్పుచున్నాను. నేనే స్త్రీనై పుట్టియుండినచో, తనకొక యాటబొమ్మగా నుండుటకై స్త్రీ జన్మించు ననెడు పురుషుని యహంకారభావమును తిరస్కరింపసమకట్టి యుందును. యథాప్రకారము గాక భిన్నముగా నాభార్యను మన్నింప నిశ్చయించుకొని, యామెకు భర్తగా నాకుగలవనుకొనిన యధికారముల నన్నింటిని విసర్జించి, యామె స్వామ్యముల నామెకిడు నంతవఱకును నేను నా భార్య హృదయసీమలో స్థానమును సంపాదించుకొనజాల నైతిని. నే నెంత నిరాడంబరముగ నుంటినో యామెయు నంత నిరాడంబరముగా నుంట మీరు గాంచగలరు. ఆమె మెడలో కంఠాభరణములు లేవు; ఒడలిపై నలంకారములు లేవు. మీరు గూడ నటు లుండవలయు నని నా యాశయము. మీ భ్రాంతులకును, మీ చాదస్తములకును బానిసలైపోయి, పురుషులకు దాసీలైపోన నొడంబడకుడు. సింగారించుకొన నిరాకరించుడు; సువాసనలకును, లవండరునీళ్లకును బర్వు లిడకుడు; మీరు సుగంధమును వెదజల్లజాలురేని, అది మీ హృదయములందే యున్నది. దానిద్వారమున మీరు పురుషునేగాదు, మానవలోకము నంతటి నలరింపగల్గుదురు. అయ్యది మీ నైసర్గికసంపద. పురుషుడు స్త్రీనుండి జన్మించుచున్నాడు. ఆతడామె మాంసములోని మాంసమే;

ఎముకలోని ఎముకయే. మీగణ్యతను మీకు గుర్తించుడు; మీదివ్యాదేశమును మీకు పునఃప్రకటించుడు.



కాఫీతోటలలో పనిచేయు మీ సోదరీగణముయొక్క హీన దశను మీ రెఱుగుదురా? వారిని మీ తోబుట్టువులనుగ మన్నించుడు; వారిం దరిజేర్చుడు; ఆరోగ్యముంగూర్చిన మీ యుత్తమజ్ఞానముతోడను, మీ ఘనతర సామర్థ్యముతోడను వారి కుపకృతుల గావించుడు. వారికి సేవచేయుటే మీకు గౌరవముగ భావించుడు. ఇండ్లకడను మీరు గావింపగల యుపకృతి లేదా? ధూర్తులగు పురుషు లెందఱో గలరు; తప్ప త్రాగి సంఘమున కనర్థముల గూర్చువా రెందఱో గలరు. దొంగ లుండు గుహాలలోనికిని, జూదరుల గూడెములలోనికిని, త్రాగు బోతుల గుడిసెలలోనికిని బోయి, వారి పాదములకడ మోకరించి ప్రార్థించి వారి దుర్వృత్తులమాన్పు 'రక్షకసైన్యపు' బాలికలు గలరుగదా! సాహసముతో వారి ననుకరించి, మీరును దుర్మార్గగాములను సన్మార్గమునకు ద్రిప్పుడు. మీ రిప్పుడు ధరించియున్న యాభరణములన్నింటికంటె, అటువంటి సేవలు మీ కెన్నియో మడుంగులు హెచ్చు శృంగారమును గూర్చునుసుడీ! అప్పుడు మీరు కూడబెట్టగల డబ్బునకంతకును, నేను ధర్మకర్తనై నిలిచి దానిం దీనులకై వినియోగము చేతును.

తిరుగుళ్లుపడుచు నేను చేసిన యీ ప్రసంగము మీ హృదయములందు స్థిరముగ నెలకొనుగాక యని ప్రార్థించుచున్నాడ!

## సునిశ్చిత త్యాగము

విశాఖపట్టణమున స్త్రీల గురించి చేసిన ప్రసంగాంశములు:—

హరిజనోద్యమ మగ్ని వంటిది. అగ్నిలో నేయి పోసినకొలది నింకను హెచ్చుగ కోరుచునే యుండును. అటులనే హరిజనోద్యమమునుం గూర్చి మీరు త్యాగము చేసినకొలదిని అది యింకను కోరుచునేయుండును. ఈ యుద్యమమును గురించి యిచ్చువారి కెన్నడును నష్టము లేదు; ఈయనివారు నిస్సందేహముగా నష్టపడుదురు. ఇచ్చుటచేత మీరు పొందునది పుణ్యము. ఇయ్యకుండుటచేత మీరు నష్టపడునది మీ యాత్మనే! ఎన్నియుగముల నుండియో సవర్ణప్రజలు–స్త్రీలును, పురుషులును–హరిజనులను పీడించియున్నారు. మన మీ నాడు ఇడుముల గుడుచుచుంటి మన, మనము హరిజనులయెడ గావించిన యపరాధ మందుకు కారణ మని నా నమ్మకము. కాబట్టి తమ హృదయముల నుండి యీ అస్పృశ్యతాపిశాచమును పాఱద్రోలు డని భారత నారీరత్నములను నేను వేడుకొనుచున్నాను. కొందఱు ప్రజలు మనకన్న హీనులని తలపోయుట తప్పు; భగవత్సృష్ట మగు పుడమిలో నెవరును నీచులు గారు; ఎవరును ఉన్నతులు గారు. మనమందఱమును దేవుని సంతానమే. తండ్రి దృష్టిలో వాని బిడ్డ లందఱును సరిసమానులగుట యెట్లో, దేవుని దృష్టిలో వాని సృష్టి యంతయు సమానమే యైయుండవలయును. కాబట్టి, మతమునందు అస్పృశ్యతకు ప్రమాణము లేదని నేను చెప్పు మాటను నమ్ముడని కోరుచున్నాను. కావున, మీ చుట్టు నుండు హరిజనులకు మీ హృదయములందు స్థాన మొసగుడని కోరుచున్నాను. మీ

గృహములలోనికి హరిజనులను ఆహ్వానించుడు. హరిజన నివాసముల కడకు పోడు; వారి బిడ్డలను, వారి యిండ్లను పరిపోషింపుడు. మీరు మీ తోబుట్టువులతో ముచ్చటలాడు విధమున హరిజన స్త్రీలతో మాటలాడుడు.

ఈ హరిజనోద్యమము ముఖ్యముగా భారత నారీమణులు చేపట్టవలసినదిగ నున్నది. ఈ ప్రాంతపు హిందూ స్త్రీజన మగు మీరు మీ ధర్మమును నిర్వహింతురు గాక యని ఆశించుచున్నాను. మీలో కొంతగాని, పూర్తిగ గాని తమ యాభరణముల నిచ్చు కోరికయు, శక్తియు నున్నవార లటుల చేయుడని కోరుచున్నాను. ఈ కానుకల సందర్భములో నొక షరతు గలదు. మీ రేమైని దానముగ నిచ్చు నెడల మరల నట్టి దానిని ధరింపదగదు. ధనమైనచో మీ తలిదండ్రులుగాని మీ భర్తలుగాని మీచేతి కొసగియుందురు. కాని ఆభరణములైనచో అవి మీస్వంతమైన వగును. మీతల్లిదండ్రులవలన గాని, భర్తలవలనగాని తిరిగి చేయించుకొను నుద్దేశ్యము లేకుండ మీ నగల నిచ్చివేసితిరా, అయ్యది మీ సునిశ్చితమగు త్యాగమగును. నేను మీ కొసగిన సందేశము యొక్క భావమును గ్రహించిన మీలోని వారెల్లరును ఏదేని సునిశ్చితత్యాగార్పణము చేయుదురుగాక యని కోరుచున్నాను.

## యథార్థ మగు భూషణము

మైసూరునందు స్త్రీలసభలో చేసిన ప్రసంగాంశములు :—

స్త్రీకి సత్యమగు భూషణము తనశీలమే; తనపుణ్యావర్తనమే. లోహములు, రాళ్లు సత్యమగు భూషణము లెన్నడును కా

జాలవు. సీత, దమయంతి మొదలగు నారీమణుల నామములు మనకు పవిత్రములై పరంపరగా వచ్చుట అనింద్య మగు వారి వర్తనమును బట్టియేగాని, వారెన్నడేని ధరించియుండిన యాభరణములబట్టి కాదు. మీనగల కొఱకై నేనర్థించుటలో గంభీర మగు నర్థము కలదు. చాలమంది సోదరీమణులు తాము నగలను తీసివేయుటవలన సుఖతరముగ నున్నటుల నాతోడ చెప్పుచుందురు. అటుల జేయుట ఒక విధమునగాక పెక్కువిధముల యోగ్యచర్య యని నే నందును. ఏ స్త్రీగాని, పురుషుడుగాని తనకున్న సంపదలలో గణనీయమగు భాగమును పేదల కొఱకును, నిస్సహాయ్యుల కొఱకును దానముచేసినగాని దానిం దమకడ నుంచుకొనుట కధికారము కలవారు కారు. అట్టిది సాంఘికమును, ఆధ్యాత్మికమునగు కర్తవ్యకార్యము. భగవద్గీత దానికి యజ్ఞమను పేరిడుచున్నది. ఇట్టిదానమును చేయనివాడు దొంగగా పరిగణింపబడును. అనేకరూపము లగు యజ్ఞముల గుఱించి గీత ప్రశంసించుచున్నది. కాని, పేదలను, దీనులను సేవించుటను మించినయజ్ఞ మింకేమి యుండగలదు? నిమ్నోన్నతము లనెడు విభేదమును మఱచి, సకలమానవులను సమానముగ గ్రహించుటకంటె మన కీనాడు ఘనతరయజ్ఞము లేదు. అలంకరించుకొనుటన లోహములతోడను, రాళ్ళతోడను శరీరమును నింపుట కాదనియు, హృదయపారిశుధ్యమును సాధించి, ఆత్మయొక్క సౌందర్యమును పెంపొందించుటే యగుననియు నేను భారతనారీమణులకు నచ్చజెప్ప వాంఛించుచున్నాడను.

## కౌముది త్యాగము

అనేకవిధములగు నుత్తమానుభవములతో గూడిన నా జీవితమునందు మనస్సును కఱగించునట్టియు, హృదయవిస్ఫారకములగు నట్టియు సందర్భముల నెన్నిటినో కనుగొను నదృష్టము నాకు లభించినది. కాని యీవ్యాసము వ్రాయుసమయమున హరిజనోద్యమమునకు సంబంధించిన యొకానొక సంఘటనకు మించిన మనస్సును కఱగించు నుదంత మేదియు నాస్ఫురణకు వచ్చుటలేదు. 'బడగరా' గ్రామమున నాయుపన్యాసమునిప్పుడే ముగించి వచ్చితిని. అచ్చో జేరిన స్త్రీలను గుఱించి వారి యాభరణముల నొసంగు డను విన్నపమును జేసియుంటిని. ప్రసంగానంతరము వచ్చిన కానుకలను వేలము వేయుచుంటిని. అప్పుడు కౌముది యను పదునారేండ్ల బాలిక నెమ్మదిగ వేదిక కడకు వచ్చినది. ఆమె యొక చేతిగాజును తీసి మీ చేవ్రాలు నొసగుదురా యని నన్నడిగినది. నే నందుకు సిద్ధపడుచుండగా రెండవ గాజును కూడ తీసినది! ఇక నామె చేతుల కొకొక్క గాజు మాత్రమే యుండెను. "నీవు రెండు గాజుల నీయనక్కర లేదు; ఒక్క గాజునకే నా చేవ్రాలు నొసగెదను.' అంటిని.

అందుకు ప్రత్యుత్తరమో యనునటుల నామె మెడలోని కాసులపేరును దీసినది. అటుల దీయుట సామాన్య కార్యము కాదు. దీర్ఘము లగు కేశపాశముల నుండి దానిని చిక్కుడలంచ వలసియుండెను. కాని యాశ్చర్యముతో చూచుచున్న వేల కొలది స్త్రీపురుషుల ఎదుట నట్లొనర్చుట కామె మలబారు కన్య యగుటంజేసి బిడియపడ లేదు. 'సరేగాని నీవు మీ తండ్రి యాజ్ఞను దీసికొంటివా ?' అని నేను ప్రశ్నించితిని. ప్రత్యుత్త

లేదు. ఆమె హస్తము లప్రయత్నముగా చెవుల కడకు బోయి నవి; క్షణములో కర్ణాభరణము లూడివచ్చినవి. ఇంక తమ సంతోషమునుపట్టజాలని సభ్యుల కరతాళరవములు చెలరేగెను. ఆ త్యాగమును గూర్చి తల్లిదండ్రుల యనుమతి బడసెనా యని మఱలవిచారించితిని. వినయశీలయగు నాబాలిక వలన నేను ప్రత్యుత్తరము బడయులోపుగనే, ఆమె తండ్రి సభలోనే యుండె ననియు, నేను వేలము వేయుచుండగా పాట పాడువారి పేరునామాలను వ్రాయుచు నాకు సాయపడుచున్న పురుషుడే యనియు, ఆ సదుద్యమము కొఱకై విరాళము నొసగుటలో నాయనయు, కొమరితతో పాటు నౌదార్యము జూపువాడే యనియు నొకరు తెలిపిరి. ఆ నగలకు బదులు వేఱునగల నామె స్వీకరింపదగదని నేను కౌముదికి జ్ఞప్తి చేసితిని. నిశ్చలబుద్ధి తోడ నా నియమము నామె యంగీకరించినది. నేను నా చేవ్రాలు నామె కందించునప్పుడు 'నీవిప్పుడు త్యాగము చేసిన యాభరణములకంటెను నీ విరాగమే నీకు యథార్థమగు భూష ణము !' అని నా చేవ్రాలునకు ముందుగ వ్రాసితిని. ఆమెట్టి సత్య మగు 'హరిజనసేవకి' యగు ననుట కామెత్యాగము హామీయై పఱగుగాక !

## సుస్పష్ట ప్రసంగము

కాశీలో స్త్రీలసభయందు చేసిన ప్రసంగము నందలి యంశములు :—

మన కీనాడు మత మనిన, ఆహారపానీయములం గూర్చిన నియమములు, ఉచ్చనీచభావముల పట్టుదలలు తప్ప మఱేమియు లేకుండ సమసిపోవుట ఘోరము. ఇంతకు మించిన మూర్ఖత

యుండజాలదు. నామాట వినుడు. జన్మయు, ఆచారవిశేష ములును మన ఉచ్చనీచ దశలను నిర్ణయింపజాలవు. వర్తన మొక్కటియే యట్టి నిర్ణయమున కాధారము కాగలదు. దేవుడు మనుజులను నీచులు, ఉత్తములు నను తలవ్రాతలతో పుట్టించి యుండలేదు. పుట్టువునుబట్టి వీరు హీనులు, వారస్పృశ్యులు నను పేరులను పెట్టుచు మానవులను వేఱుచేయు స్మృతు లేవియు మనకు ప్రమాణములుగా మాననీయము కాజాలవు. అటుల తోడిమానవులను తిరస్కరించుట దేవునిని, మఱియు దైవమే యగు సత్యమును నిందచేయుటే యగును. సత్యము, ధర్మము, న్యాయము ననువాని స్వరూపమే యనదగు భగవంతుడు విశాల మానవజాతిలో నైదవపాలు జనము నంటరాని వారినిగా నెంచు మతమునుగాని, ఆచారమునుగాని ప్రమాణముగ నొసగి యుండడు. కావున, మీ రీ పైశాచిక భావమును తొలగించు కొనుడు. మలినపు పనులకు సంబంధించిన అస్పృశ్యత యున్నది; ఉండితీరవలసినదియే. అది మన యందఱకును నమవర్తించు నదియే. కాని ఆ కల్మషమును, ఆముఱికిని మనము కడిగివేసి కొనిన తోడ్తోడనే మన అస్పృశ్యత తొలగి పోవుచున్నది. కాబట్టి ఏపనిగాని ఎట్టి నడతగాని, ఒక స్త్రీనో, యొక పురుషునో సర్వకాలము తాకదగని వ్యక్తిగా నొనర్పజాలదు.

కొంచెము హెచ్చుగనో, తగ్గుగనో మన మందఱమును పాపులమే. గీత, భాగవతము, తులసీరామాయణము మొదలగు మన పవిత్రగ్రంథములలో ప్రతిదియు ఎవరెవరు భగవంతుని శరణు జొత్తురో, ఎవరెవరు ఈశ్వరనామస్మరణ చేతురో వారెల్లఱు పాపరహితు లగుదు రని నిస్సంశయాస్పదములగు

భాషణములతో దెలుపుచున్నది. ఆ ప్రమాణము సర్వమానవ కోటికిని నుపకరించునదియే.

ఈ సమస్యాపరిష్కారము ననువర్తింపుడని నేను కోరు మఱొక సులభమగు సూత్రము గలదు. మానవుని, పశువును, కుక్కను, గోవును, వేఱువేఱుచేసి చూపగల్గు విశిష్టలక్షణములు నరజాతి యందుగాని, మానవేతరజాతియందుగాని భిన్నభిన్నములై చూపట్టుచున్నవి. అతీయున నస్పృశ్యులను వేఱుచేసి చూపగల విశిష్టలక్షణములు, అయుస్పృశ్యులనబడు వారియం దేమేని గలవా? మనయం దెంతటి మానవత్వముగలదో వారి యందు నంతటి మానవత్వమునుగలదు. మానవేతర జంతుతతిని నయితము మనము అస్పృశ్యతాదోషముగలజీవులనుగ నెంచుట లేదే! అట్టివో ఈఘోరతరాన్యాయ మెందువలన, నెందుండి వచ్చి పడినది? ఇది మతముకాదు; మూర్ఖతమమగు మత దూషణ మిది. ఈపాతకము మీలో నున్నయెడల దానిని పోద్రోలుడని మిమ్ము కోరుచున్నాను.

మీరు హరిజనులతో మైత్రిసలిపి, వారి వాడలకు వేంచేసి, మీబిడ్డలను కౌగిలించుకొనుతీరున వారిబిడ్డలను కౌగిటచేర్చి కొనుచు, వారియోగక్షేమములను మీ యోగక్షేమముల వడువు ననే యభిమానించుచు, వారికి చాలినంతతిండి దొఱకుచున్నదో లేదో, వారు త్రాగుటకు నిర్మలజలము గలదో లేదో, మీరు సహజాధికారముతోడ ననుభవించు మంచియెండ, మంచిగాలి వారికిని లభించుచున్నవో లేవో కనుగొనుచు వర్తించుటొక్కటే యిన్ని శతాబ్దములనుండి మీ కంటివచ్చుచున్న మహాపాప మునుండి మీరు పునీతులగుటకుగల యుపాయము. మీలో

ప్రతియొక్కరును రాట్నయజ్ఞమును ప్రారంభించి, యీయధో
గతిపాలు చేయబడిన కోట్లాదిజనమును పోషింపజాలు ఖద్దరును
ధరింప దీక్షబూనుట యను మరొక మార్గము కలదు. వారితో
మీయైక్యమును పాటించుటతో, నూలు వడకుట యను క్రతువు
కొంచెము మీకు సహకారము కాగలదు. మరియు మీరు
ధరించు ప్రతిగజము ఖద్దరుగుడ్డయు హరిజనులయొక్కయు దరి
ద్రులయొక్కయు చేతులలోనికి పోగల కొలదిరూకలకు నిదర్శన
ముగ నుండగలదు. మీరొనర్పగల తుదికార్యము, మీరొపగ
లంతటి దానమును హరిజననిధి కొసంగుట. హరిజనులదీనదశను
బాపుటతప్ప యీనిధికి వేఱొండు గమ్యము లేదు.

## అస్పృశ్యతాసమస్య

బెల్గాములో అస్పృశ్యుల సభయం దొసగిన బోధ:—

అస్పృశ్యతాసమస్యను గుఱించి నా యభిప్రాయములను
వెల్లడించుమని నన్నడుగుట కవసరమే లేదు. నే నీ జన్మలో
మోక్షమును బడయ నోడితినేని, మరుజన్మలో పాకీవాడనై
పుట్టుదుగాక యనుట నా హృదయపూర్వక ప్రార్థన మగునని
అనేకములగు బహిరంగోపన్యాస వేదికల నుండి లెక్కకుమీరి
నన్నిసార్లు ప్రకటించి యున్నాను. జన్మకర్మల రెంటి ననుస
రించియు వర్ణాశ్రమ ధర్మమునందు నాకు విశ్వాసము కలదు.
అయినను పాకీవాని కులము ఏ విధమునను హీనమైన దనుట
నే నొల్లను. అందుకుమారుగా పరమపూజ్యులగు పాకీవాండ్రను
పెక్కండ్రను నే నెఱుంగుదును. మఱియు తద్భిన్నముగా,
ఏమాత్రము గౌరవముతో చూచుటకును అనర్హు లయ్యును

బ్రాహ్మణు లన బడుగువారు నున్నారు. కాబట్టి, యిట్టి భావములు గల నేను, నా కింకొక జన్మ విధింపబడి యుండెనేని, మాలవాండ్రమధ్య మాలవాడనై పుట్టుదుగాక యని కోరుకొనుచున్నాను. అప్పుడు వారికి నేనింకను హెచ్చు సేవ చేయగల్గుదును; వారిపక్షము వహించి యితర సంఘములవారితో మొఱలిడుటకు నాకు హెచ్చుగ నవకాశము నుండును.

సరే. స్పృశ్యులనబడువారు అస్పృశ్యులను అసహ్యించుకొనదగ దని నేను కోరువిధముననే, యీ అస్పృశ్యులును స్పృశ్యులనుగూర్చి ద్వేషాసూయల పొందవలదని కోరుచున్నాను. పాశ్చాత్యదేశములలో జరుగు విధాన, దౌర్జన్యపూర్వకముగా వీరు తమ హక్కులను గుంజుకొనపూనవల దని నా కోరిక. లోకాభిప్రాయసరణి దౌర్జన్యమునకు వ్యతిరేకముగ నున్నది. హక్కులను పశుబలప్రయోగమువలన నిర్ణయించుకొనుట అసంభవ మగు కాలము రానున్నట్లు ప్రపంచములో నాకు స్పష్టమగు సూచనలు గోచరమగుచున్నవి. కాబట్టి నా అస్పృశ్య సోదరగణమునకు, గవర్నమెంటువారికి నేను తెలుపు విధముననే తమ వాంఛితార్థసిద్ధికై పశుబలప్రయోగము నాశ్రయించు నెడల తప్పక విఫలు లగుదురని మనవి చేయుచున్నాను.

నేను హిందూమతము నుద్ధరింపకోరుచున్నాను. అస్పృశ్యులను హిందూసంఘమున నంతర్భాగముగానే నెంచుచున్నాను. హిందూమతావరణమునుండి ఒక మాలడేని నెట్టివేయబడుట చూచు నెడల నాకు బాధ కల్గును. అయినను వర్ణవిభేదములన్నియు రూపుమాసిపోగల వను నమ్మకము నాకు లేదు.

గీతలో శ్రీకృష్ణభగవానుడు బోధించిన తీరుగ సమత్వసూత్రము నందు నాకు విశ్వాసము గలదు. చతుర్వర్ణములవారును సమాన ప్రతిపత్తితో చూడబడవలయునని గీత బోధించుచున్నది. కాని బ్రాహ్మణున కేధర్మమును విధించుచున్నదో, ఆధర్మము నే మాలవానికిని విధించుటలేదు; అయినను ఉత్తమజ్ఞానభరితు డగు బ్రాహ్మణు డెట్టి గౌరవాదరణలకు పాత్రుడగునో, అట్టి గౌరవాదరణలకు మాలయు పాత్రుడే నని నిశ్చయించుచున్నది. కాబట్టి, అస్పృశ్యులు తా మేవగించుకొనబడుచుంటి మనియు, హీనులుగా నెంచబడుచుంటి మనియు నభిప్రాయపడకుండ చూచుట మనకు విధి. వారు జీవించుటకు, మన యెంగిలి యాకులలో విడిచివేసిన పదార్థములను వారి కొసగకుందుము గాక. ఒకే దైవమును పూజించుచు, శరీరమానసములను శుభ్రముగను, పవిత్రముగను నిలుపుకొను జనుని బ్రాహ్మణుడుగాని, మాలడుగాని, యెట్లు భిన్నముగా మన్నింపగల్గుదును ? నా మట్టుకు నేను మాలవాని కొకనికి వంటయింటినుండి త్రోసివేసిన యెంగిలిని పెట్టినను, లేక వాని కవసరము గలిగినప్పుడు స్వయముగా సేవచేయ నోడినను పాపముచేసినవాడ ననియే యెంచు కొందును.

నా యభిప్రాయము లింకను విస్పష్టముచేసెదగాక. ఈ నా డున్నరీతి అస్పృశ్యతాపద్ధతికి హిందూమతమున ఆధారము లేదని నేను నిశ్చయించువాడ నైనను, ప్రత్యేకపరిస్థితులందు, కొంత పరిమితిలో అస్పృశ్యతను హిందూమత మంగీకరించు ననుట సత్యము. ఉదాహరణకు నా తల్లి మలినపదార్థములను చేతబూనునప్పుడెల్ల, ఆసమయమున, ఆమె అస్పృశ్యయే

యగుచున్నది; ఆమె స్నానముచేసి నిర్మలురాలు కావలసినదే. ఏ స్త్రీగాని, ఏ పురుషుడుగాని తనపుట్టువుచేత అస్పృశ్యతకు లోబడునని వైష్ణవుడనగు నేను విశ్వసింపజాలను. మతముచేత నంగీకరింపబడు అస్పృశ్యత యెద్దియైనను సహజముగనే తాత్కాలికమైనదిగ నుండును; అది కర్మకు సంబంధించి యుండును గాని, కర్తకు సంబంధించి యుండదు; మఱియు పరిహరింపదగియుండును. ఇంతియె కాదు. మనము పసివారముగా నున్నతరిని మనకై చేయు శుద్ధిక్రియలను గుఱించి మనము మన తల్లిని పూజింపవలయుతీరునను, మఱియు మన కామె యొనర్చు నుపకారమును పాటించి మన మామెయెడ జూపవలసిన పూజ్యతను హెచ్చుగ గణింపవలయు విధమునను, పాకీవాండ్రు సంఘమునకొఱకై యొనర్చు శుద్ధికర్మనుగుఱించి వారియెడ నుత్తమగౌరవమును చూపవలసినవారమగుచున్నారము.

మఱియొకవిషయము. అస్పృశ్యతానివారణకు, ఒకరి ఇండ్లలో నొకరుకలిసి తినుటగాని, పెండ్లిండ్లలో నిచ్చి పుచ్చుకొనుటగాని ప్రధాన మగునని నే నెంచుటలేదు. నాకు వర్ణాశ్రమధర్మము లందు నమ్మకము కలదు. కాని నేను పాకీవాండ్రతో గూడి భోజనము చేయుదును. నేను సన్యాసిని కాగలుగుదునేమో యెఱుగను. ఈ కలియుగములో, సన్యాసికి నిర్ణయింపబడిన నియమముల నన్నింటిని నిర్వహించుట ఎవరికేని సాధ్యమగునా యని నాసందేహము. ఐనను నేను బుద్ధిపూర్వకముగా సన్యాసి యొక్క పంథాకభిముఖముగా నడచుచున్నాను. కావున ఈ నిర్బంధనిషేధముల ననుసరించుట నాకవసరమగుటేగాక, వాని

యనుసరణము నాకు హానికరమును కావచ్చును. పరస్పర వివాహసంబంధ ప్రశ్నయా నావంటివాని సందర్భమున విచారణ కేరాదు. నా ప్రణాళికయందు పరస్పరవివాహసమస్య లేనే లేదని చెప్పిన సరిపోవును. మా ఒక్క కులములోనివారైనను అందరుకలసి భోజనముల చేయరు. వైష్ణవ కుటుంబములలో కొందరి సందర్భమున, నొండొరుల పాత్రలనుగాని నొండొరుల ఇండ్లలోని పొయ్యినుండి తెచ్చిన నిప్పునుగాని, యుపయోగించుకొనరు. మీరిది మూఢాచార మనవచ్చును; కాని నేనట్లనబోను. అందువలన హిందూమతమునకు భంగము లేదు. మా యాశ్రమములోని యశ్పృశ్యసభ్యులలో నొకరగు దుధాబాయి, ఏ వ్యత్యాసము లేకుండ మిగతవారితో కలసిభోజనము చేయును. అయినను మా యాశ్రమస్థులు కానివారెవరును ఆయలవాటు నలవరచుకొన నేను ప్రోత్సహింపను! మఱియు మాలవ్యాజీగారియెడ నాకెట్టి గౌరవము కలదో మీరెరుగుదురు. నేను వారి పాదముల కడిగెదను. ఆయన నేనుతాకిన అన్నమును తినడు. అది నా కగౌరవమని నేను కినుకపూనవలసినదేనా! అందు తిరస్కారభావము లేదని యెఱుంగుటచేత నేను కోపగించు కొనజాలను.

నే నవలంబించు మతము మాకొఱకై 'మర్యాదధర్మము'ను విధించుచున్నది. ప్రాచీన ఋషులు ధ్యాననిష్ఠులై యనేక పరిశోధనల జరిపియున్నారు. వారి పరిశోధనల ద్వారమున గొప్ప సత్యముల ననేకము కనిపెట్టియుండిరి. వీనికి సాటిరాగలవి మతే మతమునందును లేవు. కొన్ని రకముల యాహారములు నరుని యాధ్యాత్మిక క్షేమమునకు భంగకరము లని వారు తెలియుట

ఆం దొకటై యున్నది. కాబట్టి వా రట్టివానిని నిషేధించియుం డిరి. ఒకానొకడు దూరదేశములకు పోయి ఆహారవిషయమున భిన్నభిన్న ఆచారమర్యాదలు గలట్టి ప్రజల నడుమ వసించు ననుకొనుడు. అత డెవరిమధ్య నివసించునో అట్టి ప్రజల సంఘాచారముల బలము వానిపై నెంతగా నుండునో గ్రహించినవారు గావున, అట్టి అవసర సందర్భములలో వానికి సహకారముగ నుండు నిమిత్తము ఋషులు మర్యాద ధర్మమును విధించి యున్నారు. నా కటువంటి మర్యాద ధర్మమునందు విశ్వాస మున్నను అయ్యది హిందూమతమున నొక ప్రధానాంశ మని భావించుటలేదు. ప్రమాద మేమియు లేకుండ ఈ నిర్బంధములు తొలగించివేయుటకు దగిన కాల మొకటి రాగల దనియు నా యూహ. కాని, అస్పృశ్యతానివారణోద్యమమునందు, భోజన ప్రతిభోజనముల గుఱించియు, పెండ్లిండ్లలో నిచ్చిపుచ్చుకొనుట గుఱించియు గల నిబంధనలు తొలగించివేయు నుద్దేశ్యము లేదు. మిథ్యాచారత్వమును, అసంబద్ధత్వమును నా కంటగట్టినను సరియేగాని, ప్రజ లీ నిబంధనలను పూర్తిగా రూపుమాపివేయుటను నేను ప్రోత్సహింపజాలను. ఉదాహరణకు నా కుమారుడు ముసల్మానుల యిండ్లలో భోజనముచేయుటకు నే నంగీకరింతును. ఏమన, తా నేది తినదగు నను విషయమున తగిన జాగ్రత్త నతడు తీసుకొగలవాడు. ముసల్మానుల యిండ్లలో ఆహారము తీసుకొనుటకు నాకు నభ్యంతరము లేదు. ఎందుకనగా, నా యాహారమును గుఱించిన ప్రత్యేక నియమములు నాకు గలవు. ఆ విధులలో జరిగిన యొక యుదంతమును వినుడు. స్వామిసత్యదేవుడును, నేనును ఖ్వాజాసాహెబుగారి అతి

ఘులుగా నుంటిమి. స్వామిసత్యదేవుడు నా యభిప్రాయములతో నేకీభవించువాడు కాడు. మేము వానిం గూర్చి తర్కించుకొంటిమి. నా కున్న యభిప్రాయములతో ముసల్మాను డొసగిన ఆహారమును నేను స్వీకరింపకుండుట యెంత దోషమో, ఆయన తన మర్యాదధర్మము నతిక్రమించుటయు అంతటి దోషమే యగు నని నే నాయనతో చెప్పినాను. కాబట్టి స్వామిసత్యదేవుని కొఱకై ప్రత్యేకపు వంటయేర్పాటులను చేసిరి. అదే తీరున నేను బారీసాహెబుగారి అతిథిగా వెళ్లినప్పుడు, సంబారముల నన్నింటిని తాజాగా బజారు నుండి తెచ్చు గట్టి నియామకముతోసహా ఆయన మాకొఱ కొక వంటబ్రాహ్మణుని యేర్పాటుచేసినాడు. అటువంటి యిబ్బందుల కేల తాను పాల్పడవలసివచ్చె నని ప్రశ్నించినప్పు డాయన నన్ను గాని, నా యనుచరులను గాని మతాంతరుల చేసివేయుటకై తాను రహస్యపు పన్నాగముల పన్నుచున్నా డను సంశయమును ప్రజలు పొందు నవకాశ మిసుమంతయు లేకుండ చూచు కొఱకై యటుల చేసితి నని సమాధానము చెప్పినాడు. ఆ యుదంత మొక్కటియే బారీసాహెబుగారి యందు గల నా గౌరవము నెంతయో పెంపొందించినది. ఆయన కొన్ని తడవులు పొరపాట్లు చేయుచుండును; కాని, ఆయన పసిబిడ్డను బోలు నమాయకుడును, నిరాడంబరుడును. అప్పుడప్పుడు ప్రజలు వానింగూర్చి కొండెము లెన్నో నాతో చెప్పుచుందురు. ఐనను మొదట నా కాయనయందుగలిగిన సద్భావము చలించుటలేదు.

నే నీయంశమును గుఱించి యింత దీర్ఘముగా చర్చించుటేల యన, అస్పృశ్యులతో పూర్తిగ నిష్కపటముగా నాయభి

ప్రాయమును చెప్పగోరుచున్నాను. మీతోడనేగాదు, మ
తెవరితోడనైనను సరియే, వ్యవహరించునపుడు కుతంత్రమును
ప్రయోగించుట నాకు గిట్టదు. మిమ్ములను భ్రమలలో పెట్టుట
నా కిష్టము లేదు. ప్రలోభముల కల్పనచేసి మీ యభిమాన
మును చూరగొను నాశ నాకులేదు. అస్పృశ్యతను తొలగిం
చుట స్వరాజ్యప్రాప్తి కత్యవసరము కావునను, నాకు స్వరాజ్య
కాంక్ష కలదు కావునను, నే నా యస్పృశ్యతను తొలగింప
గోరుచున్నాను. ఐనను నాకొఱకై యేమేని రాజకీయప్రయోజ
నముల సముపార్జించుకొను నిమిత్తమె మీక్షేమమును బలి
గొన గోరను. నా లక్ష్యము స్వరాజ్యముకన్నను నున్నత
మైనదే. అస్పృశ్యతా నివారణము నావిషయములో నొక
తపశ్చర్యయు, నొక ప్రాయశ్చిత్తకర్మయు గావున నేనీ యస్పృ
శ్యతను తుదముట్టింప నాశించుచున్నాను. నేనేమో అస్పృశ్యు
లను శుద్ధిపఱుప నాతురపడుటలేదు; అది వెఱ్ఱిమాట. నా
యొక్కయు, హిందూమతయు యొక్కయు దోషవిమోచన
మునే నే నాకాంక్షించుచున్నాను. ఈ యనర్థము నాపా
దించుట మూలమున హిందూమతము గొప్ప పాపము నొనర్చి
యున్నది. ఇతరుల కొఱకై ప్రాయశ్చిత్తము ననుభవించుట
యన్నది సాధ్యమే యగునెడల, నాలో నా ప్రాయశ్చిత్త
చర్యను జరుపుకొని, తద్వారా హిందూమతమును పునీతము
గావింప నే నాతుర పడుచున్నాడను.

అట్లగుటంజేసి నా కార్యసిద్ధి కనుకూలించు సాధనలు
అహింస, సత్యము అనునవి మాత్రమే నని తేలుచున్నది. నే
నొక అస్పృశ్య బాలికను పెంపుడు తీసికొంటిని. నా భార్యను

నా దృక్పథమునకు పూర్తిగ త్రిప్పుకొనలేనైతి నని యొప్పుకొన్నదను. ఆ బిడ్డను నేను ప్రేమించినంతగా నా భార్య ప్రేమింపలేక పోయినది. అయినను కోపగించి నా భార్యను మార్చలేను గదా. ప్రేమ తోడనే నే నటుల చేయవలసియుండెను. నావా రెవరైనను మీయెడ నపచారము చేసియేని, అందుకైనను మిమ్ము క్షమాపణ కోరుచున్నాను. హిందువులు తమయెడ జూపు నిరాదరణను మానుకొననియెడల తాము బలప్రయోగ మును సాగింతు మని అస్పృశ్యులు కొందఱు పూనాలో నుండగా నాతో చెప్పినారు. అస్పృశ్యత నా తీరున పశుబల ప్రయోగము చేత నివారించుట సాధ్యమగునా? అస్పృశ్యజనో ద్ధారణ ఇట్టి పద్ధతుల ద్వారమున లభించగలదా? హిందువుల మూర్ఖపు పట్టుదలను మీరు గాని, నేను గాని తొలగించుటకు ఏకైక విధానము ప్రశాంతముగా వాదము జరుపుటయు, నిర్దుష్ట ప్రవర్తయునే సుడీ!. వారు పరివర్తనము చెందనంతకాలము నోర్పువహించి, యిబ్బందులు పడుచునేయుండు డనుటే మీకు నేను చెప్పగల సలహా. మీ పక్షమున నిలిచి, మీతో పాటు కష్టముల ననుభవించుటకు నే నొడంబడుచున్నాను. ఇతర కుల ములవారు పోయి పూజ లర్పింపగలుగు నే దేవాలయములోని కైనను ప్రవేశించు హక్కు మీకు నుండవలయును. ఇతర కుల ముల బిడ్డలతో పాటు ఎట్టి భేదమును లేక మీ పిల్లలు పాఠ శాలలందు చేర్చుకొనబడవలయును. వైస్రాయి పదవితోసహా ఈ దేశములోని అత్యున్నతోద్యోగమును సయితము పొందు టకు మీ కర్హత యుండవలయును. అస్పృశ్యతానివారణను గూర్చిన నా ప్రణాళిక యిది!

నా మతము బోధించు మార్గము ననుసరించి, యీ విషయమున నేను మీతో తోడ్పడగలను. అంతియేగాని, పాశ్చాత్య పద్ధతుల ననుసరించి కాదు. ఆ విధముగా నేను హిందూమతమును సంరక్షింపజాలను. మీది యొక పవిత్రోద్యమము. పైశాచికమార్గము ననుసరించి యెవరైనను పవిత్రోద్యమమును సాధించుట పొసగునా ? కాబట్టి నా ప్రార్థన విని, పశుబలము నాశ్రయించుటచే మీ దుర్దశను బాపుకొను ప్రూనికను మీ మనముల నుండి తొలగించివేయుడు. నిష్కళంక హృదయముతో పరమేశ్వరుని ధ్యానించు సతడు మోక్షమును బడయగల్గు నని గీత మనకు బోధించుచున్నది. ధ్యాన మనగా భగవంతు నాశ్రయించు టే. భగవంతుని ఆశ్రయించుట వలన మోక్షానందమే లభించుచుండగా, నీ యస్పృశ్యతానివారణ మింకను నెంత సులభతరముగా ప్రాప్తింపగల్గునో యోచించుడు! భగవంతుని ఆశ్రయించు టనగా పవిత్రతను పెంపొందించుకొనుట యనికూడ అర్థము. ప్రార్థనలచేసి పునీతులగుచు, అస్పృశ్యతను తొలగించుకొనుటే గాక, మనము స్వారాజ్యము నయితము సత్వరము దాపగునటుల చేసికొందము గాక!

## ఘోషా పద్ధతి

వంగదేశము, విహారము లేక సంయుక్తరాష్ట్రములకు నేను పోయినప్పుడెల్ల, యితర రాష్ట్రములందు కన్న ఘోషా పద్ధతి యచ్చో హెచ్చుగ నున్నట్లు కనిపెట్టుచున్నాను. అల్లఱులు, గందఱగోళములు, త్రొక్కిసలాడు మూకలు నేమియు లేని

శాంతిపరిస్థితులలో నొకరాత్రివేళ దర్భంగానగరమున నే నుపన్య సించుచుండగా, నాయెదుట పురుషులు మాత్రమే కాన్పించిరి. కాని నా వెనుక తెరచాటున స్త్రీలు గలరట. వారిం గూర్చి యెవరో నాకు చెప్పువఱకు నా కేమియు తెలియలేదు. అక్కడ జరుగవలసిన కార్యమో, అనాథశిశు శరణాలయమునకు పునాదిరాయి వేయుట. కాని తెరవెనుక నున్న నారీమణుల నుద్దేశించి యుపన్యాసము చేయు డని నన్నుకోరిరి. నాపలుకు లాలకించు శ్రోతలసంఖ్య యెంతయో నాకు తెలియదు. దేనివెనుక మరుగై వారు కూర్చుండిరో యా తెరను గాంచగా నాకు విచారము గలిగినది. అది నన్ను గాఢముగా బాధించినది; అవమానపఱచినదికూడను. ఈ మూర్ఖాచారము మొట్టమొదట నవలంబింపబడినప్పు డేమేని ప్రయోజనము కలదైనను, ఇప్పుడుమాత్రము పూర్తిగా నప్ర యోజనమైనది; మఱియు దేశమున కెన్న నలవిగాని యపకార మును చేయుచున్నది. అట్టి మూర్ఖాచారమును గట్టిగ పట్టుకొని యుండి, భారతదేశపు స్త్రీజనము నెడ పురుషులెంతటి యపచా రము గావించుచుండిరో తలపోసితిని. గత శతవత్సరములుగా మనము గఱచుచున్న విద్య యంతయు మనయెడల నిసుమంత యేని ఫలకారియైనటుల కాన్పించుట లేదు. ఏమన, విద్యా సంపన్నమగు గృహములందును ఘోషాపద్ధతి ఆచరణలోనే యున్నది. అట్లుంట విద్యాధికులగు పురుషులు దానిని ప్రయోజనకరమని నమ్ముటవలన కాదు; సాహసముతో వా రా మూర్ఖాచారము నెదిరించి, యొక్కపట్టున దానిని ఛేదించి వేయజాలకపోవుట వలననేసుడీ! వేలకొలదిగా స్త్రీలు సమా

వేశమగుచు వచ్చిన యెన్నివందల సభలలోనో ఉపన్యసించు భాగ్యము నాకు లభించినది. ఆ సభలలోని గలభా, అచ్చటి ధ్వని సభకు వచ్చిన స్త్రీల మనస్సునకు నాటునటుల నుపన్య సించుట దుర్లభము గావించెడివి. ఇండ్లలోను, మండువాల లోను బోనులలోవలె, వారిని మూసిపెట్టునంత కాలమును నింతకన్న మఱేమి యాకాంక్షింపగలము! అట్టివారి నొకపెద్ద గదిలోచేర్చి ఎవరో యుపన్యాస మిత్తురు వినుడని హఠాత్తుగ వారిని కోరినచో, వారికి తమలో తామెటుల వర్తింపవలయునో, యుపన్యాసకునియెడ నెట్లు వర్తింపవలయునో తెలియదుగదా! తుదకు సందడి తగ్గిసపిమ్మట, దినదినమును విచారింపదగిన విష యములనైనను వారికి నచ్చచెప్పుటయు కష్టమే. ఏమన, స్వేచ్ఛావాయువును బీల్చు నలవాటు లేనివా రగుటంబట్టి, వారి యంశములం గూర్చి యేమియు గ్రాహ్యము కాజాలదు. నేను చెప్పుదానిలో కొంత అతిశయోక్తి కలదని నేనెఱుంగు దును. నే నెవరి యెదుట నుపన్యసించు నదృష్టముం గంటినో అట్టి వేలకొలది సోదరీమణులయు తమసంస్కృతినాకు తెలియును. పురుషు లెంతటి యున్నతికి బోగల్గుదురో అంతటి యున్నతికి వారుగూడ చేరజాలుదురని నే నెఱుగుదును. మఱియు వా రెన్నడును గడపదాటి పోజాలరనియు గ్రహించుచున్నాను. ఐనను, యీస్థితి విద్యావంతులగు తరగతులవారికి గౌరవము గూర్చునదకాదు. వా రింతకన్న ముందుకుపోకుండుటకు కారణ మేమనునదియే ప్రశ్న. పురుషు లనుభవించు స్వాతంత్ర్యమును మన స్త్రీల ననుభవింపనీకుండుట హేతువేమి? వారు బహిరంగ ముగ నడచిపోయి, స్వచ్ఛవాయువు నేల పీల్చదగదు?

పాతివ్రత్య మనునది యొకమూల మూసిపెట్టి, పొదుగదగి నది కాదు. వెలుపలివారు తెచ్చి పైని బడవేయునదియుకాదు. చుట్టును ఘోషాగోడ కట్టి పోషింపతగినదియు కాదు. అది లోపలినుండి పెరుగుకొని రావలసియున్నది; ప్రతి పరిశోధనా ఘాతమునకును తట్టుకొని నిలువగలదిగ నుండవలసి యున్నది. సీతయొక్క పాతివ్రత్య మంతటి ధీరమైనదై వెలయవలయును. పురుషుల కనుచూపులకే తాళజాలని శీలము కడుతుచ్ఛమైన దిగ నుండును. పురుషులు తాము పురుషులుగా వెలయవలయు నన్నచో, స్త్రీలు తమ్ము నమ్మవలయు నని పట్టుపట్టునటులనే, తామును వారిని విశ్వసింపగలవారై యుండవలయును. మన మొక యంగమును పూర్తిగా పక్షవాతగ్రస్తమైనదానిగాగాని, కొంత పక్షవాతగ్రస్తమైనదానిగా గాని చేసికొని బ్రతుకజూడ కుందుము గాక. తానున్న తీరుగనే సీతయు స్వేచ్ఛాస్వాతంత్ర్య ములు గలదిగా నుండనియెడల రాము డెక్కడ నుండెడివాడు? ధీరతతోఁగూడిన స్వతంత్రభావమున కొకవేళ ద్రౌపది శ్రేష్ఠ తరాదర్శము గానోపును. సీతయో మూర్తీభవించిన సాధుభావ మనదగును. ఆమె కోమలకుసుమము. ద్రౌపదియో, దృఢతర మహాభూరుహము వంటిది. మహాబలవంతు డగు భీముని సయి తము తన ధీరస్వాంతమునకు తలయొగ్గునటుల చేసినది. భీముడు మహాభీమాకారుడే; ఐనను, ద్రౌపదియెదుట మేకకూనయై పోయెడివాడు. పాండవు లెవరును ఆమెకు రక్షయై నిలువ నగ త్యము లేకపోయినది. భారతదేశపు స్త్రీల స్వేచ్ఛాభ్యున్న తితో ప్రమేయము కల్పించుకొనన బూనుటవలన, స్వేచ్ఛా స్వాతంత్రప్రియులగు పురుషుల యభ్యున్నతికి నవరోధము కల్పిం

చినవార మగుచున్నాము. మనము మన స్త్రీలయెడ గావించు నపరాధములు, అస్పృశ్యులయెడ గావించు నత్యాచారములు వేయిమడుంగులై వచ్చి మన తలపై బడుచున్నవి. మన దుర్బలతకు, మన కర్తవ్యతా విమూఢత్వమునకు, మన సంకుచిత భావమునకు, మన నిస్సహాయతకు కొంతవఱ కదియే హేతువు. ఒక్కమ్మడి దా పూనిక వహించి యీ ఘోషాపద్ధతిని పటాపంచలు చేసివేయుదము గాక !

## ఘోషా నిర్మూలనము

సహేతుకమగు నొక విజ్ఞాపనపత్రము బీహారులోని పలుకుబడి గల యేబదిమంది పురుషులయొక్కయు, ఆరాష్ట్రమువారే యగు నదేసంఖ్యగల సతీలలామలయు సంతకములతో ఘోషాపద్ధతిని పూర్తిగా తొలగించి వేయుడను ప్రార్థనతో బీహారు నందు ప్రకటింపబడినది. పూనిక వహించి పని సాగించినచో, ఏబదిమంది స్త్రీరత్నములు దానిపై సంతకములు చేసి రనెడు సంఘటనమువలన ఘోషా యనునది బీహారులో అచిరకాలముననే తాతలనాటి ముచ్చటయై పోగలదని యెంచనగును. ఆ సంతకములుచేసిన నారీమణు లాంగ్లేయాచారములకు మఱగిన మదవతులుగాక, పూర్వాచారపరాయణలగు హిందూ స్త్రీలనువిషయము ముఖ్యముగ గమనింప దగినయంశము. అవిజ్ఞాపనమున నిట్లున్నది—

మన రాష్ట్రమందలి స్త్రీలు కర్ణాటకము, మహారాష్ట్రము, చెన్నపురి యందలి స్త్రీలవలె బహిరంగముగ నరుగ స్వేచ్ఛ గలవారై, సర్వవిషయము లందును సంఘజీవనమునందు ప్రధానముగా భారతదేశ మర్యాద ననుసరించి

తమ యర్హస్థానమును పడయవలయు ననియు, బలాత్కారమగు అంతఃపుర వాసమునుండి యొకటే సారిగా ఆంగ్లేయాచారమునకు దిగుట పెనమునుండి యెగిరి పొయ్యిలోఁ దుముకుటవలె నుండు ననియు, కావున అట్టి యాంగ్లానుకరణమున బడిపోకుండగనే మన నారీరత్నములు హైందవాదర్శముల ననుసరించియే వర్తించవలయు ననినచోఁ ఘోషాపద్ధతి తొలగిపోవలయు ననియు మే మభిప్రాయ పడుచున్నాము. మన సంఘ జీవనమున నైతికసంపదను పెంపొందించి ఔదార్యమును, సౌందర్యమును ప్రవేశపెట్ట దలచితిమేని స్త్రీలు ఇంటికడ యోగ్య లగు వ్యవహర్తలుగను, తమ భర్తలకు సహకారు లగు సహచరులుగను సంఘమున ప్రయోజన పరాయణ లగు సభికవర్గము గను వెలయ గోరుదుమేని ఈనాడున్న ఘోషాపద్ధతి అంతరింప వలసియున్నది. నిజమున కీ తెరను చీల్చివేసిన గాని వారి పురోవృద్ధిని గురించి సార్థకమగు నే పనియును సాగింపలేము. కృత్రిమ మార్గమున నిర్బంధింపబడి యున్న సగపాలు ప్రజాశక్తిని విడుదల చేసి అందొక మహాసత్వ సమృద్ధికి మూలమై సక్రమముగ వినియోగించుకొనుచోఁ మన రాష్ట్రమునకు మితిలేని అభ్యుదయమును చేకూర్పగల్గు నని మాదృఢ విశ్వాసమై యున్నది.

బీహారు నందలి ఘోషాపద్ధతివలని యనర్థముల నన్నిటిని నే నెరుగుదును. ఈ యుద్యమము తరుణముగాని తరుణమున తొందరపాటులోఁ బయలు దేరినదనుట కేమాత్రమును వీలులేదు.

ఈ యుద్యమమున కొక విచిత్రమైన మూలకారణము గలదు. ఒక ఖద్దరు ప్రచారకుడు బాబురామనాథ మిశ్రాయను నాయన ఘోషాపద్ధతి పీడనుండి తన భార్యను విడుదలచేయ దలచెను. వాని బంధువు లాబాలికను సబర్మతీ యాశ్రమమునకు రానీయని కారణమున ఆశ్రమములోని యిరువురు బాలికల నామెతోఁ సహవాసముగా నుండుటకై తీసికొనివెళ్ళినాడు.

వారిలో నొకామె మగన్లాలు గాంధీకుమార్తె రాధావేణి బోధకురాలుగా నుండెను. కీర్తిశేషులు దాల్బహదూరు గిరిగారి కుమార్తె దుర్గాదేవియు ఆమెతోగూడ వెడలినది. మిశ్రాగారి సతిని, చిన్నదానిని, ఘోషావిడుచు ప్రోత్సాహముచేయుదురను కారణముచేత, బాలికయొక్క జననీజనకు లీ యాశ్రమబాలికల పైని కుపితులైరి. ఈ బాలికలు కష్టముల కన్నిటికి నోర్చుకొనిరి. ఈలోపుగా తన కుమార్తెను చూడబోయిన మగన్లాలుగాంధీ, ఎన్నికష్టములనైన భరించి తన ప్రయత్నమున స్థిరముగ నుండుమని రాధావేణికి ధైర్యము చెప్పినాడు. రాధావేణి పని చేయుచున్న గ్రామములో ఆయన జబ్బుపడి పాట్నాలో మర ణించినాడు. బీహారు నందలి మిత్రులు ఘోషాపద్ధతిపై దాడి సాగించుట తమకు గౌరవప్రదమని నిశ్చయించిరి. రాధావేణి తనయధీనమందున్న బాలిక నాశ్రమమునకు దీసికొనివచ్చినది. ఆమె యాశ్రమమునకు వచ్చుటచేత నింకను అలజడి చెలరేగి నది. అంతకుముందే సిద్ధపడియున్న యామె భర్త యింకను హెచ్చు నుత్సాహముతో నాతగవు నెదుర్కొన వలసినవా డయ్యెను. ఈ తీరుగ నా యుద్యమము వ్యక్తిసంబంధముగలదై, యెక్కువ పట్టుదలతో సాగినది. బీహారులో ననేక పోరాట ములం దారితేరిన యోధాగ్రేసరుడగు బాబు వ్రజకిశోరుడు ముందు నిలువబడినాడు. ఆయన పూనిన యే యుద్యమమును గాని సమసిపోవ నిచ్చినటుల నాకు జ్ఞప్తి లేదు.

ఆయాచారము బీహారులో సగము మానవసమూహము చేయగల సంఘసేవను క్రూరముగా నణచివేయుచున్నది. అనే కుల సందర్భములలో మంచిగాలి మంచివెలుతురు అనుభవించు

స్వాతంత్ర్యమును సయితము హరించుచున్నది. అటువంటి యాగ్రహారాచారములపైన తీవ్రయుద్ధమును ప్రారంభించుటకై, జులయి ఎనిమిదవ తేదీని నిర్ణయించుచు విజ్ఞాపన పత్రము బయలుదేరినది. స్వరాజ్యయాత్ర నరికట్టు సంఘదురాచారము లెక్కువయిన కొలదిని, మన మాశించు గమ్యమును చేరుట కగు మన గమనము హెచ్చుచుండునని తెలియవచ్చుచున్నది. మన మాన్యతరార్థాంగమును పక్షవాతముచే పడిపోవనిచ్చుచు మేని, ఆత్మరక్షణము గావించుకొనుటగాని, తొట్రుపడకుండ యితరజాతులతో పోటీకి నిలుచుటకుగాని మనము సమర్థులము కామనుట తథ్యము.

కాబట్టి ఘోషాపద్ధతిమీదికి పట్టుదలతో దాడిసాగించిన బీహారునాయకులను నే నభినందించుచున్నాను. ముఖ్యముగా ఈ సంస్కరణము యొక్కయు, సామాన్యముగా నన్ని సంస్కరణముల యొక్కయు విజయము ప్రచారకుల పవిత్రశీలముపై నాధారపడియుండును. ఆ విజ్ఞాపనమీద సంతకములు పెట్టిన స్త్రీరత్నములపైని చాలబాధ్యత యుండును. వారు తమ ఘోషా పద్ధతిని విడిచివేసినను, భారతనారీ జనమునకు సహాయమగు బిడియమును నిలుపుకొందురేని, దుర్భరప్రతికూలములను ధైర్యముతో నెదుర్కొని స్థిరముగ నిలుతురేని, వారి ప్రయత్నముల విజయము వేవేగము తటుముకొని రాగలదు. ఘోషాపైని సాగించు నీ యుద్ధమును సక్రమముగా నడిపిన యెడల నది బీహారు స్త్రీపురుషులకు, ఉభయులకును, నిర్దుష్టరూప మగు సమష్టి ప్రజాసామాన్య విద్యాప్రచారమై యొప్పగలదు.

ఈనెల ఎనిమిదవ తేదీని, బీహారులో ననేకములగు ప్రధాన కేంద్రములందు సాగింపబడిన ఘోషా వ్యతిరేక ప్రదర్శనము లు, వాని నేర్పాటు చేసినవారి యాశలను మించి హెచ్చుగ విజయవంతమై వెలసినవని బీహారు మిత్రుడొకడు వ్రాసిన ఉత్తరము తెలుపుచున్నది. పాట్నాయందలి సభను గుఱించిన 'సర్చిలైటు' పత్రికలోని నివేదిక యిట్టుల ప్రారంభింపబడినది.

'గడచిన ఆదివారము (జూలయి 8 వ తేదీ) నాడు రాధికాసింహాభవనమున జరిగిన స్త్రీపురుషుల యొకటి సమష్టిసభ అసదృశ్యమై పఱగినది. అదృష్టవశమున సరిగా సభాసమయమునమాత్రము నిలిచిపోయినను ధారాపాతముగ వర్షము పడినది. అట్టి వర్షమును లక్ష్యము చేయక సమావేశమైన జనసమూహము అంత గొప్పది కాగలదని ఎవరును తలంపజాలరైరి. యథార్థమునకు అల విశాలమగు రాధాసింహాభవనమున సగభాగము స్త్రీలతో నిండిపోయినది. వారిలో ముప్పాతికమంది, ఆక్రమింపబడినవునకు, ఇంతేల? ఒకగంటకాలము క్రిందటి వఱకును ఘోషాపద్ధతికి కట్టుపడియున్నవారలే!

ఈ క్రిందిది ఆసభయందు చేయబడిన యొక తీర్మానముయొకటి అనువాదము :—

"ఇచ్చో సమావేశమైన పాట్నానగరవాసుల మగు స్త్రీపురుషులము ఘోషాపద్ధతియను దుష్టాచారమును తొలగించి వేసినారము. అది దేశమునకు, ముఖ్యముగా స్త్రీజనమునకు గణనాతీతమగు నపకారమును గావించినది. ఈయాచారమును సూపుమాపుటలో నింకను సందేహించుచున్న యీరాష్ట్రమందలి ఇతర స్త్రీజనమును గూర్చి వీలగునంత త్వరితముగా దానిని తొలగించి వేయుమనియు, తమ్ములమున తమ విద్యార్జనమును, ఆరోగ్యమును పెంపొందించుకొనుమనియు విజ్ఞప్తి చేయుచున్నాము."

ఘోషాపద్ధతిని మాన్పుకొఱకు తీవ్రప్రచారము సాగించుటకును, బీహారురాష్ట్రమున స్త్రీవిద్య వ్యాపింపచేయు నిమిత్త

మును, తాత్కాలికముగా నొక సంఘము నాసభలో నేర్పాటు గావించిరి. ప్రతిపట్టణమునందును, ప్రతి గ్రామమునను మహిళా సమితుల నెలకొలుపు సలహానొసగుచు మూడవతీర్మానము చేయబడినది. ఉత్తమసతులుగను, నేర్పుగల తల్లులుగను, ప్రయోజనపరులగు దేశసేవికలుగను సిద్ధమగు తెలుగున శిక్షణము బడయుటకై కొంతకాలము స్త్రీలు వసించుటకు దగిన మహిళాశ్రమముల నందందు స్థాపించుటకై నాలుగవతీర్మానము చేయబడినది. అయిదు వేలరూప్యములకు పైగా నచ్చటనే యీయుద్యమము నిమిత్తమై వాగ్దానము చేయబడెను. ఇరువదియైదురూప్యములు మొదలు రెండువందలయిరువదియైదు రూప్యములవఱకు నొసగిన దాత్రీమతల్లులపేరులను నేను గాంచితిని. ఆపత్రిక బీహారులో పెక్కుతావులం దట్టిసభలు జరిగినటుల నివేదికలను ప్రకటించినది. ఆప్రచారమును చక్కగ నియమించి యుత్సాహముతో సాగించునెడల, ఘోషాపద్ధతి సత్వరము గతమున గలసిపోగలదు. ఇది ఆంగ్ల సంప్రదాయమును దెచ్చి పెట్టు నొక యుద్యమము కాదనుటను గ్రహింపదగియున్నది. తాము సహజముగ పూర్వాచారపరాయణులయ్యును,హిందూ సంఘమునజొరబడిన యనేకములగు దురాచారముల గుర్తించి నట్టి ప్రముఖులవలన తమకు పుట్టువుతోడనే యలవడియున్న పూర్వాచారపరాయణత్వముతోడనే సాగింపబడిన యుద్యమమే యిది. బాబు వ్రజికిశోరప్రసాదుగారును, దూరమున లండనునగరమునం దుండి యీ యుద్యమమును కనిపెట్టి చూచుచు ప్రోత్సహించుచుండిన బాబు రాజేంద్రప్రసాదు గారును పాశ్చాత్యసంప్రదాయమున దిగజారిపోయిన భార

త్రీయులకు నమూనాపురుషులు కారు! వారు పూర్వాచార పరాయణులగు హిందువులు, హైందవసంస్కృతిని సంప్రదాయమును నభిమానించువారు. వారు గ్రుడ్డిగా పాశ్చాత్య నాగరికత ననుసరించువారు కారు; ఐనను దానియందలి యుత్తమ లక్షణముల స్వీకరించుటకు వెనుదీయువారును గారు. కాబట్టి అమూల్యమగు హైందవసంస్కృతినిగాని, ముఖ్యముగా భారత నారీజనమునకు విశిష్టలక్షణమై యొప్పు స్త్రీజనోచితమగు సరళతను, నమ్రతనుగాని యీయుద్యమ మేతీరుననేని భంగపఱచు నేమో యనుచు ధైర్యవిరహితులును, సందేహాస్పదులును పొందు భయమునకు అవసరమే లేదు.

## స్త్రీజనోద్ధరణము

బొంబాయి భగినీసమాజమునందలి యుపన్యాసాంశములు:—

"స్త్రీజనోద్ధరణ" మనునప్పుడు మన కేమి భావము కలుగుచున్నదో స్పష్టముగా గ్రహించవలయును. స్త్రీ అథఃపతనము పొందియున్న దనుభావము మున్ముందుగా కలుగుచున్నది. అట్లగు నెడల, ఆపతనమునకు కారణము లేవియో, ఆ కారణము లెట్టుల సంఘటిలినవో కూడ విచారింప వలసియుండును. ఈయంశములంగుఱించి తీవ్రముగ నాలోచించుట మన ప్రథమ విధిగా నేర్పడుచున్నది. విశాలాకాశమున నొక నలుపో యనునటుల బహుళ సంఖ్యాకులగు మన ప్రజలలో బహుస్వల్ప సంఖ్యాకులకు మాత్రమే యీ ఆందోళన పట్టినదని భారతదేశమంతటను సంచారము చేయుచో నేను గనుగొంటిని. కోట్లాది స్త్రీపురుషులు ఎచ్చటనేని ఇట్టి యాందోళన గలదను జ్ఞానమే

లేక జీవించుచున్నారు. ఈదేశములో పూర్తిగా నూటికి ఎను బదియైదుగురు తమచుట్టు జరుగు స్థితికి దూరులై, యేమియు తెలియకుండనే కాలము గడుపుచుందురు. ఇట్లజ్ఞానులయ్యును ఈ స్త్రీపురుషులు జీవితములో తాము చేయగల యేస్వల్ప మునో చక్కగనే, సక్రమముగనే నిర్వహించుచున్నారు. ఇరు తెగలవారికిని ఒకేరీతివిద్య గఱపబడుచున్నది. అంతకంటె సమానముగా విద్యావిహీనులుగ నుంటున్నారన దగును. కాని ఇరుతెగలును తగురీతిని పరస్పరము సాహాయ్యము చేసికొను చుందురు. ఏ అర్థములోనైనను వీరి జీవితములు అసంపూర్ణ ముగ నున్నవనుచో ఆకొఱతకు కారణము తక్కిన నూటికి పదునేనుమందియొక్క అసంపూర్ణ జీవనమునకే ఆరోపింపవలసి యుండును. ఈ భగినీసమాజపు సోదరీమణులు నూటి కెనుబది యైదుమందిగ నున్న ప్రజల జీవితములను చక్కగ పరిశీలించి రేని తమ సమాజకార్యక్రమమునకు దగినంత సామగ్రి దొఱక గలదు.

నే నిప్పుడు తెలుపబోవు విమర్శవాక్యములందు పైన జేర్కొన బడిన నూటికి పదునైదుమందిగానున్న ప్రజలగుఱించి మాత్రమే ప్రస్తావించెదను. అప్పుడు సయితము స్త్రీపురుషు లిరువురకును సమానముగా వర్తించు నవరోధములం గూర్చిన విమర్శకు గడంగుట అప్రస్తుత మగును. మన స్త్రీలకును మన పురుషు లకును గల తారతమ్యదశలో సాధ్యమగు పునరుద్ధరణమును గుఱించి మాత్రమే మనము విచారింప దగును. శాసననిర్మా ణము చాలవరకు పురుషులచేతిలోని కార్యముగ నున్నది. కాని యీ పురుషులు తాము చేబూనిన కార్యమునందు న్యాయము

తోడను, విచక్షణతోడను వర్తించుటలేదు. స్త్రీలు తదంతర్గతమును, అనివార్యము నై పెఱుగునటుల మన శాస్త్రములం దభివర్ణింపబడియున్నలక్షణములలోని దోషముల నివారించు నిమిత్తమే, స్త్రీజనోద్ధరణకార్యక్రమమున మనపూనికయం దత్యధిక భాగము చేరవలసియుండును. ఈ పూనికను వహించువారవరు? ఎట్లు? నాయల్పబుద్ధికి తోచినంతలో, యీ యుద్యమమును చేపట్టుకొనుటకు, నిర్మలాత్మలును, స్థిరచిత్తలును, ఆత్మనిగ్రహశీలలును, సీత, దమయంతి, ద్రౌపది మున్నగువారింబోలు నారీరత్నములను మనము సిద్ధము చేయవలసియున్నాము. అట్టివారినే మనము సిద్ధముచేసితిమా, ఆ అభినవ సోదరీగణము, తమ సాటి ప్రాచీన నారీలలామల తెరవుననే హిందూసంఘమున నిప్పుడు పూజనీయలై వెలయగల్గుదురు. వారి వాక్కులు శాస్త్రవాక్కులతో సరిసమాన మగు ప్రమాణములుగా గ్రహింపబడును. స్మృతులలో నందందు గోచరించు నిందావాక్యములం గూర్చి మనము సిగ్గుజెంది, యచిరకాలముననే వానిని విస్మరింపగలము. హిందూమతమున పూర్వ మటువంటి విప్లవములు ఘటిల్లియే యున్నవి. భవిష్యత్కాలమునను ఘటిల్లగలవు; మన మతవిశ్వాసము సుస్థిరమై యొప్పగలదు. ఇప్పుడు నే నభివర్ణించిన నారీరత్నముల వంటి నారీరత్నములు ఈ సమాజమునుండి ప్రభవింత్రు గాక యని భగవంతుని వేడుకొనుచున్నాను.

ఇప్పుడు మన స్త్రీజనముయొక్క అధఃపతనమునకుగల మూలకారణముంగూర్చి చర్చించితిమి. ఏయాదర్శముల ప్రాపించుటవలన మన స్త్రీజనముయొక్క ప్రస్తుతదశ బాగుపడగలదో

విచారించితిమి. ఆ ఆదర్శములను ప్రాపింపగల స్త్రీలు కొలదిగా నుందురు. కాబట్టి సామాన్య నారీజనము పూనిక వహించు నెడల నెంతవరకు దానిని సాధింపగల్గుదురో విచారించుదము. తమ ప్రస్తుతగతి యెట్లున్నదో చక్కగ గ్రహించుపాటి ప్రబోధమును సాధ్యమగునంతమంది మాననతుల హృదయములందు కలుగునటుల వీరుతమ ప్రథమప్రయత్నము సాగింతురుగాక! ఇట్టిప్రయత్నము సాహిత్యవిద్యాద్వారమున సాగగలదని యాశించువారిలో నే నొకడ గాను. ఆ ప్రతిపాదనతో పనిచేయుటన, మనయాదర్శ ప్రాప్తిని అనంతముగా విళంబనముచేయుటే యగును. చిరకాలము వేచియుండుట, యెంత మాత్రము నవసరము కాదని, అడుగడుగున నా అనుభవమే నాకు తెలుపుచున్నది. మున్ముందుగా మన నారీజనమునకు సాహిత్యజ్ఞానము గఱపకయే వారి ప్రస్తుత దశను గూర్చిన విషాదకరములగు యథార్థములను వారికి నచ్చచెప్ప గల్గుదుమునుడీ! స్త్రీ పురుషునితో సమాన మగు బుద్ధిశక్తి గల సహధర్మచారిణియై యున్నది. ఆమె పురుషునియొక్క కార్యకలాపములో ప్రతిస్వల్పవిషయమునందును పాల్గొను హక్కుగలదై, వానితో సమానముగా స్వేచ్ఛా స్వాతంత్ర్యములకును అర్హతగలదిగా నున్నది. పురుషు డెట్టులనో అట్లే స్త్రీయు తనకార్యక్షేత్రమున నుత్తమస్థానము అలంకరింప నర్హురాలైయున్నది. ఇదిస్వతస్సిద్ధమగుపరిస్థితియేగాని, చదువను వ్రాయను నేర్చుటవలని ఫలితాంశముగ నుండదగదు. దుష్టాచారబలమువలన మిక్కిలి అజ్ఞులును, వ్యర్థులును నగు పురుషులు సయితము స్త్రీలకన్న ఘనులుగా చూడబడుచున్నారు. అందుకు వారెంత మాత్రము

నర్హులు కారు. అట్టి అధికారము వారి కుండదగదు. మన స్త్రీజనము యొక్క దుస్థితి మూలమున మన యుద్యమములనే కము సగమువఱకు వచ్చి యాగిపోవుచున్నవి. మనము నిర్వ హించు కార్యములందు చాల భాగము, చెప్పఁకోదగిన ప్రతి ఫలము నొసగుటలేదు. తన వ్యాపారములో చాలినంత డబ్బును పెట్టుబడి పెట్టక, రూపాయీలను వ్యర్థపుచ్చుచు దమ్మిడీ దగ్గర పట్టుబట్టు వర్తకుని గతి నున్నాము మనము.

వ్రాయను చదువను నేర్పకుండ, శ్రేష్ఠమును, ప్రయోజన కరము నగు పనిని చాల నిర్వహించుటకు వీ లున్నను కూడ, అవి లేకుండ సదా పనిజరుగజాలదని నా గట్టినమ్మకము. అందు వలన మన బుద్ధి వృద్ధిగాంచగలదు; నిశితము కాగలదు. మఱి మనపరోపకార సమర్థతకు ప్రేరణ చేకూరగలదు. ఐనను వ్రాయను, చదువను నేర్చుట మాత్రానసే గొప్పవిలువ యుండునని నేను చెప్పబోవుటలేదు. దానికి దగిన విలువను దానికొసగయత్నించుచున్నాను. స్త్రీల అజ్ఞానము సాకుగా గొని వారికి సమానాధికారము లుండదగ వనుటగాని, వాని నిరోధించుటగాని న్యాయము కాదని పల్మరు తెలుపుచుందును. అయినను ఇట్టి సమాజహూ హక్కులను నిలువబెట్టుకొనుట కును, అభివృద్ధి చేసుకొనుటకును, ప్రచారము చేయుటకును, స్త్రీలకు విద్యప్రధానము. మఱియు అటువంటి విద్యలేకుండగనే లక్షలాదిజనులు ఆత్మజ్ఞానము బడయగల్గిరనుటయు నిజమే. చాలపుస్తకములు నిరుపద్రవకరమగు నానంద మొసగగలవు. చదువులు లేకపోయినచో దీనిననుభవింప వీలుండదు. విద్య లేని మానవజీవి పశుదశకు దూరుడుకాదనుట అతిశయోక్తి

కాదు. విద్య యనునది పురుషుల కెట్లో స్త్రీలకు నట్లే అవసరమగును. అయినను ఇరువురి విద్యావిధానము నొకేతీరున నుండదగదు. మనప్రభుత్వ విద్యాపద్ధతి తప్పులతడికగా నున్నది. అనేక సందర్భములలో నది హానిని చేకూర్చుచున్న దనుటను మొట్టమొదట మనము గ్రహింపవలయును. మఱియు స్త్రీపురుషు లిరువురును దానిని పరిత్యజించవలయును. అందు ప్రస్తుతము కాన్పించు దోషముల తొలగించినను కూడ, అన్ని దృక్పథముల నుండియు పరిశీలించునెడల స్త్రీలకయ్యది అనర్హమగునని నే నెంచను. స్త్రీపురుషు లిరువురును, గౌరవమునకు సమానులే గాని, ఏకరీతిజీవులుకారు. స్త్రీపురుషు లొకరినొకరు పూర్ణత గూర్చు, భిన్నరీతి వ్యక్తులు. ఒకరు లేనిది మఱొకరి యునికిని భావనచేయుటయే అసంభవమగు నంతగా పరస్పరాపేక్షితులుగనున్నారు. కాబట్టి, యీయథార్థ విషయములను గ్రహించునెడల, స్త్రీపురుషు లిరువురిలో నెవరి స్థితికి భంగము గూర్చు విషయమైనను, ఇరువురికి చేటుదెచ్చు నని తెలుసుకొనుటవసరము. స్త్రీవిద్యా ప్రణాళికను కూర్చునప్పుడు ఈ ప్రధానసత్యమును మనస్సులో సదాజ్ఞప్తి నుంచుకొనవలయును. గృహస్థజననమున, వెలుపల నిర్వహింపదగినకార్యములందు పురుషుడు అగ్రగణ్యుడు. ఆ హేతువు చేత ఆ విషయములందతనికి హెచ్చుజ్ఞానముండవలయుననుట సమంజసమగును. ఇక గృహములోపల జీవనము పూర్తిగా స్త్రీ స్వాధీనమున నడచునది. కాబట్టి గృహవ్యవహారములందును, పిల్లలను సాకుటయందును, వారికిబుద్ధులు నేర్పుటయందును, స్త్రీలకు హెచ్చు విజ్ఞాన ముండు టవసరమగును. ఇట్లనుటచేత, విజ్ఞానము చుట్టు

దాటరాని ఆవరణలుండవలయుననిగాని, కొన్ని విజ్ఞానశాఖలు ఎవరికేని నిషిద్ధములనిగాని అర్థముగాదు. కాని, బోధనా ప్రణాళికలు, మూలసూత్రముల యాధారముపై నిర్మాణ మైన తప్ప, స్త్రీపురుషులయొక్క పూర్ణజీవన వికాసము చేకూరబోదు.

స్త్రీలకు ఆంగ్లవిద్య అవసరమా కాదా యను సంశయమును గుఱించి ఒకటి రెండుమాటల దెలిపెదగాక. మనసామాన్యజీవన సరణియందు, ఆంగ్లభాషాజ్ఞానము స్త్రీలకుగాని, పురుషులకు గాని అగత్యము లేదనెడు తీర్మానమునకు నేను వచ్చితిని. సుఖజీవనోపాధి గడించుటకును, రాజకీయోద్యమములందు పాల్గొనుటకును ఆంగ్లభాషకావలయుననుట సత్యమే. స్త్రీలు జీవనోపాధిని తామే సంపాదించుకొనవలెననిగాని, పెద్దవ్యాపా రములకు దిగవలెననిగాని నాయభిప్రాయముకాదు. ఇంగ్లీషువిద్య నభిలషించునట్టిగాని, అవసరమగునట్టిగాని కొలదిమంది స్త్రీలు పురుషుల విద్యాలయములందు చేరి సులభముగా దానిని నేర్చు కొనదగును. స్త్రీలకొఱకేర్పడిన పాఠశాలలందు ఆంగ్లవిద్యను ప్రవేశపెట్టుట మన నిస్సహాయదశను పొడుగించుటకే హేతు వగును. ఆంగ్లవాఙ్మయమునందలి అమూల్యరత్నములను స్త్రీల కును, పురుషులకును సమానముగా లభ్యమగునటుల చేయ వలయు నని ప్రజ లనుటం గూర్చి చదివి యున్నాను. విని యున్నాను. అట్టి యభిప్రాయమును పూనుటలో కొంత పొర పాటు గలదని సవినయముగా మనవి చేయుచున్నాను. ఆ రత్న రాసులను పురుషుల కందుబాటులో బెట్టుచు స్త్రీలకు దూర ముగ నుంచుట యెవరి యుద్దేశ్యమును గాదు. మీకు భాషాభి

రుచి గలదేని, ప్రపంచ వాఙ్మయము నంతటిని పఠింప బూని నను మీా కవరోధము కూర్పజాలువా రీ పుడమి లేరు. కాని, ఒక సంఘము యొక్క అవసరములను దృష్టిని పెట్టుకొని విద్యా ప్రణాళికలు నిర్మాణము చేయునప్పుడు భాషాభిరుచి మిక్కుటముగా గల యే కొలదిమందికోరికలనో దీర్చుట పొసగ గలదు. ఇంగ్లీషు చదువుటలో నిప్పుడు వ్యయము చేయుచున్న కాలమును తగ్గించు డని నేను స్త్రీలను, పురుషులను కోరునప్పుడు, వారిప్పుడు బడయుచున్న ఆనందమును భంగపఱచుట నా యుద్దేశ్యము కాదు. కాని, వారింకను సహజ సిద్ధమగు విధానము నవలబించు నెడల తక్కువ వ్యయముతోడను, తక్కువశ్రమతోడను, ఆ ఆనందమునే పొందగలరనుటే నా వాదము. ప్రపంచములో జేగీయమానములగు నమూల్య కావ్య రత్నములుగలవు. అవి కాని, యన్నియు ఆంగ్లమున కూర్పుచేయ బడి యుండుటలేదు. తత్తుల్యమగు దీప్తితో వెలుంగు రచనలు తదితరభాషలందును గలవు. వీని నన్నింటిని మనజనసామాన్యమునకు అందుబాటులోనికి తీసుకొని రావలసియున్నది. అందుకొరకై మనలోని విద్యాధికులు వానిని మనదేశభాషలోనికి అనువదింప పూనుకొనుట వలన ఆపని జరుగవలసియున్నది.

పై రీతిని విద్యాప్రణాళిక నొకదానిని సూచించినమాత్రాన మనసంఘమునుండి బాల్య వివాహానర్థమును తొలగించినటుల గాదు. లేక స్త్రీలకు సమానహక్కులుసంపాదించి పెట్టినటులను గాదు. ఇక, పెండ్లియైనతోడనే దృక్పథమునుండి జారిపోయిరో యను నటుల అదృశ్యులైపోవు మనబాలికలవిషయ మాలోచింతము. వారు మనపాఠశాలలకు తిరిగిరారు. తమకొమార్తెల

బాల్యవివాహముల వలన మూడుచున్నట్టియు, తలపున నిలుప గూడ నట్టియు, నోట వచింపరానట్టియు పాపమును గుర్తెఱిగిన తల్లులు వారికి విద్య చెప్పింప జూడజాలకున్నారు. మఱియు ఇంకొక తెఱగున నైనను వారిశుష్క జీవితములను సంతసప్రద ములుగ నొనర్పజాలకున్నారు. పసిబాలను పెండ్లియాడిన పురుషుడైనను, మోహావిష్టుడైపోయి, పరోపకారచింత విడిచి, ఆమె విద్యాసంగతి పట్టించుకొనడయ్యె. ఇక ఈ బాలికల నుద్ధరించువా రెవరు? ఈప్రశ్నకు ప్రత్యుత్తరముకూడ, స్త్రీలసమస్యా పరిష్కారమందే చేరుచున్నది. ఈ ప్రత్యుత్తర మెంతటి కఠిన మైన దైనను, అది ఒక్కటియే. ఆమెభర్తతప్ప ఆమె ప్రసక్తిని పూనువారు వేఱొకరులేరు. పసిదగు పెండ్లాము తనను చేబట్టిన మగని మతిని త్రిప్పజాలు ననుకొనుట వ్యర్థము. ప్రస్తుతకాల మునకైనను ఆకష్టపుపని పురుషునికే విడిచివేయవలసినదిగ నున్నది. వీలుపడు నెడల, బాలభార్యల జనాభాను తేల్చుకొనవలె దను. మర్యాద పూర్వకముగా నైతికప్రేరణ సాహాయ్య మున, వారి బెండ్లాడిన మిత్రులందరిజేరి తమయోగక్షేమము లను పసివారగు సతులతో ముడివేసికొనిన ఘోరపాపము లను వారుగ్రహించునటుల చేతును. తమసతులకు ఉచిత విద్యగఱపి, వారు కేవలము పిల్లలగనుటకేగాక, సంతానమును సక్రమముగా పెంచుటకును అర్హులగునటుల చేయువరకును, తాము పూర్ణబ్రహ్మచర్యమును పూననియెడలను, తమపాపము నుండి పునీతులు కాజాలరని వారిని హెచ్చరింతును.

ఈ విధముగ చూచుచో, ఈ భగినీసమాజమువారు తమ సామర్థ్యమును వినియోగపఱచుటకు ఫలప్రదము లగు కార్య

క్షేత్రము లనేకము కనుగొనగల్గుదుము. విశాలతర సంస్కార ణోద్యమములను ప్రస్తుతము విడిచివేసి, దీక్షాపూర్వకముగ పూనికవహించు టవసరమగునంత కార్యరంగము యెదుటనే గలదు. స్వరాజ్యమును గురించి నోట నొక్కమాటనైన పలుక కుండ, ఆ మహోద్యమమునకు ఘనతరసేవ లొనర్చు వసతులు గలవు. ముద్రణాలయములు లేనికాలమున, ఉపన్యాసముల కవకాశము లంతగా లేనిసమయమున, ఇప్పటివలె దినమునకు వేయిమైళ్ళేగాదు, ఇరువదినాలుగుమైళ్ళప్రయాణమైన సాగు వసతులు లేనిదినములలో, మన యాదర్శములను ప్రచారము చేయుటకుఒక్కటే సదుపాయముండెడిది. అది మన 'చైదములు'. మన 'చైదముల' మహత్వము చాల గొప్పది. ఈనాడుమనము వాయువేగముతో నిటునటు పరువులుపెట్టుచున్నాము; ఉప న్యాసపరంపరల కురియుచున్నాము; వార్తాపత్రికలకు వ్యాస ముల వ్రాయుచున్నాము. ఇంతచేసినను కార్యసిద్ధి యగుట లేదు. నిరాశతో మనము చేయు విలాపములు మిన్నుముట్టు చున్నవి. ఎన్నెన్నియో వ్యాసములను, ఉపన్యాసములను ప్రజాళిపై విసరివేయు నీకాలమునకంటె, పూర్వకాలమున మన 'చైదములు' హెచ్చుమహత్వము కలిగియుండెడివని నామట్టుకు నేను విశ్వసించుచున్నాను. మీసమాజమువా రేమి చేసినను నిశ్శబ్దముగాను, నిరాడంబరముగాను జరుపు మీ చేతలకే హెచ్చు ప్రాధాన్యత నిత్తురుగాకయని మిమ్ముంగూర్చిన నాహృదయపూర్వక ప్రార్థన!

# స్త్రీల కర్తవ్యము

ఒక విద్యావతియొక్క లేఖలోని యంశములు:—

"అహింస," "సత్యాగ్రహము"ల మూలమున ఆత్మయొక్క ఘనతను లోకమునకు మీరు చాటియున్నారు. పురుషుని అపరప్రకృతిని జయించుటయెట్లా యను సమస్యను పరిష్కరించుటకు ఈ రెండుశబ్దములును దారిజూపుచున్నవి.

మనబిడ్డలు స్వయంసహాయములు కాగోరుచున్నేని, వృత్తులద్వారా విద్యనేర్పుటనునదే గొప్ప ఆవశ్యకము; విద్య నేర్పుటకదియొక్కటే మార్గము కూడను.

మా స్త్రీసమస్యాపరిష్కారము చేయుడని మిమ్ము కోరుచున్నాను. స్త్రీసమస్యయనునదియేలేదని రాజాజీపలుకుచున్నాడు. రాజకీయములందని ఆయన భావమైయుండును. ఉద్యోగములన్నియు పురుషులకువలెనే స్త్రీలకును సమానముగా లభ్యములగునటుల శాసనరూపేణా బహుశః చేయవీలుండవచ్చును. కాని మేము స్త్రీలమును, అట్లగుటచే పురుషులకంటె భిన్నలక్షణములు గలవారమనునెడు యథార్థవిషయములను మారజాలవు. మా అపరప్రకృతిని జయించుటకు అహింస, సత్యాగ్రహమునను సూత్రములకంటె అదనమగునవి మాకవసరము. పురుషునివలెనే స్త్రీయు ఘనతరవిషయముల సాధింపగోరుచుండును. పురుషుడు తనఅతిశయభావమును, మోహమును, హింసాప్రేరకమగు పశుభావమును జయించుటకు, అహింసా బ్రహ్మచర్యములు వానికెట్లవసరమో, పురుషస్వభావమునకు భిన్నముగా స్త్రీకి నైజలక్షణములై యొప్పు దుష్టప్రకృతుల జయించుటకువలయుధర్మసూత్రములు స్త్రీకిని అవసరములగును. ఆమెయొక్క స్త్రీ నైజ స్వభావములును, స్త్రీ యగుటచేత ఆమెను పెంచిన విధానమును, స్త్రీయగుటచే ఆమెకై కల్పింపబడిన వాతావరణమును అన్నియు ఆమెకువ్యతిరేకములే. ఆమె ఏ పని చేయబోయినను, ఇష్టియే, అనగా స్వభావము, పెంపకము, పరిసరములు సదా క్రోధకష్టమువచ్చి సాగిపోనీకున్నవి. "ఇంతకు, ఆమె ఆడుదేగా!" అనెడు మామూలు తిరస్కార వాక్యమునకు అవకాశము గలుగుచున్నది. "స్త్రీత్వమామె మెడకు గుదిబండ" అనునప్పుడు నాయభి

ప్రాయ మిది. మాకు సరియైన పరిహారమార్గము దొరికినయెడల, చక్కగా వృద్ధిపొందగల విధానము తెలిసినయెడల సానుభూతి, మార్దవము మొదలగు మా సహజలక్షణములు మాకవరోధములుగ నుండుటకుమారుగా మాకుసహకారము లగునటుల చేసికొనగల్గుదుము. పురుషుల సంపర్కమునను, పసిబిడ్డలసంపర్కమునను మీరుచూపు పరిహారసాధనము వంటివి మాలోపలనుండి రావలసి యున్నవి.

స్వభావము, పెంపకము, పరిసరములు అంటివిగదా! నామాటలు స్పష్టపడుటకై ఒక దృష్టాంతమును దెలిపెదగాక:

పిల్లలయెడ మాతృధర్మము నెరపుటకై దయ, కోమలహృదయము, జాలి యనునవి స్వభావసిద్ధముగనే స్త్రీలయం దుండవలయునందురు గదా! ఆమెకు తెలియకుండనే యీగుణము లామెను పట్టుకొనియుండును. కాబట్టిపనులు చక్కబెట్టవచ్చినప్పుడు ఆమె ఆవేశపూరిత యగుచుండును. పురుషులతో మెలగునప్పుడు తడబడుచుండును. కూడనిసమయములందును కోమలహృదయము చూపుచుండును. ఉద్రేక స్వభావము గలదిగాన-తేలికగా ఆడంబరమునకులోనై సామాన్యముగా చిలిపిత్రోవల ద్రొక్కును. నేను మిమ్ము చూడ వచ్చినప్పుడు అసమానేళమున జ్ఞానాన నెంతగనో వాంఛించినదాననయ్యును, ఆ యాలోచనముతోడనే గతరాత్రి యంతయు గడపినదాననయ్యును, మీ సమ్ముఖమున నన్ను మీరు కూర్చుండగోరినప్పుడు, నేనపోయి స్థూలకాయుడగు శ్రీదేశాయిగారివెనుక నొదిగి కూర్చుంటిని. నేనేమియు వినజాలకపోతిని. మిమ్ము చూడ జాలకుండ జేసికొంటిని. ఎంత చిలిపితనమో! ఇంతియగాక, నే నేమియు వివరింపజాలనైతిని; నోరు మెదపజాలనైతిని. ఇవంతయు సులభముగా నన్ను లాగిపట్టు బిడియమునకే నేనారోపింతును. తగినశిక్షణ మున్నయెడల ఈలోపము నివారణ గాయ్యెడిదనుమాట నిజమే. కాని అప్పుడు అది కాకున్న దానివంటిదే మరియొక చిలిపిచేష్టకు పాల్పడియుందును.

ఇట్టి యుదాహరణల నింకను దెలుపుచు నా భావమును వివరింపవలసిన యగత్య ముండదనుకొందును. అన్నిరకాల ఆడువారితోడను మీకుగల

యనుభవము కలవారుగాన, స్త్రీలను సరియైన త్రోవలో బెట్టుటకు పూర్ణ సమర్థమగు సూత్రము కొఱవడి యున్నదని నేననుట సమంజసమో కాదో మీకే తెలియును.

హరిజనపత్రికను చదువుమని మీరు నాకు సలహా నిచ్చియున్నారు. నే నాతురతతో చదువుచున్నాను. సరే, ఇంతవఱకును నా హృద్గతభావమునకు దగినసలహా నాకు దొఱకలేదు. నూలువడకుట, జాతీయ స్వాతంత్ర్యమునకై పోరాడుటమాత్రమే మీ శిక్షణాంశములుగ నున్నవి. పూర్తి సమస్యా పరిహారమం దున్నట్లు కాన్పించదు. నూలు వడకునట్టియు, కాంగ్రెసుయొక్క ఆదర్శముల ప్రకారము పనుల చేయ గడగునట్టియు స్త్రీలను నేను చూచి యున్నాను. అయినను, స్త్రీలయిన కారణమున వారి కారోపణచేయబడు పొరబాటులను వారు చేయుచున్నారు. స్త్రీ పురుషునివలె మారవలయునని నేను కోరుటలేదు. కాని, పురుషులకు వారి దుష్టప్రవృత్తిని నివారణకై అహింసాధర్మమును నేర్పినటుల, స్త్రీల మెత్తదనమును నివారించుట కేదేని ఉపాయమును దెలుపుడు. మా స్త్రీలక్షణములను సద్వినియోగము చేసుకొను టెట్లో, మా లోపములను గుణములనుగ మార్చుకొను టెట్లో కరుణించి తెలుపుడు.

మా స్త్రీజనమును గురించి సదా నన్ను బాధించు విషయ మిదియే. ఎవ రైనను తిరస్కారముగా ఎంతైనా స్త్రీయేగా అనగా వినినప్పు డెల్ల రోషము వెలిగ్రక్కు నుద్దేశము గల్గును. అసలు రోష ముండినగదా! ఈ విషయమును గురించి నే నొక పురుషునితో ముచ్చటించగా ఆయన నవ్వి యిట్లనినాడు:—

'మన స్నేహితుని యింటనున్న ఆ బిడ్డను చూచితివిగా? వాడు రైలెక్కి నట్లు ఆటసాగించినాడు. భుక్ భుక్ అనుచు గెంటుకొనుచుపోయి ఢమ్మని స్తంభానికి కొట్టుకొనినాడు! స్తంభమునకు చుట్టు తిరిగిపోక వాడు భుజముతో దానిని నెట్టి పాఱవేయ నెంచినాడు. కుఱ్ఱతనముగా దానిని త్రోసి పాఱవేయగల ననుకొనినాడు. వాని సంగతి జ్ఞప్తి వచ్చుచున్నది. నీవు చెప్పునది మన సత్త్వమునకు సంబంధించిన విషయము. అట్టిదానిని అర్థముచేసి

కోవలయు నని, పరిష్కారము చేసివేయవలయునని నీవు చేయు ప్రయత్నము చూడ నాకు నవ్వు వచ్చుచున్నది.

నేను మహిళోద్యమమునకు చేయు సేవ, సత్యాగ్రహమును కనిపట్టుటతో ప్రారంభ మయినదని గర్వపడుచుంటిని. ఇప్పు డీ యుత్తరమునువ్రాసిన యువతి, పురుషులకు కంటె భిన్నముగా నుండు నుపాయమేదో స్త్రీలకు కావలసి యుండునని అభిప్రాయము తెలుపుచున్నది. అట్లగు నెడల పురుషు డెవ్వడును ఆ సమస్యా పరిష్కారమును కనుగొనజాలడు. ప్రకృతియే వానిని స్త్రీకన్న భిన్నముగా చేసియున్నది. కావున, అత డెంతగా ప్రయత్నించినను, విఫలుడు కావలసినదే. కఱ్ఱక్రింద పడ్డ కప్పకే ఆకత్తెక్కడ నొక్కుచున్నదో తెలియవచ్చును. కాబట్టి తుదకు స్త్రీయే తన కేమి కావలయునో సాధికారముగా తెలుప గల్గును. స్త్రీయు, పురుషుడును ప్రధానాంశములలో ఒక్కటే యనియు, తత్కారణముచేత వారి సమస్యయు ప్రధానముగా నొక్కటేయనియు నాయభిప్రాయము. ఇరువురిలో నున్న ఆత్మ ఒక్కటయే. ఇద్దఱు నొకే జీవితమును గడుపుచున్నారు; ఒకేరీతి భావముల గలిగి యున్నారు. ఒకరు రెండవ వారి అర్ధాంశముగ నుంటున్నారు. ఒకరు రెండవ వారికి కార్యరూపమున తోడ్పడనిది జీవితము కొనసాగదు.

కాని, ఏదో విధముగా పురుషు డనేక యుగములనుండి స్త్రీని తనవశము చేసికొనియున్నాడు. కాబట్టి స్త్రీ తాను పురుషుని కన్న తక్కువయే యను భావమును కల్పించుకొని నది. స్త్రీ తనకన్న తక్కువయని పురుషుడు కపట స్వార్థముతో చేసిన బోధను విశ్వసించినది. అయినను పురుషులలో ధర్మ

ద్రష్టలు మాత్రము ఆమెకు సమాన ప్రతిపత్తి నంగీకరించి యున్నారు.

అట్లయ్యును కూడ, ఏదో యొక సందర్భమున, విభాగము సంఘటిలిన దనుటకు సందేహము లేదు. ఇద్దఱును ప్రధానముగా ఒక్కటియే యైనను స్వరూపమునం దిరువురి మధ్యను ముఖ్యమగు భిన్నత్వ మున్న దనుటయు సత్యమే. కాబట్టి యిరువురి వ్యాపారములును భిన్నముగ నుండవలసి వచ్చినది. చాలమంది స్త్రీలు పూనుకొను నట్టువంటి మాతృధర్మ నిర్వాహణమునకు, పురుషుల కవసరము లేని లక్షణములు కావలసి యుండును. స్త్రీ నివృత్తిపరాయణ; పురుషుడు ప్రవృత్తిప్రియుడు. స్త్రీ ప్రధానముగా గృహనిర్వాహకురాలు; పురుషుడు జీవనోపాధిసంపాదకుడు. ఆమె ఆహారమును సంరక్షించి పంచి యిచ్చునది. ఆమె సర్వవిధముల రక్షకురాలే. జాతియొక్క పసి పాపలనుసాకెడు లలితకళ ఆమెయొక్క ప్రత్యేకవిశిష్టాధికారము. ఆమె రక్షణయే లేనిచో జాతి అంతరించి పోవలసిన దే!

ఆహారమందిరమును విడనాడి, గృహసంరక్షణకై తుపాకీని చేబూను నటుల స్త్రీని, నియమించినను, ప్రోత్సహించినను అట్టి స్థితి స్త్రీకిని, పురుషునకునుగూడ పతనహేతువే యగునని నా అభిప్రాయము. అది మోటు జీవనదశకు మఱలుటయును, విలయమునకు ప్రారంభమును నగును. పురుషుడు స్వారి చేయవలసినట్టిగుఱ్ఱమును తాను స్వారి చేయబూనుట వలన స్త్రీ తాను పతనము గాంచి పురుషుని పతితుని చేయును. తన సహధర్మ చారిణిని ఆమె విశిష్ట వ్యాపారమును త్యజించు నటుల ప్రోత్సహించినను, బలాత్కరించినను ఆ పాపము పురు

షుని నెత్తిపై బడును. గృహాముపై నితరులు దాడి వెడలి నప్పుడు దానిని సంరక్షించుటలో నెంత శౌర్యము గలదో, ఆ గృహామును దిద్ది చక్కని స్థితియం దుంచుటలోను సమాన మగు శౌర్యమే కలదు.

లక్షలాది జానపదులను, వారికి సహజముగా పరిసరము లందు చూచునప్పుడును, చిన్న సేవాగ్రామమును ననుదినము కనిపెట్టి చూచునప్పుడును, సహజమగు కర్మక్షేత్రవిభాగము నాకు కండ్లకు గట్టినటుల గోచర మగుచుండును. స్త్రీలలో కమ్మరము, వడ్రము చేపట్టినవారు లేరు. కాని, పొలములలో బరువుపని పురుషులే చేయుచున్నను, స్త్రీ పురుషు లిరువురును గూడి పాటుపడుట గలదు. స్త్రీలు గృహములను దిద్ది సాకు చుందురు. వారు కొలదిపాటి కుటుంబాదాయమునకు కొంత పెంపు కూర్చు చుందురు. ఐనను ప్రధానముగా జీవనోపాధిని గడించుపని పురుషుడే చేయుచుండును.

ఈ కర్మక్షేత్ర విభాగమును గుర్తించిన పిమ్మట తక్కినవిష యములలో స్త్రీ పురుషు లిరువురకును వలయు సామాన్య గుణములును, సంస్కృతియు నేక రీతిగనే యుండునని తెలియు చున్నది.

జీవన మహాసమస్యకు నేను తోడు చేర్చిన దేమందురా, వ్యక్తులకుగాని, జాతులకుగాని ఏ జీవనవృత్తి ననుసరించువా రైనను, యెల్లరకును సత్యమును, అహింసయు గ్రాహ్యములని తెలుపుటయే. ఈ ధర్మసూత్రము ననుసరించి, స్త్రీ నిర్వివా దముగా నాయకత్వము వహించి, మానవజాతి పరిణతియందు

తన ఆత్మస్థానము నాక్రమించి తన కాపాదించిన హైన్యతను బాపుకొనగల దనెడు మహాశయము నాకు గలదు. దాని నామె జయప్రదముగా సాధింపగల్గు నెడల, సర్వమును కామ సంకల్పమునకు లోబడి నిర్ణయ మగుచున్నదనియు, దాని ననుసరించియే నడచుచున్న దనియు చెప్పెడు నవీన సిద్ధాంత మును విశ్వసింపక, దానిని పట్టుదలతో త్రోసిపుచ్చు వల యును. నా ప్రతి పాదనను సరళభాషలో తెలుపలేక పోతి నేమో యని జంకుచున్నాను. అయినను నాభావము తెల్లమై యుండునని నమ్ముచున్నాను. రణక్షేత్రములో చేరి తీవ్రముగా పోరుచున్న లక్షలాది జనము కామ ప్రేరితులై యటుల గావించు చుండిరంమరా అటులనే సస్యక్షేత్రములలో గూడి పాటుపడు సేద్యపరులును అట్టి ప్రేరణలకు వశులగువారు గాని, అందు చిక్కుపడు వారు గాని కాజాలరు. ఇట్లనుట వలన స్త్రీపురుషులందు నెలకొని యున్న నైజప్రేరణ వీరియందు లేదని నేను చెప్పుటగాని, సూచించుటగాని లేదు. ఆధునిక కాలమున శృంగార వాఙ్మయమునకు మఱిగిన జనమును వశము చేసికొనినంతగా వారిని కామవాంఛ వశము చేసికొన జాలదనుట నిశ్చయము. నిష్ఠురసత్యబద్ధమగు యథార్థజీవనము నెదుర్కొనవలసియున్న స్త్రీకిగాని, పురుషునకుగాని అటువంటి విషయములతో ప్రసక్తి పెట్టుకొనుటకు అవకాశము దొఱకదు.

స్త్రీయన అహింసామూర్తియే యని యీ పత్రికలో పల్మారు వ్రాసియున్నాను. అహింస యనగా అనంతప్రేమ. అనంతప్రేమ యనగా బాధ నోర్చుటలో అంతులేని శక్తి. పురుషునికి జననియై వఱగు స్త్రీయందుతప్ప యీశక్తి ఎవరిలో

హెచ్చుగ గనంగలము? మొదటి తొమ్మిది మాసములు చంటిబిడ్డ నామె చేతులలో బెట్టుకొని, పాలిచ్చుచు సకల కష్టములందును ఆనందమునే చూచు స్త్రీయే ఆశక్తిని జూప జాలునది. ప్రసవవేదనను మించగల బాధ వేఱొండేమి యుండ గలదు? సంతానము జూచుకొను సంతోషమున ఆమె దానినెల్ల మఱచుచున్నది. మఱియు తనబిడ్డ దినదినము వృద్ధిగాంచు కొఱకు కష్టపడున దెవ్వరు? అట్టి తనప్రేమ నామె సర్వ మానవకోటి యెడను జూపుగాక! తాను పురుషుని కామ ప్రయోజనమున కనువగు నుపకరణ మను మాట మఱచును గాక! అప్పుడు స్త్రీ తల్లియై, సృజన కర్త్రియై నిరాడంబర ముగ దారిజూపు మార్గదర్శినియై, పురుషుని చెంత నిలిచి సగౌర వముగా తన అర్హపదవిని అధిష్ఠింప గలదు. రణజ్వాలలలో జిక్కుకొనిపోయి, శాంతిసుధకై పరితపించుచున్న లోకమున కామె శాంతిపాఠముల నేర్పగలదు. సత్యాగ్రహోద్యమము పుస్తకములనుండి నేర్చుకొను చదువులనుకోరదు. బాధానుభ వము ద్వారమునను, విశ్వాసము ద్వారమునను లభ్యము కాగల సుదృఢహృదయమే సత్యాగ్రహమున కవసరము. అట్టి సత్యాగ్రహోద్యమమున నాయకత్వము వహించుటకు స్త్రీయే అర్హురాలు!

తన గర్భస్థుడైయున్న బిడ్డకు ప్రాణహాని కల్గునేమో యను కారణమున, మత్తుమందు నంగీకరింపని యొక నారీలలామ గాథను, కొన్నిసంవత్సరములక్రిందట నేను పూనా శసూన్ చికిత్సాలయమున రోగిశయ్యయందు బడియుండగా నాయుప చారకురాలు జాలితో నాకు తెలిపినది. ఆమె బహుబాధకరమగు

శస్త్రచికిత్సను పొందవలసివచ్చెనట. ఎవని ప్రాణరక్షణకై యెంత బాధయైనను లెక్కలోనిది కాజాలదో అట్టిబిడ్డను గూర్చిన తనప్రేమయే ఆమెతీసికొనిన మత్తుమందు! తమమధ్యమున అటువంటి వీరవనిత లెందరినో కలిగిన స్త్రీజనము, తమ స్త్రీజన్మమును తృణీకరించుకొనకుందురుగాక! తాము పురుషులై పుట్టలేదేయని పరితపింపకుందురుగాక! ఆవీరవనిత చరిత్రను నేను జ్ఞప్తిచేసికొనినప్పుడెల్ల, తనస్థితిని గ్రహించిన మాత్రాన గర్వింపదగిన స్త్రీజన్మ నాకు రాదయ్యెగదాయని మత్సరము పొందుచుందును. స్త్రీ పురుషుడుగా జన్మింప వాంఛించుట కెంత కారణము గలదో, పురుషుడు స్త్రీయైపుట్టుటను వాంఛించుటకును నంతటికారణము గలదు. అయినను ఆ యిచ్ఛ నెరవేఱునదికాదు. మన మేస్థితిలో పుట్టితిమో, ఆ స్థితి యందే ఆనందమును బడయుదముగాక! ప్రకృతి మనకు నిర్దేశించిన ధర్మమును సంతోషముగా నిర్వహింతముగాక!

## స్త్రీల కార్యరంగము

ప్రశ్న:— "ఆహారమందిరమును విడనాడి గృహరక్షణకై తుపాకిని చేబూనునటుల స్త్రీని నియమించినను, ప్రోత్సహించినను అట్టి స్థితి స్త్రీకిని, పురుషునకునుగూడ పతనహేతువే యగునని నా యభిప్రాయము. అది మోటు జీవనదశకు మరలుటయు, విలయమునకు ప్రారంభము నగు"నని మీరను చున్నారు. సరే పొలములలోను ఫ్యాక్టరీలలోను పాటుబడు లక్షలాది స్త్రీలసంగతి యేమి? వారు ఆహారమందిరములను విడనాడి, జీవనోపాధిని సంపాదింప బలాత్కరింపబడు చున్నారుగదా! మీరు పారిశ్రామిక విధానమును రద్దుపఱచి, శిలాయుగమునాటికి మరల వాంఛింతురా? అది మోటు జీవనదశకు మరలుటయు, విలయమునకు ప్రారంభమును కాదా యేమి?

స్త్రీలచే పనులుచేయించు పాపము ఘోరయనట్టియు, మీ రాదర్శముగ చూప గలట్టియు ఆ నూతనదశ యెట్లుండును ?

సమాధానము :—పదిలక్షలమంది స్త్రీలను వంటశాలల విడిచివేసి జీవనోపాధి సంపాదించుటకై పోవునటుల చేయుట తప్పే యగును. అయినను అది తుపాకీని భుజమున దాల్చునటుల చేయుటంతటి దోషము కాదు. పాటుపడుటలో సహజముగా పోటియునట్టి మోటుతన మేమియు లేదు. గృహకృత్యములను సవరించుకొనుచు పొలములలో ఐచ్ఛికముగ పని చేయుటలో మోటుతనము నాకేమియు కనిపించుట లేదు. నాయూహాప్రకారము నూతన సభ్యతయందు అందరును తమ పాటునకు దగినటుల ప్రతిఫలమును పొందుకొనుటకు తమశక్త్యనుసారము పనులు చేయుదురు. స్త్రీలు ప్రధానధర్మముగా గృహనిర్వహణమును స్వీకరించి నూతన సభ్యతయందు ఏ కొలది కాలమో వారితరపనుల చేయుగల్గుదురు. నూతన సభ్యతయందు తుపాకి సుస్థిరమగు సహజలక్షణముగ నుండునని నే ననుకొనను. దాని వినియోగము, పురుషులందు సయితము, క్రమేణా తగ్గించివేయబడును. అది పాడుకలోనున్న కాలమునందును అనివార్యమగు ననర్థముగా మాత్రమే సహింపబడును. అయినను, స్త్రీలు దానిందాకి మలినగాత్రలగుట నేను సహింపజాలను.

## స్త్రీలు - సత్యాగ్రహము

దండీ ఉప్పు సత్యాగ్రహయాత్రాసమయమున చేయబడిన విజ్ఞప్తి :—

ఈ ధర్మసంగరమున చేరుకొనుటకు కొందఱు సోదరీమణులు చూపు ఆతురత నాకు శుభసూచకముగా కాన్పించుచున్నది. ఉప్పుపన్ను నెదిరించు పోరాటము ఎంత ఆకర్షవంతముగా కాన్పించుచున్నను, స్త్రీలు కేవలము దానికి మాత్రమే పూనుకొనువారగుచో వారురూపాయిని దమ్మిడీక్రింద మార్చుకొనువారగుదురనుట తెల్లమగుచున్నది. వారు పెద్దగుంపులో నణగిపోవుదురు; తాము ఏబాధానుభవముకొఱకై తపించుచుండిరో అయ్యది లభ్యము గాదు.

దౌర్జన్యరహితమగు ఈపోరాటములో పురుషులభాగముకన్న స్త్రీలయంశము హెచ్చుగా నుండదగును. స్త్రీని 'అబల' యనుట అపనిందచేయుటే. అట్లనుటచే పురుషుడు స్త్రీయెడ అపరాధము చేసినవాడగుచున్నాడు. బలమనగా 'పశుబల' మను అర్థము చెప్పుకొను నెడల, పురుషునికన్న స్త్రీ తక్కువ పశుప్రాయయే. అటులగాక, బలమనగా "నైతిక బల" మను అర్థము చెప్పుకొను నెడల, పురుషునికన్న స్త్రీ యెన్నియో రెట్లు హెచ్చుగ గణనీయ యగును. ఆమె హెచ్చు అంతర్దృష్టిగలది కాదా? ఆమె హెచ్చు స్వార్థత్యాగిగదా? ఆమె యందు క్షమాశక్తి హెచ్చుగ నుండునుగదా? సాహసమునను ఆమె మిన్నయేగదా? స్త్రీ లేనిచో పురుషుడు కొఱగాడు. దౌర్జన్య రాహిత్యము జీవనధర్మమగు పక్షమున, స్త్రీలదే భవిష్యద్యుగ మనవలయును.

ఇప్పటికెన్నియో సంవత్సరములనుండి నేనీసంకల్పముతో ముఱియుచున్నాను. సబర్మతీ ఆశ్రమస్త్రీలు పురుషులతో పాటుగా తమను తోడ్కొనిపొమ్మని నన్నొత్తిడిచేసినప్పుడు వారు కేవలము ఉప్పుచట్టముల భగ్నపఱచుటకంటెను, ఘనతరకార్యమునే చేయనుండుట దైవసంకల్పమని నాలోపల నొకశకునము పలికినది.

వారుచేయగల ఆకార్యము నాకిప్పుడు ద్యోతకమగునటుల తోచుచున్నది. కల్లు దుకాణాలదగ్గఱను, విదేశీగుడ్డలషాపుల దగ్గఱను 1921 సం॥లో జరిగిన పికెటింగు, అనుకొనినదానికంటెను హెచ్చుజయప్రదముగా కొంతవఱకు సాగినను, అందు దౌర్జన్యము జొఱబడుటవలన విఫలమైనది. నిజమైన భావపరివర్తనను కల్పించవలసియున్న యెడల, పికెటింగును మఱల ప్రారంభము చేయవలెను. పికెటింగు చివఱివఱకు శాంతముగా జరుగవలయునెడల, దానికిసంబంధించిన ప్రజలకు హితముగఱపుటలో ఈమార్గము అన్నింటికంటె సత్వరసిద్ధి నొసగగలదు. అందు బలత్కారముండదగదు. పరివర్తనము వలనను, నైతిక ప్రేరణవలనను సాధింపవలయును.

మత్తుసారా, మత్తుద్రవ్యముల నిషేధము, విదేశవస్త్ర బహిష్కరణము తుదకు శాసనద్వారమున జరుగవలసిన పనులే. కాని, సుస్పష్టమగు విధమున క్రిందినుండి (సామాన్య ప్రజలనుండి) ఆరోపించిన ఒత్తిడి చూపట్టిననేగాని ఆశాసనము వచ్చునటుల లేదు.

అవి రెండును జాతికి ముఖ్యావసరమే యను విషయమును ఎవరును కాదనుటలేదు. త్రాగుడును, మత్తుపదార్థసేవనమును

వానికలవాటుపడిన వారియొక్క నైతికక్షేమమును భ్రష్టము చేయుచున్నవి. విదేశవస్త్రము జాతియొక్క ఆర్థికమూలాధారములను పెకలించివేసి, లక్షలాదిజనమును నిరుద్యోగుల జేయుచున్నది. ఆ ఆపద గృహములం దనుభవింపబడుచున్న దగుటచేత, స్త్రీలు బాధపడుదురు. త్రాగుబోతు లగువారు మగలుగాగల స్త్రీలు, ఒకప్పుడు సరళముగను, శాంతిప్రదముగను నడిచినతమగృహములలో త్రాగుడుపిశాచి ప్రవేశించి యెట్టి ఘోరములగావించినదో బాగుగ నెఱుంగుదురు. మనకూడెము లందలి లక్షలాది స్త్రీలు నిరుద్యోగ మన నేమియో బాగుగ నెఱుంగుదురు. చర్ఖాసంఘ మీనాడు లక్షకుపైగా స్త్రీల కుపయోగ పడుచుండ పురుషులలో పదివేలమందికి తక్కువగానే అది యుపయోగపడుచున్నది.

ఈ యుద్యమద్వయమును స్త్రీలు చేబట్టి, వానిలో ప్రావీణ్యము సంపాదింతురేని, జాతీయస్వాతంత్ర్యమునకు పురుషుల కంటె హెచ్చుసేవ చేసినవారగుదురు. వారి కీనాటి వఱకు చేజిక్కియుండని అధికారము, ఆత్మవిశ్వాసము వారికై నసము కాగలవు. విదేశవస్త్ర వ్యాపారులకును, ఆ వస్త్రముల కొనువారికిని, సారా లమ్మువారికిని, త్రాగుడున కలవాటుపడినవారికిని విజ్ఞాపనలు స్త్రీలు చేయునెడల వారి హృదయములు కఱుగక తప్పదు. ఏదెట్లున్నను, ఈనాలుగు రకములవారికిని స్త్రీలు హింస గావించిరనిగాని, హింస తలపెట్టిరనిగాని ఎవరును సంశయింపబోరు. అంత శాంతియుతముగను, అంతటి ఆతురతతోడను జరుగు ఆందోళనను గుఱించియే దొరతనమును చిరకాలము ఉపేక్ష వహింప జాలరు.

ఆయాందోళన స్త్రీలచేత ప్రారంభింపబడి, ప్రత్యేకముగా వారిచేత నడుపబడుటలోనే చమత్కార మున్నది. వారు తమ కవసర మగునంత సాహాయ్యమును పురుషులనుండి కోర వచ్చును; పొందనువచ్చును. కాని, పురుషులు స్త్రీల అధ్యక్షత క్రింద పనిచేయవలయును.

ఈ ఆందోళనమునందు వేలకొలది స్త్రీలు, చదువుకొనిన వారుగాని, చదువు రానివారుగాని పాల్గొనగల్గుదురు.

ఉన్నతవిద్యల గఱచిన స్త్రీలైనను, ప్రజాసామాన్యముతో క్రియాపూర్వకముగ ఐక్యభావము గల్పించుకొనుటకును, నైతికముగను, ఆర్థికముగను వారికి సాహాయ్యముచేయుటకును నేను చేయు విజ్ఞాపన ననుసరించి అవకాశము గలవారై యుందురు.

విదేశవస్త్ర బహిష్కార సమస్యను వారు పరిశీలించి చూచినయెడల, ఖద్దరుద్యమము లేనిదే అది సాధ్యము కాదని గ్రహింప గల్గుదురు. భారతదేశమునకు కావలసినంత గుడ్డను సన్నిహిత భవిష్యత్కాలమున మిల్లులు తయారు చేయజాలవని మిల్లుల యజమానులే యొప్పుకొందురు. అనుకూల పరిస్థితులను సమకూర్చితిమా, మన గ్రామములందు మన స్వగృహములలో ఖద్దరు తయారు కాగలదు. తమ కవకాశము చిక్కిన ప్రతి నిముసమును నూలు వడకుటకై వినియోగించుట వలన అందుకు తగిన వాతావరణమును సృష్టించు ప్రత్యేక గౌరవము స్త్రీలకు దక్కును గాక! ఖద్దరుత్పత్తి సమస్య అనగా, చాలినంత నూలును వడకుట అన్నమాటే! మార్చి నెలలో గత పది దినములందును ఘటిల్లిన పరిస్థితుల వలన తక్లీ

యొక్క ప్రభావమును నేను కనిపెట్టి యున్నాను. దాని నింత వర కెన్నడును నంతగా నేను గ్రహించి యుండలేదు.

అది అద్భుత కార్యముల చేయగలదు. ఇతరములగు పనుల కేటికిని అడ్డము లేకుండ ఆటలాడినటుల నా సహచరులు దిన మునకు నాలుగు చదరపు గజముల ఖద్దరు నేయుటకు సరిపోవు నంత నూలును తక్లీమీద వడుక జాలిరి. యుద్ధావసర చర్యగా చూచినను ఖద్దరును మించగల దేదియును లేదు. ఈ రెండు సంస్కరణల యొక్క నైతిక ఫలములు ఘనమైన వనుట నిస్సంశయము. రాజకీయముగ చూచినను వాని ఫలితార్థము తక్కువది కాదు. మత్తు సారాయములను, మత్తు ద్రవ్యము లను నిషేధించు టనగా, ఇరువదియైదుకోట్ల రెవిన్యూ నష్ట మన్న మాట! విదేశవస్త్ర బహిష్కార మనగా భారతదేశపు కోట్లాది ప్రజలకు కనీసము అరువదికోట్ల ధనము ఆదాయ మన్నమాట! డబ్బువిలువను బట్టి చూచునెడల ఈ సంస్కరణ ముల వలని ఫలము ఉప్పుపన్ను రద్దు చేయుట కంటె హెచ్చే యగును. ఈ రెండు సంస్కరణముల యొక్క నైతిక లాభ మునకు విలువ తెల్పుట సాధ్యపడదు.

"సరేగాని సారాదుకాణముల యొద్ద, విదేశీగుడ్డ అంగళ్ళ యొద్ద, పికెటింగు చేయుటవలన ఆవేశము కలుగదే!" అని కొందఱు సోదరీమణులు పలుకబోదు రేమో. అయినను, వారే పూర్ణ హృదయములతో ఈఆందోళనలో దిగిన యెడల కావలసినంత ఆవేశము సాహసము అందున్నదని కనుగొన గల్గుదురు. ఈ అందోళన కొనసాగించు లోపలనే చెరసాల ప్రవేశము గాంతురేమో! తాము అవమానముల పా

లగుటయు, శారీరికముగా హింసలపా లగుటయు కూడ అసంభవము కాదు. అట్టి అవమానమును హింసను పడయుట వారికి విశిష్టగౌరవమే యగును.

భారత నారీమణులు నా విన్నపము నాలకించి, అనుసరింతు రేని వారు సత్వరము పని పూనవలసియుందురు. భారతదేశ మంతటి కార్యక్రమము తక్షణమే ప్రారంభించుట పొసగనిచో, ఏయేప్రాంతములు ఈ యుద్యమ నిర్వహణమును పూనగల్గునో అచ్చటివారలే అటుల చేయుదురుగాక. వారి యాదర్శమును ఇతర ప్రాంతములవారు వెనువెంటనే అనుసరింతురు.

## త్రాగుడు శాపవిమోచనము

ఒకసోదరి యిట్లు వ్రాయుచున్నది :—

"గ్రామములోనికి పోతిని. అచ్చటి జనములమధ్య త్రాగుడు గావించు చున్న ఘోరముల గూర్చి వినగా నాదుఃఖము వెల్లివిరిసినది. కొందఱు స్త్రీలు కంట్లనీరు పెట్టుకొనిరి! పాపము వారేమి చేయగలరు? తమ మధ్యనుండి శాశ్వతముగా కల్లున కుద్వాసనచెప్ప వాంఛ లేని ఇల్లాలు లేదు. గృహకల్లోల మునకు, దారిద్ర్యమునకు, అనారోగ్యమునకు, ఎండ బారిన శరీరములకు చాలవఱకు కదియే మూలకారణముగ నున్నది. పురుషులకొకటే యీదుర్వ్య సన భారమును మోయ వలసినది సాధారణముగా స్త్రీయె యున్నది. ఈ స్త్రీలకు నేనేమిసలహా నీయగలను? కోపమును, క్రౌర్యమును సయితము ఎదుర్కొనుట చాల కష్టమగు కార్యము. సాంఘిక పరిపాలనమువలని యన్యాయముంగుఱించి తమ కాలమును, శక్తిని యేవో బలమును వ్యయ పరచుటకన్న ఈకీడును తొలగించు కొఱకై రాష్ట్రమునందలి పెద్దలందరను నడుములుగట్టి నిలిచిన నెంత బాగుండును? మన ప్రజల నైతిక జీవితము

నుద్ధరింపవలసిన ధర్మము నటుంచి తమంతట తామే కుదుటబడగల స్వల్ప విషయముల కొఱకై పూనిక జూపుటవలన నిజముగా ప్రధానము లగు విషయములను మన ముపేక్షించువార మగుచున్నారము. త్రాగుడుసమస్యను గుఱించి మీరు ప్రజాళి కొక విజ్ఞాపనను వ్రాయరాదా? ఈ అనర్థము వలన ఈ ప్రజలు సాక్షాత్తు నరక కూపమున కూలుచుంట జూడ దుఃఖము కలుగు చున్నది.”

త్రాగువారింగూర్చి నేను విజ్ఞాపనలు చేయుట వ్యర్థము. అదట్లు వ్యర్థముకాక తప్పదు. హరిజన పత్రికను వారు చదువ బోరు. ఒకవేళ నెవరేని చదివిరా, అపహాస్యము చేయుకొఱకే వారు అటులచేయుదురు. త్రాగు డను దురభ్యాసమును గుఱించి విచారించుటకు వారి కుత్సాహ ముండదు. ఆకీడును వారు ప్రీతితో అక్కున జేర్చుకొనువారేగదా! దండియాత్ర సమయ మున భారతనారీమణులు నాసలహాను విని, త్రాగుడున కెదురు నిలిచి పోరాడుటయు, రాటమును చేబట్టి త్రిప్పుటయు ప్రత్యేక విధాయకకార్యముగా చేసికొనిరని ఈ సోదరికి జ్ఞప్తిచేయకోరు చున్నాను. వేలకొలంది వెలదులు నిర్భయముగా కల్లుదుకాణ ముల చుట్టు నిలిచి త్రాగుడు కలవాటుపడియున్న వారి నెంద రినో బ్రతిమాలి జయప్రదముగ వారిని వారింప గల్గిరని యామె జ్ఞప్తికి తెచ్చుకొనుగాక. తా మైచ్ఛికముగా పూనుకొనిన ఈ యుద్యమముయొక్క నిర్వహణమునందు త్రాగుబోతుల తిట్లను, కొన్ని సమయములందు వారిచే దెబ్బలను సయితము వారు భరించియుండిరి. కల్లు దుకాణముల యొద్ద పికెటింగుచేసిన నేర మునకై వందలకొలది స్త్రీలు జైళ్ళకుకూడపోయియుండిరి. ఉత్సాహ భరితమగు వారి కార్యకలాపము దేశమంతటను అద్భుత సంచల నము కలిగించినది. అయినను, దురదృష్టవశమున, సాత్విక

శాసనోల్లంఘనము యొక్క విరమణముతో, మఱియు అంతకు ముందు సయితము, ఆపూనిక మందగించినది. అట్టి మందగతికి గల కారణములను నే నిప్పుడు తడవబోవుటలేదు. కాని, ఆపని యిప్పుడును, కార్యపరులకై ఎదురు చూచుచున్నది. అప్పటి నారీమణులు చేకొనిన ప్రమాణము అసంపూర్తిగ నిలిచియే యున్నది. ఆ ప్రమాణము ఒకానొక ప్రత్యేక సమయము కొఱకై తీసికొనబడినది కాదు. భారతదేశ మందెల్లెడలను నిషేధ శాసనము ప్రకటింపబడువఱకును వారి ప్రతిజ్ఞ పూర్తియైనట్లు కాదు. ఇందు స్త్రీల కర్తవ్యభాగము ఘనతరమైనది. మానవు నందలి శ్రేష్ఠతమ ప్రకృతింగూర్చి విన్నపములు చేయుట మూలమున, కల్లుదుకాణములను ఖాళీ చేయుటవలన, నిషేధ శాసనమును ప్రచారములోనికి తెచ్చు కర్తవ్యము స్త్రీలదై యున్నది. వారు తాము పూనిన కార్యమును కొనసాగించి యుండినయెడల, వారియుత్సాహముతో పాటు వారి శాంత ప్రకృతియు త్రాగుబోతును వాని యల వాటునుండి తప్పక మరల్చియుండును.

అయినను, పోయినదిలేదు. స్త్రీ లాఉద్యమము నిప్పుడును సాగింపవచ్చును. ఏ యభాగ్యలగుఱించి యీ విలేఖరి వ్రాయు చుండెనో, ఆపతులు ఆ యుద్యమసాహాయ్యమున తమభర్తలను తప్పక మార్చివేయగల్గుదురు. తమ భర్తల పైని ఎట్టి సుస్థిర భావమును తాము ప్రయోగింపగలరో స్త్రీ లెఱుగుట లేదు. తదుకు తెలియకుండను హారద్దానిని వినియోగించుచునే యుం దురు. కాని అది చాలదు. వారికా యెఱుక యుండవలయును; ఆ యెఱుక వారికి బలము నొసగును; తమ సహాధర్మలతో

వారెటుల మెలగవలయునో వారికి తెలుపును. ఇంతకును, ఉన్న అనర్థమేమనగా, చాలమంది సతులు తమభర్తలచేష్టలం గుఱించిన ప్రసక్తిని తీసికొనరు. అటుల చేయుటకు తమకు అర్హతలేదనియే భావింతురు. భర్తలకు తమభార్యల ప్రవర్తనముంగాపాడు బాధ్యత వహింపవలయు విధియున్న తెఱగున భార్యలకు తమ భర్తల వర్తనమును సంరక్షింపవలయు బాధ్యతయు గలదని వారికితోచుటలేదు. కాని ఒండొరులపాపపుణ్యముల గుఱించి సతిపతులు సమానముగ బాధ్యులగుదురనుట కంటె విస్పష్టమగు విశేష మేమున్నది? ఐనను సతులకు వారి అధికారమును, వారి విధాయకధర్మమును తెలుపుటకగు గాఢ ప్రబోధమును స్త్రీలు తప్ప మఱెవ్వరు చేసూర్పగలుదురు? త్రాగుడుమాన్పు నుద్యమము నందు స్త్రీలు నిర్వహింపవలయు ధర్మమున నిదొక యంశము.

త్రాగుడును గుఱించిన లెక్కలను, ఆయలవాటును పెంపు చేయు కారణములను, వానిని నివారించు నుపాయములను బాగుగ తెలిసికొనిన స్త్రీలు చాలినంతమంది కావలసియున్నారు. వారుగతమునుండి గుణపాఠముల నేర్వవలయును. త్రాగుడున కలవాటుపడినవారిం గుఱించి కేవలము విన్నపములను నేకరువు పెట్టుటవలన చిరతరలాభము చేసూర దని వారు గ్రహింపవలయును. ఆ అలవాటు నొక రోగముగా పాటించి అందుకు దగిన చికిత్సను పూనవలయును. అనగా నేమి? కొందఱు స్త్రీలు పరిశోధన కార్యములకు పూనుకొని • వివిధరీతుల నా పరిశోధనలను సాగింపవలయును. ప్రతి సంస్కరణశాఖ యందును ఆ యంశమును కూలంకషముగా తెలిసికొన చూచునట్టి నిరంతర

పరిశోధన జరుపుట అవసరము. శ్రేష్ఠమైన సంస్కరణలుగా నంగీకరింపబడిన యుద్యమములందెల్ల పూర్ణముగ గాని, కొంత వరకు గాని, అపజయమే పాటిల్లుటకు మూలము అజ్ఞానమే సుడీ! సంస్కరణమను పేరుతో బయలుదేరిన ప్రతియుద్యమమును తప్పక ఆపేరునకు అర్హమైన యుద్యమమే యనుటకు వీలు లేకున్నది.

## సిగ్గుమాలిన ప్రకటనలు

ఒక సోదరి మిగుల నసహ్యాకరములగు పుస్తకములంగూర్చిన ప్రకటన గల సుప్రసిద్ధ పత్రికనుండి కత్తిరించిన యొక ముక్కను నాకు బంపుచు నుత్తరము వ్రాసినది.

ఆ ప్రకటననుండి యొక్క ముక్కనైనను మరల ప్రకటించుట నాకిష్టము లేదు. ఆ ప్రకటనకు సంబంధించిన పుస్తకములోని విషయములు అతి లజ్జాకరముగ నున్నవని చెప్పనెంచెదను. ఆ పుస్తకముయొక్క పేరే "స్త్రీ రూపప్రణయ సౌందర్యము". దీనిని కొనువారి కుచితముగా 'వధువుంగూర్చిన నవ్యేతర విజ్ఞానము' 'ప్రణయా లింగనము లేక అర్ధాంగికి సంప్రీతి గొలుపురీతి' అను మఱిరెండు పుస్తకాలను గూడ నిత్తుమని ఆ పుస్తక మమ్మెడు కంపెనీవారు ప్రకటించుచున్నారు. ఈ లాటిపుస్తకములం గూర్చిన ప్రకటనల వైఖరిని గాని, తమ పుస్తకములవలన లాభముల గడింప నుద్యమించు గ్రంథకర్తల యొక్కయు, ప్రకటన కర్తల యొక్కయు ప్రయత్నములగాని ఏవిధముననైనను మరలింపగల్గుదునని నాకుత్తరము వ్రాసిన సోదరి ఆశపడుట విరిగిన రెల్లు నూతగొనుట వంటిది.

పనికి మాలిన పుస్తకాలను, వానిం గూర్చిన ప్రకటనలను వెలువరించు వారికి నేనెంతగా విన్నపము చేసినను వ్యర్థమే యగును. ఈ లేఖను వ్రాసిన సోదరికిని, ఆమెతో పాటు విద్యావతులగు నితర సోదరీమతల్లులకును, బహిరంగమునకు వచ్చి, ప్రత్యేకించి తాము మాత్రమే నిర్వహింప సమర్థమగు కార్యమును పూనుకొనుడని విన్నవింప గోరెదను.

ఒక వ్యక్తిని చెడ్డపేరు పెట్టి పిలువగా ఆ స్త్రీగాని పురుషుడుగాని ఆచెడుగు తనయందున్నట్లే విశ్వసించుట చాలా తఱచుగా చూచు చుందుము. స్త్రీని 'అబల' యని పిలుచుట మహాపరాధము. స్త్రీ యేవిషయమున 'అబలయో' నాకు తెలియుట లేదు. పురుషునందలి పశులక్షణ మామె యందు లేదనినను లేక పురుషునందున్నంతగా నామెయందు లే దనినను అబలయను సూచన యొప్పుకోదగినదే. కాని స్వభావతః స్త్రీ మానవతి. ఆమె దెబ్బకొట్టుటలో బలహీనయైనను, సహనమునందు సమర్థురాలేగదా! స్త్రీని 'అహింసా త్యాగధర్మముల మూర్తి' యని నే నభివర్ణింపుచుందును. ఆమె తన గౌరవమును గాని, శీలమునుగాని సంరక్షించుకొనుటలో పురుషునిపై నాధారపడకుండుటను నేర్చుకొనవలయును. పురుషుడెన్నడేని స్త్రీయొక్క శీలమును సంరక్షింప జాలిన యుదంతయు నొక్కటేని నేనెఱుంగను. పురుషుని కట్టి యభిలాషయున్నను చేయజాలడు. రాముడు సీతయొక్క శీలమును కాపాడ జాలడయ్యె. పంచపాండవులు ద్రౌపది శీలమును రక్షింపజాలరైరి. ఈనారీరత్నము లిరువురును కేవలము తమ పవిత్రత వలననే శీలరక్షణము గావించుకొన సమర్థురాండ్రైరి. మర్యాదనుగాని, ఆత్మ

గౌరవమునుగాని తన యంగీకారము లేకుండ నరుడు కోల్పోవుట లేదు. ఏ నీచస్త్రీయో మత్తుమందుపెట్టి తన యిష్టమువచ్చి నటుల నాడించు కారణముచేత పురుషు డెటుల తన గౌరవ మును శీలమును కోల్పోవుట లేదో, అటులనే యే నరపశువో స్త్రీని స్పృహారహితం జేసి చెరపెట్టినేని ఆ స్త్రీ గౌరవమునకు గాని, శీలమునకుగాని హాని చేకూరుటయు నుండదు.

పురుషసౌందర్యము నభివర్ణించుచు వ్రాయబడిన పుస్తక ములు లేకుండుట యాశ్చర్యకరము! ఐనను పురుషుని పశు ప్రవృత్తులనే సదా ప్రేరేపించు వాఙ్మయము ప్రబలుటకు హేతువేమి? పురుషుడు తనపై నారోపించెడు బిరుదావళి కనుగుణముగ స్త్రీ వర్తింప నిచ్ఛగించుట కారణమై యుండును. స్త్రీ తన సౌందర్యమును పురుషుడు దుర్వినియోగ పరచు కొనుట కనుమతించునా? పురుషుని యెదుట స్త్రీ తన సుందర రూపమును ప్రదర్శింప నిచ్ఛగించునా? ఎందులకు? అనుచు బాగ చదువుకొనిన సోదరీమణులు తమకు తామె యీ ప్రశ్న లను వేసికొన గోరెదను. అట్టి ప్రకటనలు, వాఙ్మయము తమ కవమాన కరముగ నున్నచో, వానిని రూపుమాపుటకు భీకర యుద్ధమునకు స్త్రీలే పూనవలయును. ఒక్క క్షణములో సర్వము నాగిపోగలదు. తనలో దోషాచరణ కెట్టి మహాశక్తి గలదో ధర్మాచరణకును నట్టి మహాశక్తియే నిగూఢమై యున్న దని స్త్రీ అనుభూతి చేయవలయును. తాను 'అబల'ననియు పురుషు డిచ్ఛవచ్చినటు లాడించు కొనదగిన "బొమ్మ" గా నుపకరింపవలసిన దాన ననియు భ్రమించుట మానెనేని, లోక ములో తండ్రిగా గాని, కొమరుడుగా గాని లేక భర్తగా గాని

వర్తింప వలసియుండు తన పతికిని, మఱియు తనకును గూడ నెంతయో ఆనంద నిలయమై పఱగు నటుల నీ ప్రపంచమును మార్చివేయగల ప్రభావము స్త్రీయందు గలదు. జాతులపైని జాతులు సాంద్రోన్మాదముతో సాగించు సంగ్రామములును సంఘముయొక్క నైతికాధారముల పైని సాంద్రతరోన్మాదముతో సాగింపబడు సంగ్రామములును సంఘ క్షేమమునకు వినాశము గూర్పకుండ రక్షణయే పొసగవలయు నేని, కొందఱు వర్ణించునటుల స్త్రీ) పురుషభావము పూనుట వలనగాని స్త్రీ భావము తోడనే ఆమె నిర్వహించవలసిన కార్యము చాలగా నున్నది. ప్రాణమును చాలవఱకు వ్యర్థముగనే నాశము చేయు సమర్థతను సంపాదించుటకై పూనుకొని పురుషునితో పోటీ పడుటవలన స్త్రీ మానవలోక కల్యాణమును చేకూర్ప జాలదు. తనయొక్క వినాశమును, దానితోపాటు స్త్రీ యొక్క వినాశమును తెచ్చి పెట్టుచు పాపకూపమున దిగబడి పోవు చున్న పురుషుని పాపవిముక్తునిచేయు ధన్యత స్త్రీ)కి సంక్రమించు గాక! పైని ప్రస్తావనకు దెచ్చిన నీచపు ప్రకటన గాలి యెటు వీచుచున్నదో తెలుపుగడ్డిపోచను బోలునదై యున్నది. స్త్రీ) క్షేమమును తనకై బలిదీసికొనగోరు పురుషుని సిగ్గుమాలిన కార్యమది. కటా! ప్రపంచములోని మోటుజాతి స్త్రీ జనము యొక్క సౌందర్యము జోలికి సయితము వాని నీచదృష్టి పోకుండ విడువ నొల్లకున్నదే!

## శృంగార వర్ణనలు

అహమ్మదాబాదునందు జరిగిన గుజరాతీ సాహిత్యసమ్మేళనసందర్భమున 'జ్యోతీసంఘ' మను పేర స్త్రీజనోద్యమమును నడపు కొందఱు నారీమణులు శ్రీగాంధీజీ కొకలేఖను బంపిరి. ఈనాటి సాహిత్యమున స్త్రీల నభి వర్ణించుటలో సాగుచున్న దుర్నీతిని ఖండింపుచు వారు చేసిన తీర్మానముయొక్క నకలు నొక దానినికూడ పంపిరి. శ్రీగాంధీజీ చాలనొచ్చుకొని మాటలాడిరి :—

ఈకాలపు గ్రంథకారులు స్త్రీస్వరూపమును గుఱించిన వర్ణనలందుపూర్తిగ అసభ్యములగు పోకడలు జూపుచుండిరని వారి యాక్షేపణ. తమ శరీరములగూర్చిన నీచపు వర్ణనల జూచియు, తమ యెడల జూపబడు నసహ్యకర శృంగారభావములగాంచియు వారు ఉగ్రులైపోవుచున్నారు. స్త్రీల సౌందర్యమును, స్త్రీలశక్తియు, వారి స్థూలరూపము నందును, పురుషుల ప్రణయవీక్షణముల నలరించుటయందును మాత్రమేనా ప్రకటన మగునది ? లజ్జావతియనియు, గృహమందలి దాస్యనృత్తుల నిర్వాహణమునకై ప్రత్యేకముగ నేర్పడిన వనిత యనియు, పతిని దేవునట్లు పూజింపవలసిన వ్యక్తి యనియు మాత్రమే నిరంతరము స్త్రీని అభివర్ణించు టేల ? అని నా కుత్తరము వ్రాసిన నారీరత్నములు ప్రశ్నించుట న్యాయమేగదా ! వారు యథార్థముగ నెట్లుండిరో యేల వర్ణింపరాదు ? వారిట్లనుచున్నారు :— "మేము అప్సరలముకాము; బూతకిబొమ్మలమును గాము. వ్యసనముల కుప్పలముగాము; నాడులరాసులమును గాము; పురుషులెట్లో మేమునట్లే నరమూర్తులము. వారికిగలస్వాతంత్ర్యమియే మాకును గలదు".

నేను వారి నెరుంగుదును; వారి హృదయములను చక్కఁగ నెరుంగుదునని వచింపగలను. దక్షిణాఫ్రికాలో నే ననేకులు స్త్రీలనడుమనున్న కాలముగలదు. వారి మగవారెల్లరు జెళ్ళకు పోయియుండిరి. మాయింటిలో నరువదిమంది యుండేవారము. అందుండు స్త్రీలకును, బాలికలకును నేను సోదరుడను, జనకు డనుగ మెలగితిని. నా సంరక్షణక్రిందవారందరును బలమును సాహసమును పెంపొందించుకొనిరని చెప్పుచున్నాను. తత్ఫల ముగా తుదకువారును ధైర్యమూని జైళ్ళకు సయితముపోగల్గిరి.

స్త్రీలను దేవతాస్వరూపలనుగ నతిశయోక్తులతో వర్ణించు టయు మనకావ్యములందు గలదని వింటిమి. అట్టి దైవత్వారోప ణయు తగదని నా దృఢాభిప్రాయము. మీకొక సామాన్యకీల కమును దెలిపెదను. వారినిగూర్చి మీరు వ్రాయబోవునపుడు మీరు వారి నేదృష్టితో జూచెదరు? మీరు మీకలమును కాగితముమీద పెట్టుటకు పూర్వము స్త్రీని మీజననినిగ భావన చేయుడని హెచ్చరించుచున్నాను. అప్పుడు, పైని ఆకాశము నుండి అవతరించి క్రింద దప్పిగొనియున్న పుడమికి శాంతి గొలుపు శుద్ధ వర్షోదకములీల పరమపవిత్రమగు వాఙ్మయధార మీకలమునుండి ప్రభవము గాగలదనిన నా మాట నమ్ముడు. ఒకస్త్రీ నీసతియగుటకు పూర్వము, ఒకస్త్రీ నీకు జననియైవుండె నను టమఱువకుడు. అధ్యాత్మ పిపాసను దీర్చుకొనుటకు మారుగా, కొందరు కావ్యకర్తలు తమ మోహప్రవృత్తుల నుద్రేకింప జేసికొనుచున్నారు. తత్ఫలితముగా కటా! మూఢవని తలు తమంగూర్చిన వారి కల్లబొల్లివర్ణనలకు తామెటుల సరి పోలజాలుదుమాయని శ్రమపడుచు నెంతయో కాలమును

వమ్మ్మజేసికొనుచుందురు. సవిస్తరములగు వారి స్థూలరూపాభి వర్ణనలు వాఙ్మయమునందు ప్రధానాంశములగునాయని నే నాశ్చర్యపడుచుందును. అలాటి వానిని మీరు ఖురానునందు గాని, బైబులునందుగాని, ఉపనిషత్తులందుగాని కనుగొనగలరా! అయినను బైబులులేనిచో ఆంగ్లభాషయంతయు శూన్యమై చూపట్టుననుట మీరెఱుగుదురా? ఆంగ్లవాఙ్మయమునకు బైబులు మూడుపాదములు, షేక్స్పియరు ఒక్కపాదమునని వర్ణింతురు. ఖురానులేనిచో అరబ్బీభాష విస్మృతింబడిపో గలదు. తులసీదాసు రచనలను తొలగించిన హిందీభాషను తలపున నిలుపుట కేముండును? అట్టివానియందు, స్త్రీలను గుఱించి నేటివాఙ్మయమునందు మీకుగోచరించు దానివంటి దిసుమంతయేని చూపట్టునా?

## ఒక త్యాగము

1891 వ సంవత్సరమున నేను ఆంగ్లదేశమునుండి తిరిగివచ్చిన పిమ్మట, మా కుటుంబములోని బాలబాలికలశిక్షణ భారమును చాదాపుగా నేను వహించితిని. అప్పుడు ఆ బాలబాలికల భుజములపైని చేతులనిడుకొని విహరించు నలవాటు సాగించితిని. వీరు నా సోదరుని బిడ్డలు. ఆ బిడ్డలు పెద్ద వారైనపిమ్మట సయితము ఆ యలవాటు నిలిచిపోలేదు. కుటుంబము పెరుగుటతో నీయలవాటు పరులదృష్టి నాకర్షించు నంతగా విస్తరిల్లినది.

కొన్నిసంవత్సరముల క్రిందటివరకు, ఆ అలవాటులో దోష మున్నట్లు నాకు స్ఫురించలేదు. నాకు జ్ఞప్తియున్నంతవరకు సబర్మతీ యాశ్రమమునమాత్ర మొక యాశ్రమవాసి ఆ యల

వాటు ఆక్షేపణీయమని తెలిపినది. వయస్సువచ్చిన బాలికలతో డను, యువతులతోడను ఆయలవాటును సాగించినయెడల మర్యాదకు భంగకరముగ నెంచబడునని చెప్పినది. కాని, ఆశ్రమవాసులతో చర్చ జరిపిన యనంతరమును నాయలవాటు సాగుచునే యుండెను. ఇటీవల నా సహచరులలో నిద్దరు వార్ధాకు వచ్చిరి. వారును నాయలవా టితరులకు దుష్ట సాదృశ్యము గానోపుననియు, కావున నేను నిలిపివేయుట మంచిదనియు వచించిరి. వారి వాదనయు నాకు నచ్చలేదు. ఐనను, నా మిత్రుల హెచ్చరికను నిర్లక్ష్యముచేయ నెంచలేను. కాబట్టి ఆ విషయమును ఐదుగురు ఆశ్రమవాసుల పరిశీలనకు పెట్టితిని. అది జరుగుచుండగనే దానిని తీర్మానమునకు దెచ్చిన సంఘటన సంభవించినది. బుద్ధిశాలియగు నొక కళాశాలా విద్యార్థి తనకుపరిచయమున్న ఒకబాలికతో నేకాంతమున వివిధ రీతుల సరసము లాడుచుండునని నాకు తెలియవచ్చినది. తా నామెను చెల్లెలివలె ప్రేమించుచుంటిననియు, ఆప్రేమనుస్థూల చర్యలందు ప్రదర్శింపకుండజాల ననియు అతడు వాదించును. అందు దోష మున్నదనుసూచన చేసినచో నాగ్రహపడును. నే నావిద్యార్థి చేష్టలవివరించుచో పాఠకులు నిస్సందేహముగా నతని సరసాలాట దోషమే యందురు. నేనా యుత్తరమును చదివినప్పుడు, నేనును దానిం జూచిన యితరులును, ఆ యువకుడు ఆరితేరిన మోసగాడుగానీ, లేక శుద్ధభ్రాంతుడుగా గాని యుండవలయునను తీర్మానమునకు వచ్చితిమి. ఏమైనను ఈ విజ్ఞానము నన్నాలోచనా నిమగ్నునిచేసినది. నాయిరువురి సహచరుల హెచ్చరికను సంస్మరించితిని. ఆ యువకుడు నా

యలవాటును తన ప్రతివాదనకు ప్రమాణముగా తీసుకొను నెడల నే నేమనుకొనవలసియుండునాయని వితర్కించుకొంటిని. ఆ యువకుని సరసములకు గురియైన బాలిక వానిని నిర్దోషిగను, భ్రాతృభావభరితునిగను నెంచినను, వాని చేష్టలను సహించుట లేదనియు తన యభ్యంతరమును సయితము వెలువరించుననియు కాని, వాని చర్యను నిగ్రహించుటకు దగిన ధీరత జూపజాలకున్నదనియు నేను తెలుపవలసియున్నది. ఈసంఘటనవలన గలిగిన ఆత్మావలోకనము, ఆ యుత్తరమును జదివిన రెండుమూడు దినములలోనే, నాయలవాటును త్యాగము చేయుటగా పర్యవసించినది. ఆ నెల 12 వ తేదీని ఆ నిర్ణయమును వార్ధా ఆశ్రమవాసులకు ప్రకటించితిని. ఆ నిర్ణయమునకు వచ్చుటలో నా కావేదన కలుగకపోలేదు. నా అలవాటు సాగుచున్న కాలమునగాని, ఆ అలవాటు కారణముగా గాని ఒక్క దుష్టసంకల్పమైనను నాలో నెన్నడును తలజూపి యుండలేదు. నా చర్య సదా బహిరంగమైనది. నా చర్య తల్లిదండ్రుల వర్తనమును బోలునది. నా శిక్షణమునను నా యధీనముననుండిన బాలికలు వారి అంతర్యరహస్యములగూడ నాకు దెలుపగలంత ధారాళమైనది. మఱియు నితరు లెవ్వరు నంతగా, బహుశః, వారి విశ్వాసమును చూఱగొనజాలియుండరు. స్త్రీజాతిని పురుషజాతియు, పురుషజాతిని స్త్రీజాతియు స్పృశింపకుండ గోడకట్టవలసినంతటి అవసరమును దోపజేయునట్టియు, ఇసుమంత పరిశోధన ఘటిల్లినను భంగపడునట్టియు బ్రహ్మచర్యమునందు నాకు విశ్వాసము లేదు.

నేను గైకొనిన చనువు వలన నేలాటి బెడదయేని గల్గునని నే ననుకొనను.

నా యలవాటెంతటి నిర్దోషమైనదైనను పైన నేను పొందినిన సంఘటనయొక్క అనుభవము దానిని త్యాగము చేయుటకు నన్ను పురికొల్పినది. నిరంతర జాగరూకత కావలయు ప్రయోగములను సాగించుటకు పూనుకొనిన ఏడను గాన వేలకొలది స్త్రీలును, పురుషులును నాప్రతిచర్యను కనుపెట్టి శోధించుచుందురు. సమర్థించుటకు ప్రబలతర్కమవసరమగునట్టి విషయములను నేను విడచివేయవలసి యుండును. నా సాదృశ్యమును విచక్షణ లేకుండ ఎవరుపట్టిన వారు అనుసరించుటకు ఉద్దేశింపబడినది కాదు. ఐనను అల యువకుని యుదంతము నా కొక హెచ్చరిక యైనది. నాసాదృశ్యబలము చేతనో, లేక వేఱువిధముననో పొరబడినవారిని నాత్యాగము సంస్కరింపగల దనెడు ఆశతో ఆహెచ్చరికను స్వీకరించితిని. నిష్కళంక యౌవనము గొప్ప అమూల్య మగు సంపదయై యున్నది. ఆనంద మనెడు మిషతో చిటికపాటుచక్కిలిగింత కొఱకై వ్యర్థము చేయదగినది కాదు. మోసగాండ్రో, లేక తా నేమి చేయునదియు గ్రహింపజాలని వెడగులో అగునట్టి యువకులు బాలికలతో సరసాలాపాలకు దిగుదురు. ఆసరసాలలో దుష్టచర్య యేమియు లేదని చాటిననుకూడ అటువంటి చేష్టలను గ్రహించు నుపాయమును ఈ గాథలోని బాలిక వంటి అమాయికపు బాలికలు నేర్చుకొవలసియే యుందురు.

## ధూమపానము

మౌల్మీను నగరమునందు బర్మా స్త్రీల కొసగినబోధ :—

భూలోకమున నీనా డేయితర స్త్రీజనమును ననుభవింప జాలని స్వేచ్ఛను మీరనుభవించుచున్నారు. మీపరిశ్రమకును మీచతురతకును మీరు విఖ్యాతి గాంచియున్నారు. మీకు నిర్మాణకౌశలముగలదు. విదేశీయములగు సొగసుల గురించిన మీయభిరుచుల నొకింత పునర్విమర్శ గావించుకొందురేని, నేను మీ కొసగు 'నిరాడంబరత్వ' సందేశమును హృద్గతము గావించుకొందురేని మీరు మీజీవితముల నెంతయోమార్పు చేసికొనినవా రగుదురు.

*　　*　　*　　*　　*

మీ ధూమపాన ఘోరశాపముంగూర్చి ప్రస్తావింపగడగు నెడల నిజముగా నాధైర్యము వెనకాడుచున్నది. బర్మాదేశము నందెయ్యెడను ఈ యభ్యాసమునకు వశముగాని స్త్రీనిగాని, పురుషునిగాని నేను గనుగొనజాలనని వినుచున్నాను. భారత భూమినుండి వచ్చు నేము చుట్టలు, సిగారులు కాల్చుటచేత నోరులను వికారపఱచుకొను బర్మాదేశపు సుందరులను వెఱగు పడి చూచి యెంతయు నొచ్చుకొనుచుందుము. ఇక్కాలమున లోకము నంతను నలముకొనుచున్న యొక దురాచారమును గుఱించి ముచ్చటించుట బహు సాహసకార్యమని నే నెరుగు దును. మీరు టాల్‌స్టాయిగారి పేరు వినియున్నయెడల ఆయన ప్రామాణిక వాక్యముల మీకు దెలుప గోరెదను. టాల్‌స్టాయి

గారు మిక్కుటముగ ధూమపానము చేసెడివాడు. ఇతరము లగు నింద్రియములమాట యెటులున్నను పొగాకు మానవుని బుద్ధిని బండబారజేయునని, ఆయనస్వానుభవము వలన చెప్పిన మాట. బుద్ధిపూర్వకములగు ఘోరకార్యము లనేకము పొగ త్రాగిన మత్తుచేత గావింపబడుచున్నవని, యుదాహరణ లనేకము ఆయన చూపియున్నాడు. ఆయన రచించిన మనోహరములగు కథలలో నొకదాని యందు మహాపాపి యొకనివర్ణన కలదు. వాడు కల్లుత్రాగిన మీదటను చేయజాలని హత్యా కార్యమును పొగద్రాగిన యనంతరము సులభముగ చేయగల్గినాడు. పొగత్రావు నలవాటు పెరిగిపోవుచున్నను, లోకము లోని మనీష్యగ్రేసరులెందరో దానిని సమర్థించువారుగ నున్నను దానిని ఖండించు సాహసికులును గలరు. దానిని నిరోధించు వారిలో పాశ్చాత్యులందలి పురుషశ్రేష్ఠులును, మహానీతిమంతులును గణనకు వచ్చుచున్నారు.

## అద్భుత నిర్ణయములు

‘తర్ట్టను’ మహాశయుడు చీనామున్నగు ననేక దేశములలో సంచారము చేసినపిమ్మట ‘వివాహతత్వము’ అనెడు గ్రంథము వ్రాసెను. అందు క్రింది సిద్ధాంతముల తేల్చినాడు :—

1. ఒక స్త్రీ యావజ్జీవము, ఒక పురుషునికి కట్టుబడి యుండవలెననిగాని, తిండిని, నివాసమును సంపాదించుకొనుకొఱకు, గర్భిణిగా నున్నప్పుడును, లేనప్పుడును అనేక రాత్రులు వానికోడ నొకేయింటిలో నుండునట్లును, నొకేప్రకరిలో పరుండునట్లును స్త్రీని బలాత్కరించవలెననిగాని ప్రకృతి యొకటి యుద్దేశ్యమై యుండదు.

2. ప్రస్తుతపు వివాహపు చట్టముయొక్కయు, ఆచారముయొక్కయు ఫలితముగా స్త్రీపురుషులు, రేయింబవళ్లొకరిప్రక్కలో నొకరు పరుండుట మితిలేని సంభోగమునకు కారణ మగుచున్నది. అందువలన స్త్రీపురుషులిరువురి యందునుగల సహజబుద్ధులు చెడి నూటికి తొంబదిమంది స్త్రీలు ఒకవిధ ముగా వ్యభిచారిణులై పోవుచున్నారు. అటుల వ్యభిచారిణులగుట సద్ధర్మ మనియు, తమభర్తల ప్రేమను నిలుపుకొనుట కవసరమనియు, కావున నాపనులు చేయుట న్యాయమును సహజము ననియు వివాహితలయిన యువతుల నమ్మించుటకు ఈ ఆచారము కారణమగుచున్నది.

ఇంకను, నిరంతరము మితిలేని సంభోగము చేయుట వలని ఫలితార్థములు నిటుల వర్ణించి యున్నాడు.

1. స్త్రీలు భయభ్రాంతులై పోవుచున్నారు. వేగముగ ముసలివా రగు చున్నారు. రోగగ్రస్తులును, చంచలచిత్తులును, ముక్కోపులును, సంతృప్తి నొందంగనివారును, పిల్లలను సక్రమముగా సాకజాలనివారును నగుచున్నారు.

2. పేదవారిలో, తాము కోరని హెచ్చు సంతానము కలుగుచున్నది.

3. పైతరగతులవారిలో మితిమీరిన సంభోగము అలవాటై, సంతాన నిరోధోపాయములకును, గర్భస్రావములకును దారితీయుచున్నది. జననని[గ]హ మనిగాని, మరోపేరు పెట్టిగాని గర్భాధారణ నివారణోపాయములను స్త్రీ జనసామాన్యమున నధిక సంఖ్యాకులకు నేర్పు నెడల, జాతి క్రమేణా రోగ గ్రస్తమై నీతిచెడి, పతితమై తుదకు వినాశ మందగలదు.

4. అత్యధికసంభోగము పురుషులందు మంచి జీవనోపాధిని సంపాదించుట కవసర మగు వీర్యమును నష్టపరచును. అమెరికా సంయుక్త రాష్ట్రములలో నీనాడు భార్యలు చనిపోయిన భర్తలకంటె, భర్తలు చనిపోయిన వితంతు వులు దాదాపు 20,00000 మంది హెచ్చుగా నున్నారు. వీరిలో బహు కొలదిమంది మాత్రమే యుద్ధకారణమున వితంతువులైనవారు.

**5.** ఈనాటి వివాహపద్ధతికి ఫలితార్థముగా జరుగు అమితసంభోగము వలన స్త్రీపురుషుల యిరువురి మనస్సులందును నిరాశ నెలకొనుచున్నది. ప్రపంచమం దీనాడు చూపట్టు దారిద్ర్యమును, పెద్ద పెద్ద నగరములందలి వ్యభిచార గృహములును, పాటుపడువారికి లాభప్రదమగు నుద్యోగము దొరకని కారణముచేతగాక, ఈ నాటి వివాహశాసనముల ఫలితార్థముగ నేర్పడిన అత్యధికమును, నిరాఘాటమునగు సంభోగములవలన కలిగినవియే.

**6.** మానవజాతిమొక్క భవితవ్యదృష్టితో చూచునెడల, అన్నిటిని మించిన యనర్థము గర్భిణీకాలమున జరుగు సంభోగము మూలమున వాటిల్లుచున్నది.

'తర్‌స్టను' మహాశయుడు పై రీతిని తన సిద్ధాంతములను నిరూపించి, యనంతరము చీనా యిండియాల నింద సలిపి యున్నాడు. అంతటితో సగము పుస్తకమును నింపి తక్కిన భాగమున నివారణోపాయముల సూచించి యున్నాడు.

ఆయన తెలుపు నివారణోపాయములలో ప్రధాన మగునది భార్యయు భర్తయు వేర్వేరు గదులలో నిద్రింప వలయును; వేర్వేరు మంచములపై పరుండ వలయును. ఇరువురును సంతాన వాంఛ పూనినప్పుడు అందునను ముఖ్యముగా భార్య అట్టి వాంఛను పూనినప్పుడును మాత్రమే, వారు కలియ వలయును. వివాహ చట్టములలో ఆయన సూచించిన మార్పుల గూర్చి నేను ప్రస్తావింప దలచ లేదు. ప్రపంచమునం దెల్లెడల, అన్ని విధాల వివాహపు టాచారములందును సామాన్య విషయముగ నున్నవి ఏక శయ్యాగారమును, ఏక శయ్యయును. దీని నా గ్రంథకర్త తీవ్రముగా ఖండించు చున్నాడు. అటుల చేయుట సమంజసమే యని నా భావము. స్త్రీ లైనను, పురుషు

లైనను వారి నైజములోని కామ వికారము వివాహమాడిన సతి పతులు ఒకే గదిలోను, ఒకే మంచముమీదను పరుండవలయు ననెడు మూఢవిశ్వాసముచే బలపడుచున్నది. అందుకు మత ధర్మాంగీకారమును గలదు. ఆమూఢవిశ్వాసమువలన మిగుల దుష్టమగు భావవైఖరి ఘటిల్లుచున్నది. ఆ మూఢవిశ్వాసము వలన ఫలించిన వాతావరణమునందు జీవించు మనము దాని వలన అనర్థమునకు సరియైన విలువను నిర్ణయించుట అసంభవముగ నున్నది.

తర్ స్టనుగారు కూడ గర్భధారణ నివారణసాధన లనిన వ్యతిరేకి యని యిదివరకే గ్రహించితిమి.

ఆయన సూచించిన యితరములగు పరిహారము లనేకము మనకు ఆచరణయోగ్యములగునవి కావనినాయభిప్రాయము. ఏదెట్లున్నను, అందుకు శాసనాంగీకార మవసరమగుచున్నది. కాని ప్రతిభార్యయు ప్రతి భర్తయు రాత్రులందొకే గదియందు గాని, ఒకే మంచముమీదగాని పరుండకుండ ఈనాడే ప్రతిన పూనవచ్చును. మానవునికిని పశువునకును గూడ ఏ పవిత్ర ధర్మముకొఱకై సంభోగ కర్మ యేర్పడినదో అట్టి సంతానోత్పాదనము కొఱకు తప్ప సంభోగము చేయ మనియు ప్రతిన తీసికొందగును.

పశువు ఆ శాసనమును తప్పక అనువర్తించుచున్నది. విచక్షణాధికారముగల నరుడు తప్పుడు త్రోవనే పోవుచు మిగుల దోషి యగుచున్నాడు. గర్భధారణ నిరోధోపాయముల జోక్యము ప్రతిస్త్రీయును నిరాకరింపవలయును. కామవాంఛా ప్తిని నిరోధించుట వలన మనస్సు శరీరముతోడి సహకారము

చేయునెడల రోగములు పుట్టుటకు మారుగా ఆరోగ్యమును, పుష్టియు లభింపగల వని స్త్రీపురుషు లిరువురును గ్రహింప వలయును. 'లోకములోని నేటి యనర్థములలో చాలఅనర్థము లకు ' బాధ్యత వహింపవలసినది వివాహధర్మములవైఖరియే యని తర్స్టనుగారు విశ్వసించుచున్నారు. ఈగ్రంథకర్త గారు నిరాఘాటముగ చేయు రెండు తుదితీర్మానములనుమనమంగీక రింపవలయు నగత్యము లేదని తెలిపి యేయున్నాను. స్త్రీపురుష సంబంధములను ఆరోగ్యవంతమును, నిర్మలమునునగు విచక్ష ణబుద్ధితో గ్రహించు నెడల, నేడు మన మనుభవించుచున్న మహాక్లేశములలో నధికభాగము తప్పించుకొనగలమనుటకు సందేహము లేదు. ముందు రానున్న తరములవారిక్షేమమునకు ధర్మకర్తలముగా మనము భావించు కొనవలసియున్నారము.

## సంతాన నిరోధోత్సాహి

(మహాదేవదేశాయి వ్యాససంగ్రహానువాదము)

'హౌహుమార్టిను' అనునామె ఇంగ్లండునుండి గాంధీజీఅభిప్రా యాలను మార్చుటకును, భారత దేశమందలి పేదల రక్షణార్థ మును సంతాన నిరోధశాస్త్రమును బోధించుటకై యీదేశ మునకువచ్చినది. ఆమెయీదేశమునకువచ్చుటకదియే మొదటి సారి. ఇచ్చటి పేదలసంగతి యామెకు తెలియదు. కావున బ్రిటిషు వ్యభిచారగృహముల గూర్చిన తన అనుభవముతో ము చ్చటించినది.

'దీనవనిత' అనెడు మార్టినుగారి శబ్దమును గూర్చియే గాంధీజీ వాదము మొదలు పెట్టెను:— "దీనవనిత" లేనేలేదు.

(మీరు పేర్కొను) దీనవనిత పురుషుని మించిన ధీరురాలే. భారతదేశపు గ్రామములకు మీరు వచ్చువెడల నే నీ విషయమును రుజువు చేయుటకు సిద్ధముగా నున్నాడను. తానొడంబడని పక్షమున, స్త్రీగర్భమున జనించిన పురుషు డెవడును తనను బలాత్కరింప జాలడని ఏ స్త్రీయైనను మీకు తెలుపగలదు. నా భార్యతోడి నాకుగల అనుభవముతో నేను మాట్లాడగలను. నే నొక్కడనే గాను అట్టివాడను. లోబడి పోవుటకంటె చచ్చుటకే యిష్టమున్న యెడల, ఏ రాక్షసి యైనను స్త్రీని లోబరచు కొనజాలడు. కాదుసుమీ! అది పరస్పరము జరుగు దోష విషయము. స్త్రీపురుషు లిరువురును దైవదైత్యాంశముల రెంటి మిశ్రస్వరూపులుగ నున్నారు. దైత్యాంశమును నిగ్రింప జాలుచో చాలును, మంచిదే" అనిరి.

"తన కిక నెన్నడు బిడ్డలు పుట్టకుండుకొఱకు పురుషుడు వేఱొక స్త్రీని చెంతజేరు వెడల భార్య యేమిచేయవలసియుండును?" —మార్గినుసతి ప్రశ్న.

"కాబట్టి, మీరిప్పుడు మీవాదనను మార్చుచున్నారు. మీరు పొరబాటు ప్రతిపాదనలతో ప్రారంభించియున్న యెడల మీతీర్మానములు తప్పుగనే యుండకతప్పదు. ఇష్టమువచ్చిన ప్రతిపాదనలదీసికొని, పురుషుని పురుషుడు కానట్లును, స్త్రీని స్త్రీకానట్లును వచింపకుడు. మీసుబోధయొక్క ఆధారములను నాకు తెలుపుడు. మీసంతాననిరోధప్రచారమే కొంత ఉపోద్ఘాతముగా నున్నదని నే ననుటలోని పరిహాసమునకు వెనుక కొంత గాఢతరచింతన యున్నది.

ఏలనన సంతాననిరోధములోనే మనముక్తి కలదని తలంచు స్త్రీలు, పురుషులు కొందరు కలరు. కాబట్టి మీబోధ కాధారమేమిటో నన్ను తెలిసికొనవనిండు."

"ప్రపంచముయొక్క ముక్తి అందున్నట్లు నాకు గోచరించుట లేదు. కాని నేను చెప్పునదేమన ఏదో యొకరీతి సంతాననిరోధము లేనిది ప్రపంచమునకు ముక్తిలేదని. దానిని మీ రొకరీతిగా సాధింపవచ్చును. నే నొకరీతిగా సాధింపవచ్చును. మీరుచెప్పు పద్ధతిని నేనును ప్రోత్సహింతును. కాని అందరిసందర్భమున గాదు. రమ్యమగునొక ధర్మమును ఏదోనింద్య మగు దానిగ మీరుభావించు చున్నారు. ఇరువురుజీవులు గూడి నూతనజీవిని సృజించుచో ఆజీవులు దైవమునకు చాల సన్నిధిలోనుండె ననదగును. ఆకర్మయందు రమణీయత కొంతకలదు." అని మార్టినుసతి పలికెను.

"ఇందునుగూడా మీరొక భ్రాంతిలో బడిపోవు చున్నారు. నూతన జీవసృష్టి దైవచర్యకు సమీప మగునదని నే నంగీకరింతును. కాని నేను చెప్పున దెల్ల ఆ కార్యమును దివ్యపథమునవే నిర్వహింపవలయు ననియే. అనగా నూతన జీవసృష్టి గావింప వలయునను సంకల్పముతోడ తప్ప స్త్రీపురుషులు కలియ తగరు. అటులగాక కామ ప్రేరితులై ఒండొరులు కౌగలించుకొను నుబలాటముతోడ మాత్రమే వారు కలియు నెడల వారు దయ్యమునకు దాపగు చున్నా రందును. దురదృష్ట వశమున నరుడు నారాయణునకు సమీపమున నుండుట మఱచి తనలోని పశువాంఛ ననుసరించి పశువుకన్న హీనుడై పోవుచున్నాడు."

"సరే, మీరు పశువు లని వారి నంతగా నిందింపనేల ?"

'నేను నిందించుట లేదు. పశువు దాని సహజ ధర్మము నది నిర్వహించు చున్నది. మహాతేజస్వి యగు సింహము కడుంగడు మాననీయ మగు జంతువు నన్ను మ్రింగివేయుటకు దానికి సంపూర్ణాధికారము గలదు. కాని నేను కోరలను పెంచుకొని

నీపై బడుటకు నా కేలాటి అర్హతయు లేదు. అటులగుచో నేను పతితుడనై, పశువుకన్న హీనుడనై పోవుదును.' అని శ్రీ గాంధీజీ వచించెను.

'నా భావమును వ్యక్తీకరించుటలో నేను చాల తబ్బిబ్బగుచున్నందుకు విచారపడుచున్నాను. అధిక సంఖ్యాకుల సందర్భములలో నా బోధ ముక్తిదాయకము కాకపోవచ్చును. కాని అది యుత్తమ జీవితదశను చేర్పు సాధనగా నుండగలదు. నా భావమును నే నంతగా స్పష్టము చేయజాలకున్నను. నా యభిప్రాయమును మీరు గ్రహించియుందురు.' అని మార్గరెట్ సతి.

"అటుల కాదు. నేను మీయెడ అన్యాయము చేయగోరను. కాని, మీరు నాదృక్పథమును బాగుగ గ్రహింపవలయును. అపార్థములతో వెడలి పోవకుడు. మానవ జీవుడు అటు పైకిగాని ఇటు క్రిందికిగాని పోవు మార్గములలోనే దేనొకదాని నైనను ఎన్నుకొనవలసి యుండును. అతని యందు పశ్వాంశ యుండియే యున్నది. కాన ఊర్ధ్వగమనమునుకంటె తేలికగా అధోగమనమునే సులభముగ నెంచును. అందునను దానిని మనోహర రూపమున ప్రదర్శించు నెడల అతడు దానినే ఆహ్వానముగ చేకొనును. నేను లోలత్వమును ప్రజాంగీకారమునకు బెట్టు నెడల ప్రజలు దాని నత్యాతురతతో స్వీకరింతురు. మీవంటివారు స్వార్థరహితమగు నుత్సాహముతో గొంతెత్తి మీ బోధనలను సాగించు నెడల తప్పక విజయముల బడయుదురని నే నెఱుంగుదును. మఱియు మీరు తెచ్చి పెట్టుచున్న ప్రమాదము నేనాత్రమును గుర్తింపకయే ప్రజలు నిర్విచారముగ మరణమువాత దుముకుచుండిరనియు నే నెఱుంగుదును. అధోగతిమార్గమున ప్రేరణమంతగా నగత్యముండదు; తర్కమవ

సరము కాదు. ఆమార్గము సాక్షాత్తుగ నెదుట మూర్తీభవించి యే యుండును. నిరోధించి క్రమగతిని నడువరేని వ్యాధులు, పీడలు చెలరేగి మహాఘోరము లగు నపాయముల గూర్ప గలవు." అని శ్రీగాంధీజీ హెచ్చరించిరి.

ఇంతవఱకును దైవమార్గమునకును, దైత్యమార్గమునకును భేదము నంగీకరించున ట్లగుపడిన మార్టిక్ సతి వాని నడుమ నంతగా భేదము లేదనియు, ప్రజ లూహింపజాలకున్నను అవి యొకేరీతి ఫలితార్థముల నిచ్చునవియే యనియు వాదనకు గడంగెను. అంత శ్రీగాంధీజీ యిట్లు ప్రశ్నించిరి :—

"కాబట్టి దేవుడు దైత్యుడునొక్కటేయనిమీభావమా?"

"ఎండ యనునది కలదనిమీకు విశ్వాసము కలదా? అట్టు లగు నెడల నీడయు కలదనుట మీ రొప్పుకొనవలసి వచ్చునని మీకు తోచుటలేదా?"

మార్టి:— నీడను మీరు దైత్యునకు పోల్చు టెందులకు?

గాంధీ :— పోనిండు. దైవేతరు డనుడు. మీయిష్టము.

మార్టి :— నీడలో దేవుడు లేడని నే ననుకొనను. సర్వత్ర చైతన్యముకలదు.

గాంధీ— చైతన్యశూన్యతయనున దొకటికలదు. ప్రాణము పోవుటతోడ్తోడనే, తమకత్యంతప్రియతములశరీరములసైతము హిందువులు కాల్చిబూడిదచేయుదురు. అదిమీకు తెలియునా? సర్వ చైతన్యమునందును ప్రధానముగాఏకత్వముకలదు. అయి నను భిన్నత్వమును కలదు. దానిని భేదించుకొని లోనికి చొచ్చుకొని పోయినగాని దాని వెనుక మఱుగుపడియున్న

ఏకత్వము గోచరించదు. అయినను మీరు ప్రయత్నించుచున్న తీరున బుద్ధితో సాధింప వీలగునది కాదు. ఎచట సత్యముండునో, అచ్చట నసత్య ముండితీరును. ఎచ్చోట వెలుగుండునో అచ్చట చీకటియు నుండును. తర్కము, బుద్ధిబలము, మీ తనువుసహా పూర్తిగ నణగిపోయినగాని, ఆ యున్నతానుభవము మీకు లభించదు." ఈ పలుకులు విని మార్టినుసతి వెఱగుపడి చూడ సాగెను. మఱల శ్రీ గాంధీజీ యిటుల సంభాషణ సాగించిరి:—

"కాదు. మీకింకను వ్యవధి నిచ్చెదను. అయినను, అందు కొఱకై మీరు వార్ధావచ్చి నా యాతిథ్యమున నుండవలయును. మీ రెంతటి యుత్సాహులో నే నంతటియుత్సాహినే. మీరు నన్ను మార్చుటో, లేక మీరే మారుటో జరుగు వఱకును మీరు భారతదేశము నుండి విడిచి పోగూడదు."

శ్రీ గాంధీజీకిని, మార్టినుసతికిని జరిగిన యీ ప్రసంగము నాలకించు నప్పుడు, సేంటుఫ్రాన్సిసు పలుకులు నాకు జ్ఞప్తికి వచ్చు చున్నవి:—

వెలుతురు క్రిందికి చూడ, చీకటి గోచరింపగా, "నే నెచ్చటికి పోదును?" అని అడిగినది. శాంతి క్రిందికిజూడ సంగరము గోచరింపగా "నే నెచ్చటికి పోదును?" అని అడిగినది. రాగము క్రిందికిచూడ ద్వేషము గోచరింపగా 'నే నెచ్చటికి పోదును?' అని అడిగినది.

ఆప్రశ్నయే మాంసమయ రూపము దాల్చి మనమధ్య కాపురము చేయుచున్నది.

## సంతాన నిరోధవాదిని

(మహాదేవదేశాయి వ్యాససంగ్రహానువాదము)

మార్గరెటు శాంగరుసతి "స్త్రీపురుషులకుగల పరస్పర ప్రేమ వారియందేకభావము గుదర్చగల బంధుత్వము; అది భార్యాభర్తల నడుమ వెలసి వారిని పూర్ణుల జేయు గడంగును; సమ్మతిని పెంచి ఆధ్యాత్మిక సమరస భావమును ప్రసాదించును" అనుచు ప్రేమ నుగ్గడింప సాగెను.

గాంధీజీ:— ఉభయులును పశువ్యసనముల తృప్తి గావించుకొనుచు, తత్ఫలముల దప్పించుకొన నెంచు సందర్భమున, దానిని 'ప్రేమ' అన దగదు; అది మోహమగును. 'ప్రేమ' విర్మలమును, పశువాంఛ కతీతమునై తనను తాను నియమగతిని నడపుకొనును. భోగములను హద్దులలో నుంచుకొను విద్య మనకు చాలదు. భర్త భార్యతో "మనకు సంతానము వలదు కాని సంభోగమున కూడుదము" అను నెడల వానిని ప్రేరేపించునది పశువ్యసనముగాక మఱేమిటి? తమకు హెచ్చు సంతాన మక్కఱ లేనిచో, వారు సంభోగము నాపుకొన వలయును. పశువాంఛా తృప్తికి సాధముగా చేసుకొనిన తత్ క్షణమే ప్రేమ కామముగా మారిపోవుచున్నది. ఆహార విషయమునను అంతే. కేవలము జిహ్వాలాలస కొఱకై తినుటయు కామమే. ఆకలిని తీర్చుకొనుటకై మీరు పిండివంటలను మెక్కబోరు. భోగము కొఱకై మీరు వానిని తినెదరు. ఇక వైద్యునికడకు బోయి విరుగుడును దెలుపుమని గోరుదురు. ఒకప్పుడు మీరుడాక్టరు చెంతకేగి 'విస్కీ'చే మీ మెదడునందు మబ్బుగప్పెనని చెప్పునెడల, ఆయన మీకేదో విరుగుడుమందు

నీయగలడు. సరే, పిండివంటల మెక్కుటగాని, "విస్కీ" త్రాగుటగాని మానుటే శ్రేష్ఠతరముకాదా ?

శాంగరుసతి:—ఆపోలికను నే నంగీకరింపజాలను.

గాంధీ:— నిజమే. సంతానేచ్ఛ లేకుండనే సంభోగము చేయుట జీవున కవసరమని మీ వాదనయై యుండెను గాన నేను తెలుపు పోలికను మీ రొప్పుకొనజాలరు. మీ వాదనతో నే నొడంబడజాలకున్నాను.

శాంగరు :— అవును. సంభోగవాంఛ పారమార్థికమగు అవసరవిషయము. ఆయీప్సితముయొక్క ధర్మము ప్రధానమగునుగాని దానివలనిఫలితార్థము గాదు. ఏమందురా ఆఫలితార్థముయొక్క ప్రసక్తియే లేకున్నను ఆసంభోగధర్మము ఉండనేయుండును. తలిదండ్రులకు గర్భధారణాపేక్ష యెంత మాత్రమును లేకయే ఆకస్మిక సంఘటనగా పుట్టిన వారలే అత్యధిక సంఖ్యాకులగు బిడ్డ లని నే నెఱుంగుదును. సంతానమును గోరి సంభోగమున గూడ నిరువురు సతిపతు లుండుట చాల అరుదు. ఒకబిడ్డను వాంఛించునపుడు మాత్రమే సంభోగము చేయు తీరున ఏ రెండేండ్లకో యొకసారి కలియునట్టి నియమమును పాలించుట ఆనందముగా సహవాసము చేయుచు కామప్రేరితులగు సతీపతులకు సాధ్య మగునని మీ రాశింతురా ?

గాంధీ: —అటులచేసిన గౌరవము నాకుగలదు. మఱియు అటువంటి వాడను నే నొక్కడనే గాదు.

సంతానముకొఱకు సంభోగము చేయుట ప్రేమ మనియు కామతృప్తికి సంభోగము చేయుట మోహమనియు వ్యత్యాసము

చేయుట న్యాయసమ్మతము కాదని శాంగరు సతియొక్క అభి ప్రాయము. ఏమన ఆ రెండు సందర్భములందును జరుగు సంభోగ కార్య మొక్కటియే యగును. శ్రీగాంధీజీ వెంటనే ఆ మాట నొప్పుకొనుచు సంభోగ కర్మ సర్వమును మోహప్రేరితమై పోయిన దని వివరించుటకు సంసిద్ధపడి తనజీవిత సంఘటనల నే తెలుపుచు విషయమును సంతను తేట తెల్లముగా నెఱుక పఱి చెను :—

"నాభార్యను నేను కామదృష్టితో చూచినంత కాలమును మా యిరువురకును నిజమైన సఖ్యత చేకూరనే లేదని నాస్వీయానుభవమువలన గ్రహించినాడను. అప్పుడు మాప్రేమ యున్నత స్థాయికి చేరనేలేదు. మాయిరువురి మధ్యను సదా అనురాగముండెడిది. కాని, మేము అందులో నేనే నిగ్రహశీలమును దాల్చిన కొలదిని అధికాధికముగా నిరువురము సన్నిహితులము కాగలిగితిమి. నా భార్యపట్ల నిగ్రహలోప మెన్నడును చూపట్టలేదు. చాలతఱుచుగా ఆమె నిగ్రహమునే చూపెడిది. కాని చాలతఱుచుగా నాకష్టము చెప్పెడిది. అయినను పలుమారు తన యసమ్మతిని సూచించెడిదియే. నే నింద్రియలోలుడనై యున్నంత కాలమును, నే నామెను ప్రకృతి చేయ జాలనైతిని. నేను నా యింద్రియ లోలతకు స్వస్తి చెప్పిన క్షణము నుండి మా పరస్పర సంబంధము పారమార్థికమై పఱిగినది. మోహము అంతరించినది. దాని స్థానే ప్రేమ రాజ్యముచేయ మొదలిడినది."

•

శ్రీగాంధీజీ యిట్లు పలుకుచున్నను, శాంగరుసతి భార్యాభర్తలు స్వేచ్ఛగా కౌగలించుకొనుటెల్ల ప్రేమకై కర్మయనియు,

అట్టి కౌగిలింతలు, బుజ్జగింపులు లేని సాంసారిక జీవనము సార హీనమగు నిర్జీవగతి యనియు బహుశః తలంచి యుండును. శ్రీగాంధీజీ స్వీయానుభవ సాక్ష్యము ఆమెకు నచ్చలేదు. "తమ వీర్య ప్రభావమును నిర్మాణ కర్మ ప్రవృత్తిలోనికి మఱల్చి జాతీయ కాంగ్రెసు కార్యక్రమ నిర్వహణ మనుచు పనులు జేయునట్టి కొలదిపాటి యూహామాత్రజీవులలో గాంధీజీ చేరినవాడని ముసిముసి నగవులతో వారి మాటలను ఆమె త్రోసిపుచ్చినది. కాని, ఆమెతో సంభాషించు చున్నంతకాలమును శ్రీగాంధీజీ యొక్క-సారియైనను కాంగ్రెసు యొక్క-గాని, కాంగ్రెసు గోత్రులయొక్క-గాని, ప్రస్తావననే తెచ్చినటులలేదు. సమస్త నైతిక పురోగమనమును కొలదిపాటి యూహామాత్రజీవుల సాధనపై నాధారపడి సాగునదేయని తలచు శాంగరుసతి చూపులకు ఫలప్రదమైనటుల గాన్పించు తన యుద్యమముయొక్క- యభివృద్ధి సైతము, అదియే రహస్య సంజీవిని బోలి, పరమోత్కృష్టమైన దనుచు తానుచేయు ప్రకటనల పైనను, భూవాసులమగు మనమెల్లరము మనసర్వస్వ మును, మనబుద్ధిని, మనయుక్తిని, మనసాహసమును, మన యూహను, మనబాధ్యతను నంతటిని లోబఱచవలయునట్టి ఆకాశమార్గమని తానుచేయు చమత్కారాభివర్ణనలపైనను ఆధారపడి జరుగునదే యని మఱచుచున్నది. 'ఈలోకమున మానవజాతియొక్క- పరమనిష్ఠను ఫలింపజేయుమార్గ మది యొకటియే' యట! శాంగరుసతి గాంధీజీని వట్టి స్వాప్నికద్రష్ట యని రుజువుచేయ నాతురపడుచుండెను. అందువలన గాంధీజీ ఆమెకు వివరింపసాగిన ఆచరణయోగ్యములగు పద్ధతులను, సదు పాయములను ఆమె విస్మరించుచుండెను.

'జీవితకాల మంతటిలోను ఏ మూడు సార్లో లేక నాలుగు సారులో యే వా సంభోగకర్మ జరుగవలసినది ?' అని తీవ్రముగ శంకించినది.

"ముగ్గురు నలుగురు బిడ్డలకంటె నెక్కువమందిని గనుట అవినీతి యనియు, అటుపిమ్మట భార్యాభర్తలు వేర్వేరుగా నుండవలె ననియు ప్రజల కేల బోధింపరాదు ? వారి కట్టి బోధ చేసినయెడల అదియే యాచారముగా ఘనీభవించును. ఒకవేళ సంఘసంస్కర్త లీబోధను ప్రజలమనములందు నాటు నటుల జేయజాలకపోయినపక్షమున శాసనము నే యెందుకు చేయరాదు ? సతిపతులు నలుగురు సంతానమును బడయు నప్పటికిని వా రనుభవించు పశుభోగము చాలదా ? అంతట వారి 'ప్రేమ' యున్నతక్షేత్రమునకు ఉద్ధరింపబడవలయును. వారితనువులు కలిసినవి. వారికి కావలసిన పిల్లలుపుట్టిరి. ఆ వెనుక నైన వారి ప్రేమబంధము పారమార్థిక సంబంధముగా పరివర్త నము పొందవలయును. ఈబిడ్డలు చచ్చిపోయినచో పోనిండు వారు మఱల కలియవచ్చును. ఇతరవాంఛలకు లోబడక నిలువగల ప్రజలు ఈవ్యసనమునకు మాత్రము బానిసలైపోనేల? జన్మనిరోధమును గుఱించి మీరు బోధలు చేయుతఱిని వారి కది ధర్మమని యుపదేశింతురుగదా ! ఆపనిని వారు చేయనిచో వారిపారమార్థికపరిణామము భగ్నమైపోవునని వారికి చెప్పెదురు. ఎవరో వచ్చి క్రమపద్ధతిని వారిని నడపబోదురని వారికి చెప్పబోరుగదా ! 'జన్మనిరోధమును' గుఱించి మీరు బోధలు చేసినయనంతరము 'ఇంతవఱకు పొండు. ఈహద్దు దాటి పోవలదు.' అని వారికి మీరు చెప్పరు. మితముగా త్రాగుట యనునది సాధ్యమగునని భ్రమించి ప్రజలకు మీరు

'మితముగా త్రాగు' డని యుపదేశములు చేయుచుందురు! మితముగా త్రాగుబోతులగు వారిని నేనెఱింగియే యున్నాను" అని శ్రీ గాంధీజీ వచించిరి. అయినను శాంగరుసతియొక్క గట్టిపట్టుదలనుగుఱించి గాంధీజీ తనకు పూర్తిగ నచ్చినయొక పరిహారమును తెలిపిరి. ప్రతినెలలోను నిషిద్ధములు గాని పది శుభదినములలోమాత్రమే సంభోగము చేయుటయు, ప్రతికాలములని నిషేధింపబడినదినములలో బ్రహ్మచర్యము నుండుటయు నేను దెలుపుపరిహారము.' ఈపరిహారమైనను శాంగరుసతికి నచ్చినట్లు దృఢముగ చెప్పవీలులేదు. ఇట్లు సత్యాన్వేషకుడగు శ్రీగాంధీజీ ప్రవచన మేమో యైనది. శాంగరుసతిమాత్రము ఈయంశము తనసంభాషణలందుగాని, "ఇల్లస్ట్రేటెడ్ వీక్లీ" పత్రికలో నామె వ్రాసిన వ్యాసములందుగాని దీని ప్రస్తావన నెత్తుకొనలేదు. జన్మనిరోధవాదులు ఈ సిద్ధాంతముతో తృప్తిపడజాలు నెడల, జన్మనిరోధచికిత్సకులయు ప్రచారకులయు వ్యాపారము బహుశః మూలపడునేమో!

శాంగరుసతి ప్రస్తావనకు తెచ్చిన మూఁడవయంశ మింకొకటికలదు. 'వరల్డు ఫెలోషిప్ ఆఫ్ ఫెయిత్స్' అనుసంఘమున శాంగరుసతి యొసగిన యుపన్యాసము ఆమె ఆంతర్యమును బయలుపెట్టుచున్నది. ఆమెతన దేశస్థితినిగుఱించి దాపఱికము లేకుండ మాట్లాడినది:—'ప్రపంచములో నేదేశమునందుకంటె మనదేశమునందు, నేరముకాగల భ్రూణహత్యలు హెచ్చుగా జరుగుచున్నవి. మనమహాజాతిలో జరుగు గర్భస్రావములు సంవత్సరమునకు ఇరువదిలక్షలకు మించుచున్నవి. గర్భిణీస్త్రీలు తమంతటతాము మందులను, శస్త్రములను ప్రయోగించుట

వలనగలుగు గర్భవిచ్ఛిత్తులు ఈమొత్తములో చేరుటలేదు.' అని తెలిపినది. ఈసందర్భమున ఆమె వివాహితలయిన స్త్రీల సంగతిమాత్రమే ప్రస్తావించి యుండలేదు. అవివాహితలగు కన్యలనుగూడ ఆమె తనలెక్కలలోనికి దీసికొనినది. వారికి సయితము గర్భధారణమును తప్పించుకొను సాధనములను నేర్పుటకామె జంకుటలేదు. "గర్భవిచ్ఛిత్తి సమస్యలో గల అనంతములగు చిక్కులు, సక్రమమును, సురక్షితమును, విశ్వాసనీయమునునగు గర్భనిరోధసాధనములను ప్రయోగించుటవలన మాత్రమే పరిష్కారముకాగలవు." అనిఆమెగట్టిగ తెలుపుచున్నది. సంఘమున్న ప్రస్తుతస్థితియందు గర్భస్రావములు అనివార్యములట! అందువలనగర్భనిరోధమును అనివార్యమగుచున్నదట! ఇట్టి విషమచక్రగతి పూర్తిచేయబడుచున్నది. 'మానవజాతి యందుసహజసిద్ధముగ నెలకొనియున్న మహోన్నత సృజనశక్తిని దుర్వ్యయము చేయుటను, ఘోరతరముగ వ్యర్థపరిణామము చేయుటను నివారించుటను గుఱించి మనఃపూర్వకముగా నామె విన్నపముల గావించు చున్నది. తాను ప్రోత్సహించు గర్భధారణ నివారణోపాయములే ఆ దుర్వ్యయమునకును, ఆ వ్యర్థ ప్రయోగమునకును, ప్రోద్బలము నిచ్చు మహాఘోర పైశాచిక యంత్ర సామాగ్రి యనుటను శాంగదుసతి మఱచియే పోవుచున్నది.

ఆమెశ్రద్ధ సంతసు వమ్ముచేసెడి మఱికొన్ని వాదములు విస్మయమును గొల్పునవి ఆమె యుపన్యాసమునందు గోచరించుచున్నవి: "జపానుదేశమున మున్నెన్నడు లేనంతగా జనసంఖ్య పెరుగుచున్నది. ఆసియాఖండ జాతులమధ్య ఈ 'ఉద్యమ'లతోట్టి

పోటీలు' పూర్ణవేగమున సాగి విశాల ప్రపంచ శాంతికి చేటు తెచ్చు చున్నట్లున్నవి. ఇదియే దూరస్థ ప్రాచ్య దేశములవలని ఆపద. 'నానాజాతి సమితి' యో లేక 'ప్రపంచ న్యాయస్థానమో' యీ ఘోర వ్యాపారముం గూర్చి శ్రద్ధ తీసుకొనుట కిది అదనుగాదా? అదనముగా పెరిగిన ఈ జనసంఖ్యకు స్థావరము లేర్పరచుటకై జపాను నిశ్చయించుకొనుట వలన చీనాతోడి యుద్ధము శీఘ్రముగ సాగుట 'మనుమూకుయో' రాష్ట్రము నొక జొమ్మలాట రాజ్యముగా నడుమ లేవదీయుట, పవిత్రసంధి నియమములను భగ్నము చేయుట, మఱొక ప్రపంచ సంగ్రామమునకు బీజముల నాటుట త్వరిత గతిని ఘటిల్లు చున్నవి." అని మొదలిడినది. మఱొకటి పసుపురంగు జాతి యుపద్రవమా? సమిష్టి మానవజాతి క్షేమమునకై పాటు పడు నారీరత్నము యొక్క పలుకు లివి! అలపీత జాతినుండి పూర్ణముగా విలక్షణ లక్షితయగు వామాక్షి వాక్కు లివియా యని యాశ్చర్యము గలుగు చున్నది.

## అరణ్యరోదన

(గర్భధారణ నిరోధసాధనల' ఉపయోగమును ఖండించుచు, అమెరికా నుండి శ్రీ గాంధీజీకి అప్పుడప్పుడు వచ్చుచుండిన లేఖలలో నొకదానియందలి అంశముల సంగ్రహము:—

"జన్మనిరోధవాదిని"యగు శాంగరుసతితో జరిగిన మీ సంభాషణయొక్క సమీక్షణను నే నిటీవల చదివితిని. వాదనలో మీరు వహించిన పక్షముం గూర్చి నా యభినందనముల దెలుప నిమిత్తమై మీ కీ లేఖ వ్రాయుచున్నాను. సంతగా నా హృదయ ముప్పొంగిపోయినది.

గత ముప్పది సంవత్సరముల నుండి నేనుపాధ్యాయుడనుగా బాలకులకు బోధలు చేయుచున్నాను. శరీరమును వశమున నుంచుకొనుటనే నేను సదా ప్రతిపాదించుచుంటిని. బాలురు నిస్స్వార్థులుగా జీవింపవలయు నని హెచ్చరించుచుంటిని.

శాంగరుసతి మా పొరుగున నుండిన కాలమునందు, ఫలితార్థము లేమగునా యను భీతిలేకుండ వ్యభిచారము జరుపు టెట్లాయను విషయజ్ఞానమును తెలిసికొని ఇప్పటి హైస్కూలులోని బాలబాలికలు అవలంబనము చేసికొనసాగిరి. శాంగరుసతి ప్రచారము హద్దు లేకుండ సాగునెడల, ప్రపంచమంతయు నింద్రియవ్యసనములకు లొంగిపోయి, ప్రేమ యనునది నాశనమైపోవు సమయము త్వరలోనే రాగలదు. ప్రజాసామాన్యమునకు ఉన్నత ధర్మములను నేర్పుటకు శతాబ్దాలు పట్టునని నే నెరుగుదును. కాని ఆ ధర్మబోధను ప్రారంభము చేయుటకు ప్రస్తుతమునకు మించిన తరుణము లేదు. వ్యసనమునే ప్రేమ యనుకొని ఆమె పొరబడుచున్నది. ఏలన, ప్రేమము ఆత్మసంబంధమైనది; మోహము నుండి పుట్టిన దెన్నడును కాదు. వ్యసనముల వెంబడించి యిది వరకే మతిచెడినవారికి తప్ప యింద్రియనిగ్రహము హానికరము కాదని వాదించుటలో 'డాక్టరు ఎలెక్సిస్ కారెల్' మహాశయుడు మాతోడ నేకీభవించుచున్నాడు. బ్రహ్మచర్యము హానికర మని డాక్టరు లనేకులు విశ్వసించుచున్నా రనుటలో శాంగరుసతి పొరబాటు చేయుచున్నది. 'అమెరికన్ సోషియల్ హైజీన్ ఎసోసియేషను'కు చెందిన ప్రముఖు లగు డాక్టరులును సైంటిస్టులును నిగ్రహము ఉపకార మని అభిప్రాయపడుచున్నారు.

మీరు దివ్యమైన పని చేయుచున్నారు. మీరు యావజ్జీవ దీక్షగా పూనుకొనిన ఈ యుద్యమము యొక్క అవస్థలను నే నాతురతతో కనుపెట్టి చూచుచున్నాను. సంభోగవిషయమును పవిత్రాత్మ దృక్పథమునుండి విచారించు బహుకొలది మంది మహనీయులలో మీ రొకరుగ నున్నారు. విశాలసాగరముల

ఈకలి తీరముల నుండి మీతోడి సహచర్యమును తెలుపుకొనుచున్నవాడనుగ నన్ను మీరు స్వీకరింప గోరుచున్నాను. భవితవ్యము యువకజనుల హస్తగతమై యుండును. గాన వారు సత్యమును గ్రహించు తెరగున ఈమహోద్యమమును మనము సాగింతము గాక!

నేను బాలుర గూర్చి యుపన్యసించియున్న కొలది వాక్యముల నిం దుల్లేఖింతునుగాక :—

'సృష్టి గావింపుడు; సదా సృజనకర్మ చేయుచుండుడు. సృజనకర్మ దివ్యమైనది; ఆత్మప్రబోధము గావించి తరింపచేయునది. కాని, సృజనశక్తులమాత్ర ముపభోగించుచు ఇంద్రియలాలసను తృప్తిపఱచుటకై మీరు పూనుకొను తత్క్షణమే సృష్టికర్మపేర ద్రోహముచేయ మొదలిడనవారై మీలోని దివ్యమగు ఆత్మశక్తులను వినాశము గావించుకొనువా రగుదురు. అట్టిచో ఫలించునది ఆశాభంగ మొకటియే.

కాయిక, మానసిక, ఆధ్యాత్మిక సృష్టియంతయు ఆనందమయమును, జీవప్రదము నగును. సృజన సంకల్పమే లేక కాయిక సుఖమును మాత్రమే కోరుకొందు రేని మరియు సృజన సంకల్పమును విసర్జింప జూచినను గూడ మీ సహజ స్వభావమును భ్రష్టము చేసికొని మీ ఆధ్యాత్మిక శక్తులను హతము చేసుకొనినవా రగుదురు.

దీని ఫలితార్థమో "దుర్నివార్యమగు వ్యసనపీడ, నిస్త్రాణము, నిరాశ, పరిభవము. వేనిపై నాధారపడి అధ్యాత్మ పరాయణులగు ఋషుల యొక్కయు, స్త్రీల యొక్కయు అభినవ

జాతిని సృష్టి చేయగల్గునని అటువంటి భవ్యగుణములు ఫలింప జాలవు.

ఈ నా వాక్యములు 'అరణ్యరోదనమే' యగునని నాకు తెలిసియే యున్నది. ఐనను వాని యాథార్థ్యమును నే నెఱుగుదును. మార్గ మిదియు యున్నదని చూపుటయే నాపని."

అప్పు డప్పుడు అమెరికా నుండి గర్భధారణ నివారణోపాయముల ఖండించుచు నాకు వచ్చు లేఖలలో నిదొకటి. శరీరమును చెరబట్టి యుంచి సహజమగు సౌఖ్యానందముల దూరము చేసి, దానిని హతము చేయునట్టి మూఢవిశ్వాసముల యొక్క దాస్యమునుండి విడిపించుటకు వెలసిన యీ (జన్మనిరోధమను) నూతన సిద్ధాంతమునకు వెఱ్ఱులును, బుద్ధిహీనులు మాత్రమే అమెరికాలో అడ్డు చెప్పుచుందురని వారము వారము దూరపాశ్చాత్య భూములనుండి భారత దేశములోనికి దిగుమతి యగుచుండు నవ్య సాహిత్యరాసి మనకు విశ్వాసము గొలుప జూచుచున్నది. సాధారణ దుష్ఫలితములు వచ్చి పడునేమో యను భీతి లేకుండ పాపకార్యమును చేయుటను నేర్పుచును, అందుం గూర్చిన యుద్రేకమును పెంపొందించుచు నుండు ఈ వాఙ్మయము తాత్కాలికముగా క్రైపెక్కించు చున్నది. పాశ్చాత్య దేశములలో యీ సిద్ధాంతమును ఖండించుచు వ్రాయు వ్యాసములు యుత్తరములను మాత్రమే హరిజన పత్రికా పాఠకుల యెదుట నేను ప్రదర్శింప బూనుటలేదు. సత్యాన్వేషకుడనుగా నాకవి యుపయోగపడవచ్చును. కాని సామాన్య పత్రికా పాఠకులకు వాని యుపయోగ మంతగా నుండదు.

అయినను, పై యుత్తరము వ్రాసినవారు ముప్పది సంవత్సరముల నుండి బాలురకు బోధలుచేయుచుండిన దీర్ఘానుభవముగల వ్యక్తి. కావున వారిలేఖకు నిశ్చయమైన ప్రయోజనముండును. ప్రవాహమున బడి గతిగానక కొట్టుకొని పోవుచున్న భారతదేశ ప్రజాసామాన్యము నందలి స్త్రీపురుషులకును, ఉపాధ్యాయులకును ఈ లేఖదారిజూపగలదు. గర్భధారణనుతప్పించు సాధనముల వినియోగము, 'విస్కీ' సారాబుడ్డిని మించి, అంతులేని దుష్ప్రేరణను గావించునదిగా నున్నది. ప్రాణహానికరమగు దుష్ప్రేరణను గావించుచు ధగద్ధగ మెఱయు సారాబుడ్డి యెంత ధర్మసమ్మతమగునో యిదియును సంతియే. అంతకు మించి యిందేమియు లేదు. ఆ సాధనల వాడుక పెరిగిపోవుచున్నదను హేతువుచేత నిరాశ చెంది తన్నివారణ ప్రయత్నముల విడిచివేయుటకును వలను పడదు. దాని నివారణకు పూనువారిలో ఆత్మ విశ్వాసమున్నయెడల, వారు ప్రయత్నములసాగించి తీరవలసినదే. వెట్టిమూకల నుండి చెలరేగు కేకలకులేని మహాత్వము ఈ 'అరణ్యరోదన' మనుదానికి కలదు. ఈ అరణ్యరోదనమునకు వెనుక దీర్ఘవిచారణ, జిజ్ఞాస, అజేయమగు ఆత్మవిశ్వాసము అండయై నిలుచుచున్నవి. మూకల నుండి వెలువడు సంకులధ్వనుల కట్టిమహాత్వ మేమియు నుండదు. దాని వెనుక నుండగల దంతయు వ్యక్తిభోగలాలస; లేదా కావలయునని కోరుకొని బిడ్డలయొక్కయు, వెతల గుడుచు పిల్లల తల్లులయొక్కయు దుర్గతినిజూచి సహింప జాలమిచే గలుగు జాలియు మాత్రమే! త్రాగుబోతువాని చేష్టల కెంతవిలువగలదో, యొకానొక వ్యక్తికి గలుగు అనుభవముపై నాధారపడు తర్క సిద్ధాంతమునకు

నంతే విలువగలది. నట్టి జాలిమూలమున సాగు తర్కము బోనువంటిది. దానిలో చిక్కుకొనుట అపాయకరమగును. అక్కఱ లేని బిడ్డలయు, అములనే కావలె ననుకొనని తల్లులయు క్లేశములు పోషించు రక్షకగు శిక్ష లనవలయును; లేదా కరుణా మయుడగు ప్రకృతి మనకు హెచ్చరిక తెలుపు మందలింపు లనవలయును. శిక్షాస్మృతిని, మఱియు ఆత్మనిగ్రహ విధిని తిరస్కారము చేయుట ఆత్మహత్యయే. మనము అన్వర్థతను సంపాదించుకొనక నోరునారముగానున్నారము. శిక్షణబడయు భారమును వహించుటకు నోడంబడనేని, మనకు అపజయము తప్పదు; పోరునకు వెను దీసి పాఱిపోవు పిఱికి యోధుల మన్న మాట. జన్మ నియుక్కు యేకైకానందమును పోగొట్టుకొను చున్నా మనుమాటే.

## జన్మనిగ్రహము

జన్మనిగ్రహ పద్ధతి యందు, 'శుభదినముల 'సిద్ధాంతమును నేను బహుశః అంగీకరింపనున్నానని, నా వ్రాతలను కడు శ్రద్ధతో పఠించుచుండు నొకసహచరుడు అలజడిపడినాడు. శుభదినముల సిద్ధాంతము గర్భధారణలను నివారించు సాధనముల ప్రయోగమంతగా నాదృష్టిలో నిషిద్ధముకాదనియు, మఱియు ఆ సిద్ధాంతము వివాహితులయిన సతిపతులకే సంబంధించిన దనియు నా మిత్రునకు వివరించి తెలిపితిని. కాని ఈ విషయ విమర్శమే మిక్కుటముగ నిరీక్షించియుండ నంతలోతునకు దీసికొని పోయినది. గర్భధారణ నివారణోపాయములతో సమానముగా శుభదిన సిద్ధాంతము కూడ నా మిత్రుని విముఖునే

చేసినదను విషయము, స్మృతులు నిర్ణయించు నియమము అనగా సతిపతులు యథార్థముగ సంతాన కాంక్షులగు సప్పుడు మాత్రమే వారు సంభోగమున గూడుట కర్హు లనెడు విధి, సామాన్యప్రజ లందఱకు ననుష్ఠించుటకు సాధ్యమగునను విశ్వాసము నా మిత్రునకు కలదని నాకు తెలిపినది. ఈ విధివాక్యము నే నెఱిగినదే యైనను ఈ విమర్శ కాలమున నా కర్థమయిన తెఱగున పూర్వ మెన్నడును దానిని నేను గ్రహించి యుండ లేదు. ఆ విధివాక్యము అక్షరాలా ఆచరింపవలసిన నిర్బంధము లేనట్టి అతీత ధర్మబోధ యని యిన్ని సంవత్సరముల నుండియు నే నెంచు చుంటిని. సంతాన కాంక్షతో సంబంధము లేకున్నను ఒండొరుల సమ్మతితో సతిపతులు సంభోగించిన యెడల, స్మృతులు శాసనమును దేనిని ప్రత్యక్షముగ భంగపఱచకుండ, వివాహ ధర్మముయొక్క యుద్దేశ్యమును నిర్వహించు చుందు రనియే నేను భావించు చుంటిని. కాని ఆ స్మృతివాక్యమున కిప్పుడు నాకు తోచిన అపూర్వార్థము నాకొక దివ్య ప్రబోధమై యొప్పినది. స్మృతుల విధివాక్యములను అనుల్లంఘనీయముగ పాటించి వర్తించు వివాహితులు సైతము, వివాహమే చేసికొనకుండ విన్నిర్మల జీవితముల గడపువారితో సాటి వచ్చు బ్రహ్మచారులే యను నుడిని నే నింతవఱ కెన్నడును గ్రహించియుండనంత విస్పష్టముగా అర్థముచేసికొంటిని.

ఈ నవ్య ప్రబోధము ప్రకారము, సంభోగమునకు ఏకైక పవిత్రోద్దేశ్యము సంతానకాంక్షయేగాని, కామతృప్తియెన్నడును కాదు. వివాహోద్దేశ్యమును ఈ దృష్టితో గ్రహించు నెడల, కేవల కామతృప్తిని దుర్మోహమనవలసియుండును. ఇంతవఱకును

నిరాక్షేపణీయమును, ధర్మసమ్మతము నని పాటింప బడుచున్న సంభోగకార్యము నిట్టుల వర్ణించుట క్రూరముగ దోచవచ్చును. కాని నేను ఆచారమునుగూర్చి యిప్పుడు ముచ్చటించుటలేదు. హిందూమహాఋషి సత్తములు ప్రవచించిన వివాహశాస్త్రము నుగూర్చి విచారించుచున్నారము. వారి ప్రవచనము తప్పన వచ్చును; వారు పూర్తిగ పొరబడినా రనవచ్చును. అయినను, ఆయా స్మృతివాక్యములు దివ్యప్రబోధజనితములనియు, అనుభవానుగుణ్యములనియు విశ్వసించు నాబోటివానికి వానియందలి భావమును పూర్తిగా నంగీకరింపక మార్గాంతరము లేదు. ఎంత కష్టమగు శోధనకు లోబడవలసి వచ్చినను, ఆసిద్ధాంతము లెంత క్లిష్టముగ దోచినను, ఆ విషయముల యాథార్థ్యమును పరిశీలించుటకును, కొన్ని శాస్త్ర వాక్యముల సత్యార్థమును వివక్షించుటకును వేఱొక మార్గమును నే నెఱుగను. నేను తెలిపియున్న సరణి ననుసరించి, గర్భధారణను తప్పించుకొను కొఱకై కృత్రిమ సాధనముల నుపయోగించుట మూలమున సంతాన నిరోధము గావించుట మొదలగు చర్యలు మహాదోషములే యగును. నా బాధ్యతను పూర్ణముగ గుర్తునుంచుకొనియే యిట్లు వ్రాయుచున్నాను. మార్గరెట్ శాంగరుపతి యెడను, ఆమె సహచరులయెడను నాకు గొప్ప గౌరవము కలదు. తనయుద్యమమం దెంతటి అభినివేశముగలదో చూపి నన్నామె విస్మితుని చేసినది. తాము వాంఛించని బిడ్డలను కనిపెంచు భారమును వహింపవలసివచ్చుటచేత అగచాట్లుపడు స్త్రీలయెడ నామెకు గాఢమగు సానుభూతి గల దని నే నెఱుగుదును. ఈ జన్మనిరోధపద్ధతి చాలమంది "ప్రాణ

టెంటు" మతాన్వేషుల యొక్కయు, ప్రకృతిశాస్త్రవేత్తల యొక్కయు, పండితులయొక్కయు, వైద్యశేఖరుల యొక్కయు, నేను స్వయముగా పరిచయము గలిగి మిగుల మన్ననతో జూచు నెందఱో మహాశయులయొక్కయు ఆమోదమును బడయుచున్నదని నే నెఱుగుదును. అయినను, ఈ సిద్ధాంతమును బలపరచు వారినుండిగాని, ఈ పత్రికా పాఠకులనుండిగాని నావిశ్వాసమును మఱుగుపరచితినేని సత్యస్వరూపుడై, సత్యమయుడై యొప్పు నా దైవమునెడ ద్రోహము చేసినవాడ నగుదును. నా విశ్వాసమును దాచిపెట్టితినేని, ఈ నా విశ్వాస మొకవేళ పొరబాటగునెడల, నాపొరబాటును, తెలిసికొనగల సావకాశము నా కెన్నడును లభింపనే లభింపదు. జన్మనిగ్రహమును గుఱించిన సమస్యతోసహా, అనేకములగు నైతికసమస్యలయందు నా సలహాను నామార్గదర్శకత్వమును స్వీకరించు పెక్కండ్రు పురుషులును, స్త్రీలు నుండుట వలనను ఈ ప్రకటనను నేను చేయవలసి వచ్చినది. శిశుజననమును వశమున నుంచుకొని క్రమపద్ధతిని నడుపవలయునను సంగతి గర్భధారణను నివారించు సాధనములు మొదలగువాని ప్రయోగమును ప్రోత్సహించువారందఱును సమానముగ నంగీకరించిన సమస్యయే. అట్టి నిగ్రహమును బ్రహ్మచర్యము వలన సాధించుట కష్టసాధ్యమనుమాట నెవరును కాదనబోరు. అయినను, నరజాతి కృతకృత్యత బడయవలయు ననిన, ఆ పరమార్థమును సాధించుటకు మఱొక మార్గము లేదు. ఇప్పుడు మనము విమర్శింపబూనినవిధానము సర్వాంగీకారము బడయునెడల మానవజాతి నైతికముగా పతితమై పోవుననుట నా హృదయపూర్వక

మగు విశ్వాసముగ నున్నది. అట్టి సిద్ధాంతపక్షము వహించి వాదించునారలు తఱచుగా నా విశ్వాసమునకు భిన్నముగా చూపుచున్న సాక్ష్యము నెఱింగియు నే నిట్లు నొక్కి-వక్కా-ణించుచునే యుందును.

నేను మూఢవిశ్వాసిని గానని యే నానమ్మకము. సత్యము సత్య మగుట అది ప్రాచీన మగుటవలన కాజాలదు. మఱియు అసత్యని ప్రాచీనమైనదను కారణముచేత దానిని సంశయము తోడ జూచుటయు తగదు. కొన్నికొన్ని జీవనప్రధానధర్మము లను వ్యక్తుల జీవితములో నాచరించుట దుస్సాధ్యమను మాత్రాన నిర్లక్ష్యముచేసి త్రోసివేయను కూడదు.

బ్రహ్మచర్యము ద్వారమున జన్మనిరోధము సాధించుట కష్ట మనుట తథ్యము. అయినప్పటికిని, దాని సార్థకత్వమును మఱియు గర్భధారణనిరోధోపాయముకన్న నది శ్రేష్ఠతరమను మాటను ఆక్షేపింప బూనిన వారెవరును కాన్పించుటలేదు. సంభోగ క్రియమాత్రమునే పరమానందదాయకముగా నెంచుట కంటె, సంభోగ కార్యమునకు సంబంధించిన శాస్త్ర నియమ ముల అంతరార్థము సంపూర్ణముగ గ్రహించినయెడల, బ్రహ్మ చర్య సాధన చాల సులభమగునని నా అభిప్రాయము. జన నేంద్రియముల వ్యాపారప్రయోజనము వివాహితులయిన దంప తులు సాధ్యమగునంత యుత్కృష్ట సంతానమును గాంచుటే యనుట సువిదితముగ నున్నది. సంభోగ క్రియ కొఱకుగాక, తమ దాంపత్య ఫలముగా సత్సంతానము కలుగు కొఱకు మాత్రమే యిరువురు కాంక్షించునప్పుడే అట్టి సార్థకతచేకూర గలదు; మఱియు అట్టి సార్థకత మాత్రమే ఘటిల్లగావలయును.

కాబట్టి, అట్టిసత్సంతానసంకల్పము లేనటువంటి సంభోగము అధర్మముగ నెంచబడి నిరోధింపబడవలసియుండును.

ఇంద్రియనిగ్రహమునకు దోహదమొసగున దేదియు నేడు మనసంఘమున గోచరించుట లేదు. మనసు పెంచి పెద్దవారిని జేయుపద్ధతియే అందుకు వ్యతిరేకముగ నున్నది. తమ బిడ్డలు కుందేళ్ళవలె పెరుగుటే ప్రధానముగా పెట్టుకొని వారికి పెండ్లిండ్లు చేయుటే పరమార్థముగా తలిదండ్రు లెంచుచున్నారు. ఆపిల్లలు ఆడపిల్లలు అయినచో వారినైతిక క్షేమము చూచెడిదే లేదు. వీలువెంట వారికెంత వేగిరము పెండ్లిచేయుట పొసగిన అంత వేగిరము పెండ్లి చేసివేయుదురు. పెండ్లిక్రతువునో దీర్ఘతరము చేసి నిరర్థకమగు విందులతో జరుపుచున్నారు. గృహస్థుని జీవితము అతడు మొదటినుండి గడపుచుండిన జీవితమున కనుసరణముగా నడచుచున్నది. కడుదీర్ఘమగు నింద్రియలోలత యగవచ్చును. ఇంద్రియభోగముల కంతేని యవకాశములు నాటకనటుల పండువులు, సాంఘికము లగు వేడుకలు అమర్పబడియున్నవి. మన నెత్తిమీద పడవేయబడు వాఙ్మయము కూడ పశువ్యసనములకు దోహదమొసగునదిగ నున్నది. నవ్యవాఙ్మయమున చాలభాగము భోగమే విధాయకమనియు, పూర్ణవైరాగ్యము పాపమనియు బోధించుచున్నది.

సంభోగవ్యసనమును నిగ్రహించుట పూర్తిగ అసంభవము కాకపోయినను నిట్టిదశయందు దుస్సాధ్యమగుటలో విచిత్ర మేమున్నది ? ఇంద్రియనిగ్రహముద్వారమున జననిరోధము సాధించుట మిక్కిలి వాంఛనీయమును, యుక్తియుక్తమును, పూర్ణముగ నిరపాయకరమునైన యెడల మనసాంఘికాదర్శ

మును మన సంస్కారములను మార్చుకొనవలసియుండును. ఈపరమార్థమును సాధించుటకు ఇక్కడే మార్గము గలదు. బ్రహ్మచర్యపద్ధతియందు విశ్వాసముగల వ్యక్తులు తమంతటతామే ప్రారంభము చేయవలయును. అనుభూతమగు పూనికతో తమ పరిస్థితులను సంస్కరించుకొని నడుపవలయును. నేను గతవారము చర్చించియున్న వివాహాదర్శము వారికి పూర్ణముగ ప్రయోజనకరమగునని నా అభిప్రాయము. దానిని సక్రమముగ నర్థము చేసికొనినవారికి మనస్సు పూర్తిగ పరివర్తనము నందగలదు. అది ప్రత్యేకముగనే కొలదిమంది వ్యక్తులకు మాత్రమే యుపకరించునదికాదు. మానవజాతి యంతయు ననువర్తించు ధర్మముగా నది ప్రతిపాదింపబడియున్నది. దాని నుల్లంఘించినచో మానవుల పతితులగుదురు. నిరర్థకమగు బహుసంతానము పుట్టి తగిన శిక్ష ననుభవింపజేయును. రోగాలసమూహము నిరంతరముగా పెరిగిపోవును. పరమేశ్వరునిగూర్చి సమాధానము చెప్పవలసిన బాధ్యతగలమనుని నైతికజీవనము అధోగతిగూలిపోవును. గర్భనివారణసాధనమూలమున జన్మనిగ్రహము చేయగలిగి కొంతవఱకు క్రొత్తబిడ్డలు పుట్టకుండ నివారణ చేయగల్గుట సత్యమే. మఱియు సామాన్యజీవనోపాధి గలవారు ఆకలిబాధ తప్పించుకొనగల్గుటయు నిజమే. అయినను అందువలన వ్యక్తులకును, సంఘమునకును గల్గు ప్రమాద మనంతము. ముఖ్యముగా కామతృప్తి మాత్రమే కోరి అందుకొఱకే సంభోగముచేయు వారికి జీవితాదర్శము పూర్తిగా విపరీతరూపు దాల్చును. వారికి వివాహమున పవిత్రకర్మయనుభావమే లేకుండబోవును. ఇంతవరకును మహాదౌర్భాగ్యరాశిగా నెంచుకొనబడిన సాంఘికా

దర్శనములు తారుమారై పోవును. వివాహమును గూర్చిన ప్రాచీనాదర్శములను మూఢవిశ్వాసములుగా నెంచువారలకీ వాదన నచ్చదనుటతథ్యము. వివాహము నొకపవిత్ర క్రతువుగా నెంచునట్టియు, స్త్రీయన పశుసౌఖ్యములకనువగు నొకయుప కరణముగాక పురుషజాతికి మాతృదేవిగను, సంతానము యొక్క ధర్మరక్షణకర్త్రిగను భావించునట్టియు మానవులకు మాత్రమే నేను నావాదమును తెలుపుకొనుచున్నాను.

ఇంద్రియ నిగ్రహమునందు నాకుగల అనుభవమును, నా తోడి వారలయొక్క అనుభవమును నేను తెలిపినభావమును దృఢ పఱచుచుండెను. వివాహమును గుఱించిన ప్రాచీనుల ఆదర్శముతో పోల్చిచూచినందువలన గలుగు విశేషజ్ఞానమును బట్టి నావాదనకు ప్రబలమగు నాధారము చిక్కుచున్నది. నాఅభిప్రాయములో, గృహస్థులు పాలించు బ్రహ్మచర్యము నకు సహజమును, అమోఘమునగు ప్రామాణ్యము లభించు చున్నది. వివాహమెంత సుగ్రాహ్యధర్మమో ఈబ్రహ్మచర్యము గూడ అంత సుగ్రాహ్యమగు విషయముగ నున్నది. ఇతర మగుజన్మ నిగ్రహనిరోధోపాయ మెద్దియైనను వ్యర్థమును, వివేకశూన్యమునని తోచుచున్నది. జననేంద్రియము యొక్క యేకైకమును మహనీయము నగు ధర్మము సంతానమును గనుటయను భావము నొక్కసారి స్త్రీపురుషులందు నాటుకొనిన యెడల తదన్యమగు సంకల్పముతో సంభోగమున గలియుటచే గలుగు వీర్యనష్టము మహాపాతక మగుననియు, అందుమూల మున స్త్రీపురుషు లనుభవించు నుద్రేకము ద్వారమున అమూ ల్యమగు దివ్యశక్తి వినాశముచేయుట మహాపాతకమే యనియు

వారు గ్రహింపగల్గుదురు. ప్రాచీనశాస్త్రవేత్తలు వీర్యమునత్యం తము విలువగలదానిగా నిర్ణయించిన కారణమును, సంఘోప కారము నిమిత్తమై దాని నత్యంతప్రభావయుతమగు పవిత్ర శక్తిగా పరివర్తనము చేయుటగూర్చి శ్రద్ధ వహించుటకుగల కారణమును మనకుసులభముగా తెలియవచ్చును. స్త్రీగాని పురుషుడుగాని తనవీర్యమును సంరక్షించి పూర్ణముగ వశమున నుంచుకొనిన యెడల, తనస్థూలశరీరమును, మనోబలమును, ఆధ్యాత్మిక మహాత్మ్యమును అధిక ప్రభావమన్వితము చేసికో గల్గుననియు, అభ్యాసాధనంచేత దుస్సాధ్యము లగు మహిమల సాధింపవచ్చుననియు గొప్పసాహసముతో వారు ప్రవచించి యున్నారు.

అటువంటి బ్రహ్మచారులను సదృశులగు పురుషవరేణ్యులు పెక్కుండ్రు, కాకపోయిన నొక్కడైనను కానంపడేలయని పాఠకులు విభ్రాంతి చెందకుండ్రు గాక. మనచుట్టును, నేడు మనముగాంచు బ్రహ్మచారులు చాల లోపములు గలవారుగ నున్నారు. వారిలో నగ్రగణ్యులు నయితము తమ శరీరముల నిగ్రహించినవారుగ నుంటున్నారుగాని మనస్సును వశము చేసికొనినవారుగ లేరు. వారు ప్రలోభముల కభేద్యులుగా లేరు. అందుకు హేతువు బ్రహ్మచర్యము సుదుర్లభమగుటవలనగాదు. వారువసించు సంఘవాతావరణ ప్రతికూలముగ నున్నది. నిష్కపట ముగ సాధనల సాగించువారిలో గూడ నధికసంఖ్యాకులు పోర బడి, యొక్క సంభోగవ్యసనమును మాత్రము నిగ్రహింప సమ కట్టుదురేగాని, నరుని భ్రష్టుని జేయు తక్కిన వ్యసనముల నన్నిం టిని వశముచేసికొనిన తప్ప తమకుసిద్ధి సమకూడజాలదని

గ్రహింపకున్నారు. బ్రహ్మచర్యము సామాన్య స్త్రీగాని, పురుషుడుగాని సాధించుటకు దుర్లభమైనదిగాక పోయినను ఏ శాస్త్రము నందేని ప్రవీణతసంపాదింప దీక్షవహించిన యత్నము అందులకై దీసికొనవలసిన శ్రద్ధకంటె తక్కువశ్రద్ధ ఇందుకు చాలుననుకోరాదు. మనమిప్పుడు ప్రస్తావించు బ్రహ్మచర్యమనగా జీవశాస్త్ర నైపుణ్యమని అర్థముసుడీ !

## అమెరికా నిదర్శనము

అమెరికా సంయుక్తరాష్ట్రముల నుండి యొక పత్రికాధిపతికి సింప్సన్ కన్య యిటుల వ్రాయుచున్నది:—

"సహజ వినిర్మల దృష్టి బలిమి విషయపరిజ్ఞానము ప్రకటించు శ్రీ గాంధీగారి 'జన్మనిగ్రహ' మనెడు వ్యాసమును జూచి మహానందము నందితిని. ఇరువదేండ్ల క్రిందట 'జన్మనిగ్రహమును' నిరాకరించియుండిన కాలమున శ్రీ గాంధీజీ అమెరికాను దర్శించియుండి మరల నిప్పుడు 'జన్మనిగ్రహ సాధనలను' పూర్తిగ వినియోగించుచున్న యీ సమయమునను ఆయన అమెరికాకు వచ్చి చూచునెడల, ఆ సాధనల వలన నైతిక భ్రష్టత్వము వాటిల్లుచున్నదని తెలిసికొనగల్గును. అయినను దానిం గుఱించి యొకరిని ఒప్పించ నసమర్థుడే యగును. ఏమన, దాని మూలాననే నైతికదృష్టియు, ఆధ్యాత్మిక దృష్టియు నష్టమగుటచే ఉత్తమము లగు నైతి కాధ్యాత్మికదృష్టితో విషయ విచారణచేయుట ఆ సిద్ధాంతావలంబుల కిప్పుడు సాధ్యపడదు. ఈ సందర్భములో పాశ్చాత్యులను భారతదేశీయు లనుకరించుచో అమూల్యములును, సుందరములు నగు రెండు భూషణములను వారు తప్పకుండ గోల్పోవుదురు. బిడ్డల యెడ ననురాగము ఒకటి; జనకత్వము నెడ పూజ్యభావము రెండవది. అమెరికా యీ రెంటిని గోల్పోయినది. కాని ఆ సంగతిని గ్రహించుటలేదు. 'బ్రహ్మచర్య' మన నేమియో వివరముగ (మీ పత్రికయందు) ముద్రింప

గలరా? అనేమని నన్ను పల్కు గడుగుచున్నారు. నాకు కొంచెముగ అర్థమగుచున్నను ఇతరులకు వివరించి చెప్పలేకున్నాను. వందనములు.”

ఈ సాహిత్యమునను, దీనిని పఠించు స్త్రీగాని, పురుషుడుగాని తన కిష్టమువచ్చిన విలువ నీయదగును. అయినను గర్భధారణ నిరోధోపాయముల వినియోగము చేయుచు లాభముపొందుచున్నామను వారి వాదనకన్న, వాని వినియోగమునుఖండించు వారి సాహిత్యము పటుతరమైనదని నా మనవి. కారణము స్పష్టమే. పిల్లలు పుట్టకుండనాపగల్గుటే లాభమనెడు అర్థమున దాని నెవరును కాదనరు. కాని, వాని వినియోగమువలన నైతికముగ అనర్థములకు మితిలేదనుటే ఖండన చేయువారు వచించునది. సింప్సను కన్య అట్టి యనర్థమును కొంత విశదము చేసినది.

ఇక ‘బ్రహ్మచర్యము’ యొక్క నిర్వచనము, అర్థము విచారింతము. దాని ధాత్వర్థమిట్లు చెప్పవచ్చును. భగవంతునితో, బ్రహ్మముతో అనుసంధానమును గూర్చు వర్తనము బ్రహ్మచర్యము.

ఈ వర్తనమున సకలేంద్రియముల సంపూర్ణ నిగ్రహము ఇమిడియున్నది. ఇయ్యదియే సత్యమును సమన్వయసిద్ధమునగు అర్థము.

జననేంద్రియము యొక్క నిగ్రహమని స్థూలముగా ప్రజాసామాన్యము అర్థము చేయుచున్నారు. ఈ సంకుచితభావము బ్రహ్మచర్యము యొక్క పతనమునకు హేతువగుచున్నది. మఱియు బ్రహ్మచర్యసాధనను దుర్లభము చేసినది. ఇతరములగు

నింద్రియముల నన్నింటిని నిగ్రహించినగాని, జననేంద్రియ నిగ్రహము అసంభవమగును. ఇంద్రియములన్నియు పరస్పరాధారము కలిగియున్నవి. అపరప్రకృతి క్షేత్రమున, మనస్సు సయితము ఇంద్రియములలోనే చేర్చబడుచున్నది. మనస్సు మీఁద నిగ్రహము లేనిచో, కేవలము కాయికమగు నిగ్రహము (స్థూలాంగముల నిగ్రహము) స్వల్పకాలము సాధ్యమయినను గూడ అల్పఫలమిచ్చునదిగనో లేక నిష్ఫలమైనదిగనో మాత్ర ముండును.

## గర్భధారణ నివారణము

ఒక రిట్లు వ్రాయుచున్నారు:—

"ఇటీవల 'హరిజన' పత్రికలో ప్రకటింపబడినట్టి శాంగరుసతికిని శ్రీ గాంధీజీకిని జరిగిన సంభాషణ విషయమును గూర్చి నే నొకింత చెప్పదలచి నాడను.

ఆ సంభాషణలో నొక ప్రధానాంశము వదలివేయబడినది. మానవుఁడు ముఖ్యముగా కళాప్రియుఁడనియు, కల్పనాధురంధరుఁడనియు గుర్తింపబడి యుండలేదు. కేవలము అవసరముల దీర్చుకొనుటతోడనే అతఁడు తృప్తిని బడయజాలఁడు. వానికి సౌందర్యము కావలయును. చిత్రవర్ణములు, రమణీయత సయితము అవసరములే. 'నీకడ నొక పైసా మాత్రమే యున్నచో దానితో నొక రొట్టెముక్కను కొనుక్కొనుము. రెండు పైస లున్నయెడల నొకదానిని పెట్టి రొట్టె రెండవదానిని పెట్టి పుష్పమును కొనుము.' అని మహమ్మదు ప్రవక్త వచించియున్నాఁడు. ఆ వచనమునం దొక గొప్ప మనోధర్మ మిమిడియున్నది. నరుఁడు సహజముగనే కళాప్రియుఁడనెడు సత్యమందు గలదు. కాబట్టియే అతఁడు కేవలము తన శరీర రక్షణమునకు సరిపోయినంతటితో తృప్తిపడక తన వస్తువు అంతకు మించిన దానిగా జేసికొనుటకై

తంబాలుపడుట మనకు కాన్పించుచున్నది. అతడు ప్రతి అవసరము తోడను కళాభిరుచిని ప్రవేశపెట్టుచున్నాడు. మరియు అందునిమిత్తమై బారువుల కొలంది రక్తమును ధారవోయుచున్నాడు. నరునియందు గల సహజ కల్పనానురక్తి; వాని కష్టములను, వాని సమస్యలను సతతము పెంపుచేయుచు మరల మరల వానిని పరిహరించుకొను నిమిత్తమై వానికి ప్రేరణను కల్పించుచున్నది. రూసో, రస్కిను, టాల్‌స్టాయి, థోరో, గాంధీ మున్నగు మహనీయులు వాంఛించునటుల నరుడు నిరాడంబరుడై మనజాలడు. మరియు అనివార్యమై వచ్చు యుద్ధమును సయితము అతడెదుర్కొనవలసియున్నాడు. ఆ యుద్ధమును గూడ నరుడొక ఘనతర కళగా పరిణమింపజేసియున్నాడు.

ప్రకృతి సాదృశ్యమును నరునికి పల్మరు బోధించుట వ్యర్థము. ఏమన, నరుని స్వభావమునకు అదెంతమాత్రమును సరిపడునది కాదు. ప్రకృతి నివర్ణనమును చూపువారు సయితము ఆ ప్రకృతిలోనే కొండలు, కొండచరియలు, కుసుమవనములు మాత్రమే గాక వరదలు, ఉప్పెనలు, భూకంపమును గూడ నుండు ననుటను మరచుచున్నారు. "చిత్రకారుని దృష్టిలో ప్రకృతి మనకు ఆదర్శస్వరూపము కాదు. అందలి వ్యాప్తిదశలు, విషమదశలు రిక్తదశలు నన్నియు గోచరించుచున్నవి. ప్రకృతి యనునది యొక యవాంతరసంఘటనము. ప్రకృతిని ప్రమాణముగా దీసికొని విచారణకు పూనుట పనికిమాలిన పని యని నాకు దోచుచున్నది. అత్యల్పసంఘటనల గాంచి వినమ్రతవూని, తలవంచి ప్రకృతియొక్క పాదధూళిని శిరమున దాల్చుట పూర్ణకళావతంసునికి అర్హకార్యము గాజాలదు. నేయగకము బుద్ధిమంతు లుందురు. వారు కళాశూన్యులు. కనబడిన దానిని కనబడినటుల పాటింప నెంచువారు. అట్టి కళావిహీనుని కలని ప్రయోజనమును సయితము పాటింప నెంచువాడు ఏరకమున కారకముగా వేరుపరచి చూడవలసియుండును." అని విగ్రహభంజకుడగు సీడ్లీ మహాశయుడు తెలిపియేయున్నాడు. అడవిజంతువులు తమ యొడలు నిలుపుకొనుట కవసరమగుటంబట్టి పచ్చిమాంసమునే పీకికొనితినుట

మన మెఱుంగుదుము. వానికి రుచి తెలియదు. పశువులు స్త్రీ ఋతువులు కలవని యెఱుగుదుము. ఆఋతువు తప్పినచో అవి కలియుటయే యుండదు. కాని, మనతత్త్వవేత్త పలుకులలో చెప్పవలెనన "సహజముగా 'పూర్ణకళాప్రియు'డై జనించిన నరున కట్టి స్థితి అనర్హ"మైనదని వచింపవలసి యుండును. సంతానమున కవసరము తీరిన తోడ్తోడనే సంభోగప్రవృత్తి యంతరింపవలయుననుట అనగా సంతానకాంక్ష కలిగినప్పుడు మాత్రమే సంభోగము ధర్మమగునని శాసించుట మనతత్త్వవేది వచించునట్టుల మితిమీరిన పిసినితనమును, హద్దు నెఱుగని నైజానుసరణమును, చూచిన దానిని చూచినట్టుల విచక్షణారహితముగ పాటించుటయును నగును. అది నరుని ప్రస్ఫుటమగు కళాభిరతికి వ్యతిరేకము. కాబట్టి నరుని సంభోగకాంక్షకు విలువగట్టుకొనుటకు వేఱొక దృక్పథమును గలదు. అది జాతివృద్ధివాంఛకు కట్టుబడి యుండునది కాదు. హావెలక్ ఎల్లిసు, మేరీ స్టోప్సు మొదలగు ప్రామాణికులీయంశమును విశదీకరించి యున్నారు. శరీరమును సాధనముగా తీసికొనకుండ ప్రత్యేకముగ మన మాత్మను చేరజాల మంతకాలము సంభోగకాంక్ష లేక రతిప్రీతి ఆత్మలో జనించునదేయైనను శరీరసంయోగము లేనియెడల అది అసంపూర్ణముగనే యుండిపోవును. అటువంటి సంయోగముతో తాళుకొను విషయము పూర్తిగ వేఱు సమస్య. ఈ సమస్యకొఱకుపకరించునది జన్మనిగ్రహోద్యమము. బ్రహ్మచర్య మనగా ఆత్మయొక్క పునఃపరివర్తన మన్నమాటే. కాని వేఱుకాదు. ఈ పరివర్తనభారము బాహ్య (స్థూల) శరీరశిక్షణముపై నాధారపడునెడల మనము నిరీక్షించు సత్ఫలముల నన్నింటిని పూర్ణముగ పొందగల్గుదు మను నమ్మకము మాకు లేదు. మఱియు పిల్లలు పుట్టుటను నిగ్రహించు నుద్యమమైనను దృఢమగు మనస్సంకల్పముయొక్క ఆధారము లేకుండ సఫలము కాజాలదు.

ఇంకొక విమర్శవాక్యముతో ఈలేఖ ముగింతును. 'బ్రహ్మచర్య' మని పేర్కొనబడు ఆత్మనిగ్రహశిక్షణమును నేను తిరస్కారము చేయువాడను గాను. సంభోగవాంఛానిగ్రహసాధనను పూర్ణావస్థకు దెచ్చిన కళగదాయని

దానిని నే నెంతయు మెచ్చుకొందును. జీవశాస్త్రముతో లేక (నీడ్జి మహాశయుడు నిర్వచించు విధమున) పూర్ణ జీవనముతో అనగా సకలజీవితప్రయోజనముల సక్రమ ప్రణాళికతో ఇతర కళలగూర్చిన పూర్ణ విజ్ఞానమునకు జోక్యము గల్పించుట సహింపరాని విధముననే బ్రహ్మచర్యాదర్శముయొక్క ప్రయోజనములు ఇతర జీవనప్రయోజనములను నెట్టివేయుటను నేను సహింపలేను. అంతకన్నను అత్యధిక జనాభివృద్ధివంటి సమస్యను పరిష్కరించుటకు బ్రహ్మచర్యాదర్శము సాధనము కాగలదనుటను సహింపజాలను. దాని నొక భీకరపిశాచముగా చేసివేసినాము. 'యుద్ధశిశువుల' విషయము వినియున్నారముగదా! అలాంటి యుద్ధశిశువులు పుట్టుటకు కారకులైనంత మాత్రాన తమ రక్తమును ధారవోసి మాతృదేశమునకు విజయము సంపాదించిన యోధవరులను గౌరవించుటలో మనము వెనుదీయవలసినదేనా! అటు లెవడును చేయడు. ప్రశ్నోపనిషత్తువంటి ప్రమాణ గ్రంథములు ఇటువంటి ప్రయోజనములను గమనించియే 'బ్రహ్మచర్య మేవ తద్యద రాత్రౌ సంయుజ్యతే' అనగా రాత్రి కాలమందు మాత్రమే జరుగు సంభోగము బ్రహ్మచర్యమే యని (పగటి కాలమందు అస్వాభావికముగా జరుగు రతిక్రీడనుండి వేఱుగ పాటించి) ప్రశంసించి యుండును. ఇందు స్వాభావిక మగు సంభోగమునే బ్రహ్మచర్య మని వర్ణించినారు. పూర్ణజీవిత ప్రయోజనముల ప్రణాళికను మనము తారుమారుచేసివేసిన పిమ్మట ఆ బ్రహ్మచర్యమునకు కఠిన సంకుచిత భావము నంటుగట్టినాము.'

ఈ పై లేఖాంశములను నేను సంతోషముతో ప్రకటించుచున్నాను. అతిప్రసంగముగాని, దూషణకాని, దోషారోపణముగాని లేనటువంటి ఈలాంటియుత్తరము దేనినైనను అటులనే చేయుదును. పాఠకుడు సమస్యయొక్క పరిష్కారమును దేల్చుకొనుటకు యిరుపక్షముల వాదస్వరూపమును తెలిసికొనవలసియుండును. శాస్త్రసమ్మతమై, ఉపకారకరమై అనేకులు సుప్రసిద్ధపురుషుల ఆమోదము బడసిన యొకవిషయముదాని

అనుకూలపక్షమును గ్రహింపవలయునని నే నెంతగా ప్రయ త్నించుచున్నను, నాకు వెగటు దోషజేయుటకు గల హేతు వేమియని తెలిసికొనుటకై నేనును ఆతురపడుచున్నాను.

వివాహామే ఆధారముగా జరుగు సంభోగక్రియ ఆసంగ మించువారికి స్వతస్సిద్ధముగానే క్షేమకరమై మేలు గూర్చు నని నాకు తృప్తికలుగునంతగా రుజువగుట లేదు. నా అను భవమునుబట్టియు, నామిత్రుల యనుభవమునుబట్టియు అందుకు వ్యతిరేకమగు నిదర్శనముల నే నెన్నేని చూపగల్గుదును. మాలో నొక్కరేనియు మానసికముగగాని, ఆధ్యాత్మికముగ గాని, శారీరికముగగాని యేలాటి లాభమును దానం బడసి నటుల నే నెఱుగను. క్షణకాలపు తృప్తి, ఆనందము కలుగు ననుట సత్యమే, కాని వెనువెంటనే నిస్త్రాణ ఘటిల్లుచుండును. ఆ నిస్త్రాణ యొకింతసర్దుబాటుకాగనే వెంటనే మఱల సంభోగ వాంఛ రేకెత్తుచుండును. నే నెల్లప్పుడును మనస్సాక్షిపూర్వ కముగా పాటుపడువాడ నైనను భోగలాలస నాపనికి భంగ కరముగ నుండెడిదను నాఅనుభవమును విస్పష్టముగా నిప్పు డును జ్ఞప్తికి తెచ్చుకొన గల్గుచున్నాను. ఈ భంగపాటుయొక్క పరిజ్ఞానమే నన్ను బ్రహ్మచర్యము నవలంబింప జేసినది. సాధా రణముగా దీర్ఘకాలము నాకు జబ్బు చేయకుండ నే నారో గ్యము ననుభవింపగలుగుటకు మానసికమును, కాయికమును నగు శక్తిని, కార్యదక్షతను నేను చూపగల్గుటకును నాబ్రహ్మ చర్యదీక్షయే ఆధారమని నే నేలాటి జంకును లేకుండ వచింప గలను. నన్ను ప్రత్యక్షముగ నెఱింగినవారు ఇది అపూర్వమని వింతపడు చుందురు.

నాకుత్తరము వ్రాసిన లేఖకుడు తాను చదివిన దానికి విపరీతార్థకల్పనము చేయుచుండెనని నా భయము. నరుడు నిస్సందేహముగా కళాప్రియుడే. కల్పనాధురీణుడే. నిస్సందేహముగా వానికి సౌందర్యము వర్ణవిలాసము కావలసినదే. వానికి స్వభావసిద్ధమగు కళాభిరుచియు, కల్పనాచాతుర్యమును వానికి విచక్షణాజ్ఞానము నొసగియున్నవి. మెఱుపులీను రంగుల రాశి సౌందర్యము కాదని అతడెఱుంగును; ఏ విషయానందమైనను ఉత్తమమే యని యతడు తలపోయడు. నరుని కళాదృష్టి ప్రయోజనమందు ఆనందము నెట్లు గనుగొనుటో వానికి తెలుపుచుండును. అందువలననే ప్రాథమిక పరిణామదశలందే మన మీనాడు చేయునటుల తినుకోరికమాత్రాననే తినుటకు మారుగా బ్రతుకునిమిత్తము తినుట మానవుడు నేర్చినాడు. కొన్ని దశాంతరములు గడచినపిమ్మట కేవలము ప్రాణమునిల్పుకొనుటకే జీవించుటలో ఆనందముగాని, సౌందర్యముగాని లేదనియు, తోడిజీవులకు ఉపకృతి సల్పుటకును, తద్ద్వారా సృష్టికర్తను సేవించుటయు విధియని గ్రహించినాడు. అదేతీరున సంభోగసుఖమును గుఱించి పర్యాలోచనము చేసి తక్కిన యింద్రియవ్యాపారము లన్నింటికి వలెనే జననేంద్రియవ్యాపారమునకును సద్వినియోగము, దుర్వినియోగము ననునవి గలవని కనిపెట్టినాడు. ఆ యింద్రియముయొక్క నిజమగుధర్మమును సత్ప్రయోజనమును, సంతానముకొఱకే దానిని వినియోగించుటయందే గలదని గ్రహించినాడు. తదితరప్రయోజనమేదైనను వికృతమని యెఱింగినాడు. మఱియు నది వ్యక్తికిని, జాతికినిసయితము ఘోరానర్థముల గూర్చు ననియు తెలిసి

కొసినాడు. ఈ వాదమును సుదీర్ఘముచేసి నేను చెప్పుటనవ సరము.

ఈ యుత్తరమును వ్రాసిన విలేఖరి అవసరములబట్టి నరుడు కళను నిర్మించునని చెప్పినది సమంజసముగనున్నది. అవసర మనునది ఉపజ్ఞజనకమే కాదు; కళాజనకము నగును. కాబట్టి అవసరము ఆధారముగా ఉద్భవము కానట్టి కళను సర్వత్రా గ్రాహ్యముగా నెంచదగదు.

ఇంకొక విషయము. ప్రతికోరికకును అవసరమనెడు పేరు పెట్టి గౌరవింపదగదు. నరుని జీవితము శిక్షణదశగా నెన్న వలయును. ఆకాలమునందు దుష్టశక్తులు, శిష్టశక్తులు రెండును వానిపైన నెక్కి నాట్యము సలుప జూచుచుండును. దుష్ప్రే రణలు వాని నలముకొనుచుండును. ఈదుష్ప్రేరణల నెదిరించి పోరాడుటలో తన పౌరుషము నతడు ప్రదర్శింపవలసియుండును. తనయూహాకల్పితులగు బాహ్యశత్రువులతో యుద్ధముచేయు నతడు యోధుడుకాడు. సామాన్యయోధుడుతనఅభ్యంతరమున చెలరేగు పెక్కండ్రుశత్రువుల నెదిరించుటకు తనచిన్న వ్రేలినై నను కదల్పజాలడు. అంతియే కాదు. వానిని మిత్రములుగను పాటించును. 'నరుడు యుద్ధము సాగించియే తీరవలయును.' అయినను 'దానివలన గలుగు సహజసంఘటనముగా ఆయుద్ధ మునే నరుడొక ఘనతరకళగా పరిణమింపజేసియున్నా'డని విలే ఖరివ్రాసినది పొరబాటు. యుద్ధకళ నత డింకను నేర్చియుండ లేదు. మనపూర్వులు యజ్ఞమన నేమిటో తెలియక పొరపడి తమయందలి దుర్వ్యసనములను బలియిడుటకు మారుగా తోడి అమాయిక జీవులను బలిపెట్టినతీరున, మఱియు అనేక లీనాడు

చేయుతీరున మిథ్యారణమును సత్యమగు రణమునుగా నరుడు భ్రమించుచున్నాడు. యథార్థమగు రణకళను మన మింకను నేర్వవలసియే యున్నాము. అబిసీనియా ప్రాంతమునందు నేడు జరుగుయుద్ధమునందు కళగాని, సౌందర్యముగాని లేనేలేదు. మన విలేఖరి తానుజూపు నిదర్శనములకు విస్తారపు పేర్లనిడి యున్నాడు. గూసో, రస్కిను, థోరో, టాల్‌స్టాయి యను వారలు తమతమ కాలములలో కళావతంసాగ్రేసరులైయై యుండిరి. వారు మృతులేయైనను, మనలో ననేకులము చచ్చి దగ్ధులై విస్మృతి నడంగిపోయిన యనంతరము నయితము వారు సజీవులై చిరస్మరణీయులైయే యుండగలరు.

మన విలేఖరి 'ప్రకృతి' అను శబ్దమును దుష్ప్రయోగము చేసినట్లు కనబడుచున్నది. నరుడు 'ప్రకృతి' ని అనుకరింపవలె ననినప్పుడు అతనిని సర్పములవలె వర్తింపుమనిగాని, లేక మృగరాజువలె నయితము వర్తింపుమనిగాని ఆహ్వానించుట తగదు. నరుడు మానవజాతి యందలి యుత్తమోత్తమ లక్షణ ముల పరిశీలింపవలయుననియే అర్థము; అనగా అతని సుపరి ష్కృత స్వభావమెట్టిదిగా నుండునో గమనింపవలయునను టే. బహుశః సుపరిష్కృత స్వభావమన నెట్టిదో తెలియుట చాల శ్రమతరమై యుండవచ్చును. ప్రాచీన ప్రవక్తల ప్రమాణములను పేర్కొనుట నేడు అపాయకరముగ దోచుచున్నది. నీట్జేని, ప్రశ్నోపనిషత్తును నయితము ప్రస్తావనలోనికి దింపుట అవసర మని విలేఖరికి నేను సూచింపగోరెదను. ఈ సమస్య ప్రాచీన ప్రమాణముల యుధార్థమును దాటిపోయినదని నా అభిప్రా యము. మన విచారణాంశమునుగూర్చి నిర్ణేయమోటమగు

తర్కవాదమేమి చెప్పుచున్నది? జననేంద్రియము యొక్క యథార్థమగు వినియోగము సృజనకర్మకుమాత్రమే కట్టువడి యుండవలెననియు, తదితరమగు వినియోగము దుర్వినియోగ మనియు చెప్పుట యుక్తమా? అయుక్తమా? యుక్తమగు నెడల, సద్వినియోగమును హర్షించుటలోను, దుర్వినియోగ మును నిరాకరించుటలోను చూపట్టుకష్టములు శాస్త్రసమ్మత మగు అన్వేషణమునకడ్డు నిలువదగదు.

## సంస్కరణాభిలాషిణులు

ఒక సోదరితో నాకు జరిగిన సంభాషణనుబట్టి చూడ గర్భ నిరోధసాధనల వినియోగమును గురించిన నాయభిప్రాయము బాగుగ స్పష్టపడినట్లు లేదని నేను భయపడుచున్నాను. అవి పాశ్చాత్యదేశములనుండి వచ్చినవను కారణముచేత నేనట్లు అభిప్రాయపడుట లేదు. కొన్ని పాశ్చాత్యవస్తువులు అక్కడి వారికి లాభదాయకము లగునటులనే నాకును లాభకర మగు నని నాకు తెలిసినప్పుడు కృతజ్ఞతాపూర్వకముగా నేను వానిని స్వీకరించుచున్నాడను. గర్భనివారణ సాధనముల నేను వల దనుట వాని మంచిచెడ్డలను బట్టియే.

బిడ్డలను కోరకుండ తమభర్తల సంభోగవాంఛను తీర్చుటకు అంగీకరించు వివాహితస్త్రీలు మాత్రమే వినియోగింపవచ్చునని గర్భనివారణసాధనల ప్రోత్సహించువారిలో బుద్ధిమంతులు నియామకము చేయుదురని నేననుకొనుచున్నాను. నరజాతియం దిటువంటి కోరిక స్వభావవిరుద్ధమనియు, అట్టి కోరికను తృప్తి పఱచుకొనుట నరజాతియొక్క ఆధ్యాత్మికోన్నతికి భంగకర

మనియు నా అభిప్రాయము. ఈ అభిప్రాయమును ఖండించుటకు, ఇతర సాక్ష్యములతోపాటు, ఈ దిగువనుల్లేఖించిన 'లార్డు డాసను' గారి సాక్ష్యము నుదహరించుచున్నాను :—

'ప్రపంచములో చెలరేగి ప్రాబల్యము చూపుచున్న శక్తులలో కామ మొకటి. అనేక ప్రధానమును నిరాఘాటమునగు సహజగుణము. దాని ప్రభావమునకు తలయొగ్గి తీరవలసినదే. దాని నణంచివేయ నెంతువా? నీ తరము కాదు. దాని నుపయోగకరమగు మార్గములకు నీవు మరలింపవచ్చునే గాని, దాని విలాసమునకు అవకాశ మొసగక తప్పదు. మరియు నట్టి అవకాశము చాలకపోయినను, నిరోధింపబడినను అది విపరీతమార్గములం ద్రొక్కి విజృంభించును. ఇంద్రియనిగ్రహమునకును పరిమితియున్నది. ఏ సంఘమునందైనను వివాహము దుర్లభమైనను, లేక ఘటిల్లుటలో ఆలస్యము జరిగినను వ్యభిచారము లసంఖ్యాకములై పెరిగిపోవుట అనివార్యము. శరీరముల సంగమము, మనస్సు లొకటియు, ఆత్మలొకటియు కలియుకతో సహా జరుగుట మంచిదని యెల్లరు నంగీకరింతురు. పిల్లలను గాంచుట ప్రప్రథమధర్మమనియు నందరొప్పుకుందురు. కాని పిల్లలగనవలయునను సంకల్పముగాని, యుద్దేశ్యము గాని లేకుండ సంభోగకార్యము కాయికమగు మనకామ వికారప్రతిఫలముగా లెకలేనన్ని తడవలు జరుగుచుండుటలేదా? కాన మనమందరము దోషులమేనా? యథార్థజీవనధర్మములతోడి పరిచయము 'చర్చికి' (అనగా ఆధ్యాత్మిక శాసనముల నిరూపించువారికి) లేకపోయిన హేతువుచే గాదా ఆ 'చర్చికిని' (ఆశాసనకర్తలకును) ప్రజలకును నడుమ పెద్ద అఖాత మేర్పడినది? ఏశాసనమైనను, ఆధ్యాత్మబోధకుల శాసనమైనను సరియే, యెల్లరకు దెలిసినదై సాహసముతో నిరూపింపబడినదై యథార్థవిషయముల కనుసరణమైనదై పరిగినగాని యువకులభక్తిని అంగీకారమును పొందజాలదు.

పిల్లల గనుట గాక, కామమునకు స్వతంత్రమైన ప్రయోజనముకలదు. అది ఆరోగ్యమున నొక ప్రధానాంశము. వివాహమున కానందము గూర్చి పది. కామము దైవదత్తమందు లేని దాని వినియోగమును నేర్చుకొనుట

క్షేమకరముగాదా! దాని క్షేత్రములోనిది ఒకపక్షము వారికేగాక, ఇరుపక్షములవారికిని కాయిక తుష్టి నిచ్చులాగున ఆచరింపవలసి యున్నది. ఇరువురు జీవులు కలసి భోగించి, పరస్పరము నొండొరులు పంచుకోగల సౌఖ్యము, వారి సాహచర్యబంధమును దృఢపఱచి, వారి వైవాహిక బంధుత్వమును చిరస్థాయి చేయగలదు. అనేకములగు వివాహములు మితిమీరిన కామము మూలముననగాక, చాతుర్యములేనట్టియు, తనివితీరనట్టియు కామమువలన భగ్నమగుచున్నవి. కామమనున దొక దివ్యసంపద. కొఱగాని పురుషు లనేకులు కామభరితులై యుందురు. కామరహితమగు సతిపతుల యనురాగము రసశూన్యమును, నిర్జీవమునై యుండును. మితిమీరిన కామోద్రేకము గూడ అత్యాహారవాంఛవంటిదే. కాయికమగు అత్యాచార మగును.

ఇక అత్యంత ప్రధానమైన జన్మనిగ్రహ సమస్యయొక్క విచారణకు మరలెదముగాక. జన్మనిగ్రహమనునది స్థిరపడిపోయినది. ఆసంస్థ ప్రాముఖ్యము వహించినది. మంచికో చెడ్డకో దాని నంగీకరింపక తప్పదు. ఎన్ని దూషణలు బయలుదేరినను దానిని అవి తొలగింపజాలవు. జనులు తమ సంతానమునకు పరిమితిపెట్టుకొనుటకగు కారణములు కొందరి సందర్భములో స్వార్థప్రేరితములుగ నున్నవి. కాని, యనేకుల సందర్భములలో మాననీయములును, సమంజసములునై యున్నవి. పెండ్లిచేసికొని జీవనపు పోరాటమునకు సమర్థులగు సంతానమును కని, పెంచవలయు ననెడు కోరిక పరిమితమగు సంపాదనవలనను, జీవనపు వ్యయమువలనను, పన్నుల భారమువలనను విధిగా మార్పుచెందుచున్నది. మఱియును, విద్యావతులగు స్త్రీలయందు జీవనభారమును పంచుకోవలెననియు తమ భర్తల యుద్యోగములలో పాల్గొనవలెననియు కోరిక కలదు. తఱుచుగా గర్భమును ధరింపవలసినచో అది సాగదు. గర్భనివారణ సాధనములు లేనిచో అక్రమసంభోగములును అందువలన దుష్ఫలితములును తప్పవు. వివాహములకు అవరోధములు కల్పించుచు, అక్రమ సంభోగములను దూషించుచుండుట కొరగానిపని. 'జన్మనిగ్రహము అవసరము కావచ్చును. కాని ధర్మసమ్మతమగు జన్మనిగ్రహమనగా ఐచ్ఛికమగు

నింద్రియ నిగ్రహమే' అని పలువురు పలుకుచున్నారు. సరే. అటువంటి ఇంద్రియనిరోధము ఫలప్రదము కాదు; ఒకవేళ ఫలప్రదమగునన్నను సుసాధ్యము కాజాలదు; మరియు ఆరోగ్యమునకును ఆనందమునకును భంగకరమగును. ఒక కుటుంబమునకింత సంఖ్య యేనలుగురో యని హద్దు పెట్టునెడల, చాలకాలమునకైనను అది ఇంద్రియనిరోధమును విధించు నంతగా దంపతుల మీద సంభోగనిషేధమును పెట్టి నిర్బంధించినట్లే యగును. ఆర్థిక కారణముల వలన ఆ నిషేధము వివాహము జరిగిన ప్రారంభకాలమున, భోగవాంఛలు ప్రబలముగా నుండు దశయందు మరింత బాధకరముగ నుండు ననియు మరియు నట్టి నిషేధాజ్ఞాపాలనము సామాన్యప్రజలు నిర్వర్తింపజాల రనియు నేను గట్టిగా చెప్పగలను. ఆ ఆజ్ఞాపాలనమును చేయవలయు నను పట్టుదల పూనునెడల, ఆరోగ్యమునకును ఆనందమునకును భంగము వాటిలు నంత ప్రయాసను కల్పించి నీతివర్తనమునే నాశనము చేయునంతటి విపత్తును తేకూర్చును. అది విపరీతము, విడ్డూరము నగును. దాహముచే దహించుకొని పోవుచున్న వాని కడ చల్లని జలము నుంచి త్రాగవలదని నిషేధాజ్ఞ నైన చేయవచ్చునేమోగాని, ఇంద్రియనిగ్రహము వలన జన్మనివారణము సాధించు మనుట వ్యర్థమగును. ఒకవేళ సాధనలో పెట్టినయెడల వినాశకరమై యొప్పును. అది స్వభావవిరుద్ధమును, అచ్ఛమగు నవినీతియు ననవలయును. స్వాభావిక శక్తులను స్వాధీనము చేసుకొని వానిని మానవుని యిచ్ఛకును, వివి యోగమునకును అనుకూలమగు రీతిని పరివర్తనము చేయుట నాగరిక మగును. ప్రసవ సమయమున మత్తుమందులను ప్రథమమున ప్రయోగించినప్పుడు గూడ, వాని ప్రయోగము దుష్టమనియు స్వభావవిరుద్ధమనియు, గందర గోళము సాగినది. ఏమన, స్త్రీ వేదన ననుభవించుటకే యేర్పడిన దట! కల్పిత సాధనల మూలమున పిల్లలు పుట్టకుండ నిలుపుట అంతకు మించిన దుష్కర్యము గాని, స్వభావవిరుద్ధ కర్మ గాని కాదు. జన్మనివారణ సాధనల ప్రయోగము పుణ్యమే; దుష్ప్రయోగము పాపమగును. నవ్య విజ్ఞానమును గుర్తించి, నూతన ప్రాపంచికావసరముల గమనించి, ప్రయోజనమున పాటి దప్పిపోయిన పాత సంప్రదాయముల బంధనముల సడలించుకొని, మతగురు

వులు కొందఱితరులతో గూడ సంప్రదించుట కొడంబడి యీ సమస్యను పరిష్కరింప బూనుదురు గాక యని విజ్ఞప్తి చేయుచున్నాడను.

డాసను ప్రభువరుని గణ్యతను కాదనబోము. అయినను వైద్యశేఖరునిగా వారి గొప్పతనము నెడ పూర్తి గౌరవమును జూపువాడ నైనను, ఆయన యొసగు సాక్ష్యమును శంకింప నాకు ప్రేరణ గల్గుచున్నది. ఏవిధమగు నైతిక భంగమునకు గాని, శారీరక విపత్తునకు గాని పాల్పడకుండ యావజ్జీవము బ్రహ్మచర్య దీక్షను బూనిన స్త్రీల యొక్కయు, పురుషుల యొక్కయు అనుభవమునకు వ్యతిరేకముగా ఆ ప్రభువు సాక్ష్యము నొసగు చున్నాడు. ఆరోగ్య ధర్మముల భంగము గావించి యేదేని వ్యాధికి లోనైన జనులతోడి పరిచయము సాధారణముగా వైద్యులకు కలుగు చుండును. అందువలన వారు రోగులకు ఆరోగ్యము కలుగునట్టి చికిత్సలను సమర్థతతో నిర్ణయింప గల్గుదురు. కాని ఆరోగ్యవంతులగు స్త్రీ పురుషులొక్క సందర్భములో నేమిచేయ గల్గుదురో వారు సదా తెలిసికొనజాలరు. కాబట్టి వివాహితులైన జనులు బ్రహ్మచర్యమును పూనుట వలన ఫలితార్థమును గుఱించి డాసనుప్రభువొసగిన సాక్ష్యమును స్వీకరింప బూనినప్పుడు కడు జాగరూకత పూనవలసి యుండును. వివాహితులైన దంపతులు కామతృప్తి చేసికొనుట న్యాయమే యని యెంచు స్వభావము వారికుండుననుట నిజమే, సందేహము లేదు. అయినను దేనినిగాని యూరక ఆమోదించక, ప్రతిదానిని చక్కగ పరిశోధన చేయు ఆధునిక కాలమున గృహస్థ జీవనమునందు కామోపభోగములతో నింతకాలము గడిపితిమి గాన, ఆ యాచారము ఆరో

గ్యకరమని గాని సద్ధర్మమనిగాని ఆలోచన లేకుండా నొప్పుకొ నుట దోషమే యగును. ప్రాతనగు నాచారముల ననేకము విడిచివేసి సత్ఫలముల బడయ గల్గుచున్నాము. వివాహితులైన స్త్రీ పురుషులు బ్రహ్మచర్య జీవనముల బూని పరస్పరము నైతికముగను, కాయికముగను మేలుకూర్చుకొన గల్గుటను ప్రత్యక్షముగ కనుపెట్టి చూచుచుండియు, ఈ యాచారమును మాత్రము పరిశోధన చేయకుండ మన మెందుకు విడువవల యును? కాని భారత దేశమున, గర్భధారణను నివారించు సాధనముల వినియోగమునకు ప్రత్యేక కారణముల బట్టి నే నభ్యంతరము తెలుపుచున్నాను. భారత దేశము నందలి యువ కులకు, సంభోగ నిరోధమన నేమియో తెలియదు. అది వారి దోషముకాదు. వారికి బాల్యముననే వివాహములు జరుగు చుండును. అది ఆచారముగ నున్నది. గార్హస్థ్య జీవనమున నిగ్రహము పూనుటకు వారి కెవరును చెప్పుటలేదు. వారి తల్లి దండ్రులు మనుమలను, మనుమరాండ్రను జూచుకొన నాతుర పడుచుందురు. పాపము బాలసతులు సాధ్యమగునంత త్వరలో సంతానవతులు కావలయు నని పరిసరముల వారు నిరీక్షించు చుందురు. అటువంటి పరిసర స్థితిలో గర్భనివారణ సాధనముల వినియోగముల వలన ఆ అనర్థ మింకను పెరిగిపోవును. భర్తల కామ వాంఛను దీర్పవలసిన వారని యెంచబడు చుండు పాప మా బాలికలకు సంతానవాంఛ లేకున్నను కామతృప్తి బడయ గోరుట మంచిదే యనెడు బోధ లింక సాగింప బడును. ఇట్లు రెండు లాభములు చేకూడుగదా యను భ్రమతో గర్భధారణ నివారణ సాధనములను వా రాశ్రయింప వలసిన వారగుదురు.

ఇది వివాహితస్త్రీలకు అర్హ్యము కానట్టి విపరీతమును విధ్వారమునగు బోధయని నే నెంతును. పురుషునంతగా స్త్రీ కామ వాంఛ కెఱయగునని నాకు నమ్మకము లేదు. ఇంద్రియ నిగ్రహము పురుషునికన్న స్త్రీకి సులభతరము. స్త్రీ తనభర్తను సయితము 'వలదు' అని చెప్పగల చాతుర్యమును నేర్పుటయు, భర్తచేతిలో నొకకీలుబొమ్మయై మనుట స్త్రీధర్మమున నొక యంశ కాదని నేర్పుటయు ఈ దేశమున సరియైన బోధయగునని నా నమ్మకము. విధాయకకర్మ లెట్లో అటులే అర్హతలును ఆమెకు గలవు. రామునియెడ ఐచ్ఛికముగా దాస్యభావము మాత్రము చూపిన దానిగ సీతను గ్రహించువారుఆమెయొక్క స్వాతంత్ర్యమునుగాని, రాముడు ప్రత్యంశమునందును నామె యెడ చూపిన సద్భావమునుగాని యథార్థమున గ్రహించిన వారు కారు. సీత తననుగాని, తన గౌరవమునుగాని సంరక్షించుకొనజాలని దుర్బల గాని, నిస్సహాయురాలు గాని కాదు. భారత స్త్రీకి గర్భధారణనివారణోపాయముల నేర్పబూనుట గుఱ్ఱమునకు ముందు బండిని తగిలించుటంత యోగ్యముగ నుండును. ఆమెనుదాస్యభావమునుండి విముక్తురాలినిచేసి శరీరపావిత్ర్యమును ఆమె గుర్తునకుదెచ్చి జాతీయసేవ యొక్కయు మానవ సేవయొక్కయు గణ్యత నామెకు నేర్పుటయే చేయదగిన మొదటిపని. భారతస్త్రీల నుద్ధరించుట దుస్సాధ్య మనియు, కావున వారికి పిల్లలు పుట్టకుండ నాపి వారికున్న దేహారోగ్యమును కాపాడు నిమిత్తమ నెడు సాకుతో గర్భధారణనివారణ సాధనములను వారల కలవరచవలయు ననుట సమంజసకార్యము కాదు.

ఇష్టమున్నను, లేకున్నను సంతానమునుగను నిర్బంధము

ననుభవించు స్త్రీల దుర్గతినిగుఱించి న్యాయముగనే ఆగ్రహము పూనునట్టి సోదరీలలామలు ఓర్పు జూపుదురు గాక! గర్భనివారణసాధనల ప్రచారము సయితము ఒక్కదినములో హఠాత్తుగా వాంఛితార్థమును దెచ్చి యొడిలో పడవేయజాలదు గదా! ప్రతివిధానము మనముచేయు ప్రచారము ననుసరించి ఫలించును. ఉచితమగు విధానము యొక్క ప్రచారమే సాగు గాక యని నా మనవి.

## ఇంద్రియ నిగ్రహ ప్రచారము

ఒకలేఖలోని యంశములు: —

"ఇంద్రియ నిగ్రహమును గుఱించిన మీ రిటీవల వ్రాసిన వ్యాసములు గొప్పసంచలన కారకములైనవి. మీ భావములం దాదరముగల పురుషులే చిరకాలము ఇంద్రియ నిగ్రహమును నిలుపుకొనుట కష్టమని గ్రహించు చున్నారు. మీరు స్వీయములగు అనుభవమును, సాధనవిశేషమును మానవ జాతికంతకు ననువర్తింపజేయజూచుచున్నారని వారును వాదించుచున్నారు. సంపూర్ణబ్రహ్మచారియొక్క నిర్వచనమునకు మీరు సయితము సదృశులు కానట్లు ఒప్పుకొనియుంటిరి. ఏమన, మీరును పశువ్యసనముల దాటియుండ లేదు. వివాహమాడిన దంపతులకు గలుగదగిన సంతానమునకు మితియుండు టవసరమని మీరును నంగీకరించితిరి. కావున నరజాతిలో నధికసంఖ్యాకులకు ఆచరణీయ్య శరణము కాగలది గర్భధారణను నివారించు నుపాయ మొక్కటియే గదా!

నాకున్న పరిమితులను నే నొప్పుకొనుచున్నాను. బ్రహ్మచర్యమునకును, గర్భధారణ నివారణోపాయములకును గల తారతమ్యమును నిర్ణయించుటలో నా పరిమితులే నా యర్హత

లగును. ఏలయన అధికసంఖ్యాకులగు ప్రజలవలెనే నేనును భూలోకమున జనించి భూలోకస్వభావము గలవాడనే యని నా పరిమితులు విశదము చేయుచున్నవి. అసాధారణప్రజ్ఞలు నాయందు లేవు. నాబ్రహ్మచర్యమునకును నుద్దేశము సర్వసాధారణ మైనదే. స్వదేశమును, మానవజాతిని సేవించు కొఱకె సంతానమునకు పరిమితి యేర్పరచుకొనుటే యది. స్వదేశమును, మానవజాతిని సేవించు దూరస్థమగు ప్రేరణ కంటెను, సన్నిహితమును, గాఢతరము నగునది పెద్దకుటుంబమును పోషించుకొనుటలోని అశక్తతయే. (ఈనాటి దృక్పథము నుండి చూచుచో) విజయవంత మగు ముప్పదియేండ్ల బ్రహ్మచర్యము నాకున్నను నాలోని పశువును నేడును కావలికాయవలయు నావశ్యకత నేనును నొకసామాన్యమానవుడనే యని విస్పష్టముగ ఋజువు చేయుచున్నది. తగిన ప్రయత్నముచేయునెడల నాకు సాధ్య మగునది యెవరునకైనను సాధ్యమే యని నేను వక్కాణించి చెప్పుచున్నాను.

గర్భధారణ నివారణ సాధనముల ప్రయోగమును బలపరచు వారు సామాన్య మానవులు బ్రహ్మచర్యమును సాధన చేయజాలరనుటవలన వారితో నాకు వివాదమేర్పడుచున్నది. ఆ సాధన వారికి సాధ్యమైననుగూడ వారట్టి సాధనకు పూనదగదనియు కొందరు వాదింపబూనునంతవరకుబోయిరి. అటువంటి మహాశయులు తమతమ క్షేత్రములలో తా మెంతటి ఘనులయినను, బ్రహ్మచర్య ప్రభావమును గుఱించిన స్వానుభవము లేకుండ, ప్రసంగించుచున్నారని సంపూర్ణ విశ్వాసపూర్వకమగు పరిపూర్ణవినయభావముతో నేను వారికి తెలుపగోరెదను. మాన

వుని ఆత్మయొక్క ప్రభావమునకు పరిమితిని నిర్ణయించు నధికారము వారికి లేదు. అట్టి సందర్భములో, నావంటియొక్క పురుషుని ప్రత్యక్షనిదర్శనమైనను, అది విశ్వాసనీయ మగునెడల నారి ప్రవచనములకు మించిన విలువగలదగుటే గాక నిశ్శంకమైనదియునై యుండును. సామాన్య ప్రజలు నన్నొక మహాత్మునిగ నెన్నుదు రను కారణముచేత నానిదర్శనమును త్రోసిపుచ్చుట యిట్టిమహత్తర పరిశోధనయందు అక్రమ మగును.

ఒక సోదరివేదనము హృదయము ఇంతకంటె గురుతరముగ నున్నది. ఆమె ఈతీరున పలుకుచున్నది. 'గర్భనివారణవాదుల మగుమేము నిన్న నేడు రంగమున ప్రవేశించితిమి. బ్రహ్మచర్య వాదులగు మీరో, అనేక తరముల నుండి బహుశః వేలకొలంది సంవత్సరములనుండి, ఈ రంగము నాక్రమించి యుంటిరి. మీ ప్రతిష్ఠను చాటుకొనుటకేమున్నది! బ్రహ్మచర్యబోధను ప్రపంచము స్వీకరించినదా? అధిక భారముచే క్రుంగిపోవుచున్న కుటుంబముల ఆర్తిని బాపుటకు మీరేమి చేయగలిగితిరి? ప్రసవవేదనలచే హతలగు తల్లుల మొఱలను మీ రాలకించితిరా? రండు, ఈరంగమున మీకును ప్రవేశమున్నది గదా! మీ బ్రహ్మచర్య ప్రచారమునకు మే మద్దతుగలము. వెగటు పుట్టించు భర్తృసమాగమముల నుండి భార్యలను బహుశః మీరుసంరక్షింప జాలుదురేని మేము మీకు విజయహారతుల నర్పింతుము. మానవ సామాన్యములగు లోపములను, అలవాటులను గుర్తించి, వానికి తావొసగుచునుగూడ సక్రమముగా వినియోగించిన యెడల వాంఛితార్థ సిద్ధిని చేకూర్చుటలో నెన్నడును వ్యర్థము కావని చెప్పదగిన మాయుపాయముల ప్రయోగములను మీరు దూషింప బూనుటెందులకో!'

నిరంతరము పిల్లలసంఖ్య పెరిగిపోవుచుండుట వలన నెల్లప్పుడును దారిద్ర్యమున మునిగి కుందుచున్న కుటుంబముల గురించిన జాలితో నిండిపోయిన ఒక సోదరి యొక్క ఆవేదనచే

వెలువడిన వేళనయిది. మానవజాతి దుఃఖమునుగూర్చిన మొఱ శిలల హృదయమును సయితము కరుగ జేయుననుట నెఱుగుదుము. అట్టి దుఃఖము ఉన్నతభావోపేత లగు సోదరీమణుల హృదయములను నొవ్వజేయక యెట్లుండగలదు ?

ఎవడేని ఆమొఱలువిని తలక్రిందై పోయి, యేటిలో మునుగువాని వలె చేతికందిన గడ్డిపోచనైనను పట్టుకొనను వాడైన యెడల, వాని నవి పెడత్రోవను ద్రిప్పగలవు.

భావపరివర్తనము వేవేగముగ జరిగిపోవుచున్న కాలమున మనము జీవించుచున్నాము. నెమ్మది నెమ్మదిగా వచ్చు ఫలితార్థముతో మనము తృప్తిపడజాలకున్నాము. మనకులము వారి క్షేమముతోడనే గాక మన దేశమంతటి క్షేమముతోడను సయితము మనము తృప్తిజెందుటలేదు. మానవజాతి యంతటితోడను మనము సానుభూతి పడయుచున్నాము; లేదా, సానుభూతి పడయగోరుచున్నాము. మానవజాతి పరమావధి జేరు యాత్రలో నిదొక మహత్తరమైన విజయము.

అయినను ఓర్పువీడుటచేతను, పురాతనమును కారణము చేతను ప్రాతవానినెల్ల త్రోసివేయుటచేతను, మానవజాతి దోషములన్నింటికిని పరిహారము చేకూర్పజాలము. మనలో నీనాడుత్సాహమును ప్రజ్వలింప జేయుచున్నట్టి స్వప్నములనంటి వానినే, బహుశః అస్పష్టముగ, మనపూర్వులును కాంచియుందురు. ఈలాటి విపత్తులకు వారు కనుగొనిన పరిహారములే మన మెన్నడును నిరీక్షించి యుండజాలనంత విశాలముగా పెరిగిన దిక్చక్రమునకును అనువర్తింపజేయుట సాధ్యపడ వచ్చును.

సత్యాహింసలు ప్రత్యేకముగ నేకొలదిమంది యాచరింప దగినవి గాక, మానవజాతి యంతయు అనుదిన సామాన్య జీవితమున ననుష్ఠింపవలసినవిగ నున్నవి. సరిగ నటులనే, బ్రహ్మచర్య దీక్ష గూడ నేకొలదిమంది మహాత్ములకొరకే గాక, మానవజాతి యంతటికొరకును నుద్దేశింపబడియున్నది. చాలమంది ప్రజలు అసత్యవాదులుగను, హింసాపరులుగ నుండుటను కారణముచేత మానవజాతి ఆ ధర్మము యొక్క ధ్వజమును క్రింద నేయదగనట్లే, అనేకులుగాని, అధికసంఖ్యాకులుగాని బ్రహ్మచర్యాదర్శమును పాటించరను కారణముచేత ఆధర్మము యొక్క ధ్వజమును సయితము క్రిందికి వంచదగదు.

సాక్ష్యము క్లిష్టముగ నున్నదను హేతువుచేత, వివేకియగు న్యాయాధికారి తప్పుడు తీర్పు నీయదగదుగదా! అతడు తన హృదయమును కఠినము చేసికొనినట్లు ప్రజ లనుకొనినను నిష్టపడును. ఏలన సత్యమగు కరుణయున్న, శాసనము దోషభూయిష్టము గాకుండ కాచుటయందే కలదని న్యాయాధికారి యెఱుంగును.

నశ్వరమగు శరీరముయొక్కయు, లేక మాంసపిండము యొక్కయు లోపములను స్థిరస్థాయియై అందు వసించు ఆత్మకు ఆరోపింపదగదు. ఆత్మకు సంబంధించిన ధర్మముల కనుగుణ్యముగా శరీరమును నడుపుకొనవలసి యుండును. ఈ ధర్మములు కొలదిగా నైనా మార్పు చేయుదగనివిగను నున్న వని సవినయముగ చెప్పుచున్నాను. మానవజాతి యంతయు వానిని గ్రహించుటకును, అనువర్తించుటకును శక్తిగలిగి యున్నదనియే నా అభిప్రాయము. వాని ననువర్తించు విధానమునందు భేదము

మాత్రము లేదు. ఫల సాధనము నందు తారతమ్య ముండిన నుండవచ్చును. మనకు దృఢవిశ్వాస మున్న యెడల ధర్మము నుండి తొలగము. మానవజాతి పర మగమ్యమును చేరుటకు గాని, ప్రత్యక్షముగా దానికి సన్నిహితస్థానమును ప్రాపించు టకు గాని పదిలక్షల వత్సరములు పట్టవచ్చును. జనహార్దాలుగా రను నట్లు సక్రమ మగు ధర్మస్వరూపమును ధారణచేయుదము గాక !

ఆసోదరి సవాలుచేసి యడిగినమాటకు సమాధానము చెప్ప వలసియున్నది. ఆత్మనిగ్రహ వాదులు సోమరులుగ లేరు; వారు తమ ప్రచారమును తాము చేయుచునే యున్నారు. వారి పద్ధతి గర్భధారణ నివారణవాదుల పద్ధతికి భిన్నముగా నున్న యెడల వారి ప్రచారమార్గములును భిన్నముగనే యుండవలసి వచ్చును; ఉన్నవి కూడను. ఆత్మనిగ్రహవాదులకు అనగా బ్రహ్మచర్యప్రతి పాదకులకు చికిత్సాలయము లక్కఱ లేదు. వారు తమసాధనసామగ్రినిగూర్చి ప్రకటనలు చేయనక్కఱ లేదు. ఏమందురా వారిసాధనలు బజారులో అమ్మెడివి గాని ఒకరి కొకరు చేతిలో పెట్టుకొనునవిగాని కావు. అయినను గర్భనివారణసాధమునలనుగూర్చి వారు చేయు ఖండనలును, వానిజోలి పెట్టుకొనకు డని ప్రజలకు వారుచేయు హెచ్చరిక లును వారిప్రచారమున నంశము లే యగును. వారి నిర్మాణ కార్యక్రమము నున్నది. కాని, అది స్వభావము చేతనే నిరా డంబరముగ నుండును. బహిరంగప్రదర్శనమున గోచరించదు. బహ్మచర్యధర్మప్రచార మెన్నడును సందిగ్ధముగ విడువ బడియుండ లేదు. అత్యంతసమర్థ మగు ప్రచారము ప్రత్యక్ష

నిదర్శనమే. నిర్దుష్టముగా బ్రహ్మచర్యవ్రతమును సలిపెడు నిష్కపటపురుషుల సంఖ్య పెరిగినకొలదిని దాని ప్రచారము అధిక మగుచునే యుండును.

## గృహస్థ బ్రహ్మచర్యము

ఒక మిత్రు డిటుల వ్రాయుచున్నాడు:—

“జన్మనిగ్రహమును సాధించుటలో అత్యుత్తమ మార్గము బ్రహ్మచర్యమే యని చాలాకాలము నుండి మీతోడ నేకీభవించు చున్నాడను. సంభోగ క్రియ సంతానము బడయుట కొరకే యేర్పడినది; అందుకొఱకు కానియెడల అది యేమాసమున జరిగినను అస్వాభావికమగు కామతృప్తి కర్మయే యనుట నిర్వివాదము. అయినను దీనివలన నొకొకప్పుడు మహా సందిగ్ధావస్థ వచ్చి పడుచుండును. సంభోగము ఒకసారి రెండుసార్లు జరిగినను గర్భము నిలువని పక్షమున, నేమి చేయవలసి యుండును? పరిమితి యిది యని నిర్ణయించు టెట్లు? సంతానాపేక్ష పూర్తిగ విడిచివేయుట బహు కష్టము. రెండవపక్షమున మితిలేకుండ సంభోగక్రియ సాగించినచో పురుషుని వీర్యమంతయు కొల్లపోవుట తటస్థించును. మఱియు, ఒకటి రెండవకాశముల వినియోగించుకొనిన పిమ్మట గర్భము నిలువని పట్ల, వారికి విధి ప్రతికూలముగ నున్నదనియు, ఆ కారణముచేత నిక సంభోగము మాని వేయవలసిన దనియు, చెప్పగా నలయునా? కాని అందుకు కొంత యసాధారణ మగు ఆత్మ నిగ్రహమును, ఆధ్యాత్మికబలమును ఆ దంపతుల కవసర మగును. పుంస్త్వము, యౌవనము గలిగియున్న కాలమున మఱల మఱల జరిగిన విఫలతల యనంతరము వార్ధక్యమున బిడ్డలు గలిగిన నరుల సాదృశ్యములు గాని, అపూర్వములు గాని కావు. అందువలన పూర్ణ బ్రహ్మచర్యాచరణ మింకను కష్టసాధ్య మగుచున్నది. మఱియు దంపతు లిరువురును పుష్టి

గలవారై యే శారీరక రుగ్మతయు లేనివారై యున్నసమయమున నింకొక క్లిష్టతర సమస్య యేర్పడు చున్నది.

ఆ చిక్కు గలదని నే నొప్పుకొందును. ఆ చిక్కు ఆసమస్య యందే సహజముగ నేర్పడుచున్నది. విజయయాత్రాపథము చిక్కులతో నిండియుండును; పరిణామసోపానక్రమమున నరుని ఆరోహణచరిత్ర, అందలి అవరోధముల దాటుకొనుచు పోవు కథనములతో సమ్మిళితమైయున్నది. ఉదాహరణమునకు హిమాలయ పర్వతారోహణమున కగుప్రయత్నముల చరిత్రను చూడుడు. ఒకడు పైకి పోయినకొలదిని, దానిలో నెత్తైనపై, యెక్కి పోవుట దుస్సాధ్యమగును. ఆకారణముచేత దానిఅత్యున్నతాగ్ర మీనాటికిని దుర్గమముగనేయున్నది. ఆసాహసోద్యోగమిప్పటి కెన్ని ప్రాణములనో బలిగొనియున్నది. అయినను ప్రతి సంవత్సరము క్రొత్తప్రయత్నములు సాగుచునేయున్నవి. పూర్వమువానివలెనే విఫలతను గాంచుచున్నవిగూడను. ఇంతజరుగుచున్నను ఆవిఫలత పరిశోధకులయుత్సాహమును చల్లార్చుట లేదు. ఈహిమాలయ పరిశోధనయే యిట్లు జరుగుచుండగా, నిక ఆత్మవిజయముసంగతి యేమనవలయును? ఆ యుద్యమము దీనిని మించి యెంతయో దుర్లభమైనది; కాని, ప్రతిఫలమును అత్యంతామూల్యమైనదియే. హిమాలయారోహణము ఎంతటి ఘనకార్యమైనను, తాత్కాలిక విజయోత్సాహమును, ఆనందమునుమాత్రమే యియ్యగ గలదు. కానిఆత్మవిజయమో, క్షీణత నెఱుంగక నిరంతరము నతిశయించుచుండగల ఆత్మానందమునే ప్రసాదింపగలదు. బ్రహ్మచర్యనియమావళిని నిర్దుష్టముగ నిర్వహించిన పురుషుని వీర్యాధానము వలన గర్భధారణ కాకుండ తప్పదు. గర్భమేర్పడియేతీరవలయు

ననుట బ్రహ్మచర్య శాస్త్రముయొక్క సుప్రసిద్ధమగు సిద్ధాంతమై యున్నది. అది అట్టిదై యుండితీరవలయును. ఒక పురుషుడు పూర్తిగా పశుత్వమును నిర్జించినవాడగునెడల, కామాతురుడై పరవశుడగుట అసంభవము. సంభోగము నిమిత్తమే సంభోగమును వాంఛించుట ఎన్నడును పొసగదు. కాబట్టి సంభోగమనునది సంతానకాంక్ష కలిగినప్పుడే ఘటిల్లును. గృహస్థ బ్రహ్మచర్యమని అభివర్ణింపబడిన దాని కర్థ మిది! అనగా నేమిటి? ఈ ధర్మసూత్రము ననుసరించు పురుషుడు సాంసారిక జీవనము గడుపుచున్నను, కామవికారముచే నెన్నడునుగాక, సంతానప్రాప్తి కొఱకు మాత్రమే పొసగునట్టి సంభోగక్రియకు తా నెన్నడును నేమాత్రమును పాల్పడక యుండు పూర్ణ బ్రహ్మచారి పొందు పదవిని పొంది, వానితో సమానుడౌ నృతి యగుచున్నమాట. ఆచరణయందీ యాదర్శము సంపూర్ణముగా ప్రాపించుట కడుకష్టమైతోచుటసత్యము. కాని ఈకాలపు వారిలోకడ దీనికి ఎదురుతిరిగినవారై, గర్భధారణ నివారణ సాధనల ప్రచారము సాగించుప్రముఖులు విషయలోలత్వమే దాదాపు తమ పరమాదర్శముగా ప్రతిష్ఠించియున్నారు. విషయలోలత్వమెన్నడును పరమాదర్శము కాజాలదు. ఆ ధర్మసాధనకు అంతమనున దుండదు. కాని పరిమితిలేని విషయలోలత్వము అనివార్యముగా వ్యక్తులయొక్కయు జాతియొక్కయు వినాశమును తెచ్చిపెట్టునని ప్రతివారును నంగీకరింతురు గదా! కాబట్టి ఇంద్రియనిగ్రహము మాత్రమే మన పరమాదర్శముగ నుండగలదు. అనాది నుండియు నదటులనే భావింపబడుచున్నది.

అందువలన దానిని ప్రాపించు సాధనలకై మనము పరిశోధనల చేయవలయునే గాని దానిని వంచన చేయుట దగదు.

బ్రహ్మచర్యసాధన సందర్భమున మన మెదుర్కొను కష్టములలో చాలభాగము, ఆబ్రహ్మచర్య విధులంగుఱించిన మన అజ్ఞానము వలన కలుగునవై, వానిని దెలిసికొనినచో వాని యంత నవియే అదృశ్యములై పోవునని నా దృఢాభిప్రాయమై యున్నది. ఉదాహరణకు విలేఖరి ప్రస్తావనకు దెచ్చిన సమస్యను పరమాదర్శమును రెంటిని దృష్టిలో పెట్టుకొని విచారింతము గాక. బాల్యము నుండియు బ్రహ్మచర్యవిధుల ననుసరించినట్టి సాధారణారోగ్యముగల దంపతుల సందర్భమున సంభోగముల వ్యర్థము కాజాలదు గావున, ఆదర్శ దశయందు అసలు అట్టి వంటి సమస్యయే బయలుదేఱదు. ఐనను ఆచరణయందు వైపరీత్యములు సంభవింపవచ్చును. అటువంటివారి సందర్భమున నియామకము కాగలది, గర్భము నిలుచువఱకు ఋతుకాలమం దొక్కసారి మాత్రము సంభోగ మంగీకృత మగుసను విధి యొక్కటియే. కేవలము విషయభోగము దాని యుద్దేశము కాదు గనుక, ఆయీప్సితార్థము నెఱవేరగనే సంభోగము నిషేధింప బడవలసియుండును. కాయిక, మానసిక, నిష్కళంక వర్తనముతో పాటు కాయిక మానసికారోగ్యము పెరుగుచుండునని నా స్వంతఅనుభవమువలనగలిగిన నా విశ్వాసమైయున్నది. అం దాశ్చర్యము లేదు. నరుని వంటి యద్భుతజీవిని కల్పనజేయ సమర్థమగు పదార్థము ఉచితరీతిని సంరక్షింపబడిన యెడల, అసామాన్యమగు శక్తిగను, బలముగను పరిణవిల్లితీరును. ఈ శాస్త్ర ప్రవచనముయొక్క సత్యమును నెవరైనను స్వీయా

నుభవములో పరీక్షింపవచ్చును. ఈ సూత్రము పురుషులపట్ల నెంతగా సార్థకమై యొప్పునో స్త్రీలపట్లను నంత సార్థకమై యొప్పగలదు. అయినను చిక్కెక్కడ వచ్చుననగా మన హృదయములలో కామము పెట్టుకొని, బాహ్యమునకు కామ చిహ్నము లగుపడకుండ వర్తింప నలయునని వ్యర్థ ప్రయత్నముల చేయుచుందుము. ఫలితార్థమై, కాయికముగను, మానసికముగను భంగపాటు తెచ్చుకొనుచున్నాము. మన జీవితములు, గీత వచించునటుల బూటకములై, మిథ్యాచారములై పోవుచున్నవి.

## కొలది సందేహములు

### 1. హింసల పాలగు సతికి పరిహారము

ఒక లేఖలోని యంశములు :—

“మాచెల్లెలిని ఒకనికిచ్చి పెండ్లి చేసితిమి. ఆతడొక దుండగీడు; వ్యభిచారి; మర్యాద నిసుమంత యెఱుగడు. పెండ్లికాలమున వాని వర్తనమును మాకు తెలియనీయలేదు. మాచెల్లిలి మందలింపులు వానిమీద వ్యర్థము లయ్యెను. మీదుమిక్కిలి అతడు మాచెల్లెలి యెదుటనే వ్యభిచరించును. తన దుర్ణయములను చూచునటుల చేయుటేగాక అతడామెను స్తంభమునకు గట్టిపెట్టి బాదుచుండెను. ఆ సంగతి కడు శోచనీయము. ఈ దశలో మమ్మేమి చేయుమందురు? ఆమె నేమి చేయుమందురు? స్త్రీకి హక్కులుగాని, అధికారాలుగాని లేకుండజేసి సాంతముగా పురుషుని దయాదాక్షిణ్యముల యాధారమున బ్రదుకవలెననుట యీ హిందూమతమున నొక లజ్జాకరమగు ఆచారమైపోయినది. పురుషుడు స్త్రీ నెటులైన హింసింపనిండు. లోకము నోరెత్తదు. ఇట్టిలోపము లున్నచో హిందూమతమునందు నిక పురోభివృద్ధి గలుగజాలు, నెట్లు?”

ఈ విలేఖరి విద్యాసంపన్నుడు. ఈ నా సంగ్రహావర్ణనకంటె తన చెల్లెలి స్థితినిగూర్చి యతడు వ్రాసిన దింకను స్ఫుటతరముగ నున్నది. గాఢమగు నాగ్రహము వచ్చినతరి నెంత క్షంతవ్య మైనను, హిందూమతమునుగూర్చి యతడు చేసిన నింద ఒకానొకప్రత్యేక సంఘటన నాధారముగాగొని తొందరపాటుతో గావింపబడిన సామాన్య ప్రతిపాదనమై యున్నది. ఏమందురా పూర్ణశాంతితోడ కాపురము చేయుచు, గృహరాణులై వెలయుచున్న హిందూవనితలు లక్షలాదిగ గలరు. తమపతులపైని వారికిగల యధికారమును గాంచి యేయితరవనితయైనను మత్సరము పూననగును. ఆ అధికారము ప్రేమవలన జనితమగునది. ఈ విలేఖరి బయలుపెట్టు ప్రకారవర్తనము హిందూమతమువలనిదోషమునకు దృష్టాంతమనుటకు మారుగా ప్రపంచములో నేదేశమందైనను ఏమతావలంబులగు ప్రజాసంఘమునందైనను తలజూపుచుండు మానవనైజమునందు గల దుష్టత్వమే యనవలయును. మెత్తగానుండి తనయధికారమును చెల్లించుకో జాలనట్టియు, చెల్లించుకొనిష్టపడ నట్టియు భార్యయెడ భర్త చూపెడు దౌర్జన్యమునుండి యామెను రక్షించుటకు వివాహబంధవిచ్ఛేదనావకాశము ప్రయోజనకారి యగుట లేదు. కాబట్టి సంస్కరణముల ప్రతిపాదించువారు తమసంస్కరణములు సాగుకొఱకు ఆవేశములను, అతిశయోక్తులను మానుటే యుచిత మగును.

అయినను ఈవ్యాసమునందు ప్రస్తావనకువచ్చిన సంఘటనబోలునవి హిందూసంఘమున క్రొత్తగ అసాధారణములుకావు. భార్య భర్తకు మితిమీరిన లొంగుబాటు చూపనలయు నను

టలో పోగబడి, హిందూసభ్యత భార్యను భర్తలో పూర్తిగ విలీనమైపోవునటుగా బలాత్కారము చూపినది. ఇందు వలన అధికారము సంతయు భర్తయే చూఱగొని, దాని విని యోగములో స్వేచ్ఛాప్రాయుడైపోవుట అప్పుడప్పుడు తటస్థించు చున్నది. కాబట్టి దీనికి పరిహారము శాసనము వలన గాక, అవివాహితులగు కన్యకలకు నేర్పు చదువుల కంటె, స్త్రీజనము నకు వేఱువిధమగు సద్విద్యచే నేర్పుటవలనను, భర్తల యమాను నుష చర్యలను పట్టణపల్లెల ప్రజలకు నీతిబోధ గఱపుట వల నను సాధింపవలయును. శాసనము విచారించు ప్రస్తుత సందర్భ మున పరిహార మతి సులభము. ఆమె యన్నయు, బంధువు లును ఆమెతో గూడి విలాపములు చేయుట మాని, ఆమెను పోషణ యేర్పాటు చేయవలయును. పాపి యగు పతి కనుకూల ముగ వర్తించుటయు, వాని సాంగత్యముననే పడియుండుటయు తనకు విధ్యుక్తధర్మము కాదని తెలిసికొనగల విద్యను ఆమెకు నేర్పవలయును. ఆమె భర్త తన భార్యగతి నెంతమాత్రము లక్ష్యము చేయువాడు కాదనుట తెల్లమగుచున్నది. కాబట్టి, ఆమె పెండ్లిబంధమును తెగద్రెంచుకొనకుండగనే, భర్త యిల్లు విడిచివేసి, పెండ్లిగాని కన్య వలె జీవింపవచ్చును.

వివాహబంధ విచ్ఛేదనమున కవకాశము లేని హిందూస్త్రీకి సముచితము న్యాయసమ్మతమగు పరిహారములు రెండుగలవు:— కార్కశ్యము జూపినందునకై భర్తను శిక్షింపజేయుట; మనోవృత్తికై తగవుపెట్టుట. ఈ పరిహారము లన్నిసందర్భములందును గాకున్నను, కొన్ని సందర్భములందు నిరుపయోగమగుట కంటెను అనర్థదాయక మగు నని నా యనుభవము తెలుపు

చున్నది. యోగ్యురాలగు స్త్రీకి ఇందువలన తృప్తి చేకూరఁ బోదు. భర్తను సంస్కరించుట యను సమస్య, అసలే అసాధ్యము కాకున్నను, అందు గల చిక్కులు హెచ్చిపోవును. కాని, అట్టి సంస్కారమే సమాజమునకును, ముఖ్యముగా ప్రతి భార్యకును, వాంఛితార్థముగా నుండవలసియున్నది. ప్రస్తుత సందర్భమున, తల్లిదండ్రులు లేా బాలికను పోషింపగలవారే. అట్టిది పొసగని సందర్భములందు, దౌర్జన్యముపాలైన స్త్రీలకు నిలువనీడ నొసగగల సంస్థలు దేశమున చాల పెరుగుచున్నవి.

ఇక యిట్టి యువతులకు కామవాంఛాతృప్తి యెట్లను ప్రశ్న యున్నది. వారు ప్రతికూలులు రగు భర్తల యిండ్లను విడిచివేసిరి. లేదా తఱిమివేయబడి రనుకొందము. వివాహబంధ విచ్ఛేదన మను పరిహారమా వీరలకు లేదు. ఇక యెట్లు? ఈ సమస్య చాల మంది సందర్భమున బాధించునదికాదు. ఏలయన, యుగయుగములుగా పెండ్లి సంబంధాల తెగద్రెంపు లంగీకారము గాని సమాజమునందలి స్త్రీలు తమ పెండ్లిండ్లు సుఖప్రదములు గాకున్నను కూడ, పునర్వివాహములను వాంఛించుట లేదు. ఆ పరిహారమును కోరుకొను సమాజములందలి ప్రజలకు, అది లభ్యమగుచునేయుండు ననుటకు సందియము లేదు. మన విలేఖరి యుత్తరమును నేను గ్రహింపజాలినంతలో, కామవాంఛాతృప్తి కావలయునని భార్య దుఃఖించుట లేదు. ఆమె దుఃఖమంతయు భర్త దుష్టుడై, నీతిని ధిక్కరించుచున్నాడనియే. దీనికి నేను తెలిపినటుల ఆమె తనమనో వైఖరిని మార్చుకొనుటే పరిహారము! దిక్కు లేకపోవునే యను భయము భ్రాంతిజనక మయినది. అనాలోచితముగా గలిగిన యీ భయమును మాన్పుటకు

కొంచెము దృక్పథమును మార్చుకొనినను, కొంచెము స్వతంత్రాలోచన చేసినను త్రోవ దొరుకక గలదు. అటువంటి సందర్భము లందు బాధితురాలిని హింసాక్షేత్రము నుండి వేఱు చేయుట మాత్రముతో బంధువులు తృప్తిపొంద దగదు. ప్రజాసేవకై ఆమెకు తగిన శిక్షణను గఱుపవలయును. ఆ శిక్షణము సందేహాస్పదమగు భర్త శయ్యాసుఖమునకు తుల్య యగుట కంటెనుకూడ గొప్పదియే కాగలదు.

## 2. రామనామ మహిమ

ఒక ప్రశ్న :—

“ కేవలము రామనామజపమువలన, ఒక పురుషుడుగాని, స్త్రీగాని ఆత్మసాక్షాత్కారమును బడయగల్గునా? నా సోదరీమణులలో కొందఱు సంసార విషయములు ఒకప్రక్కబెట్టుదు అప్పుడప్పుడు దీనినాదరించుచు వచ్చిన చాలునని వాదించుచుటచేత నేనిట్లు ప్రశ్నించుచున్నాను.”

ఈ ప్రశ్న స్త్రీలనేగాక చాలమంది పురుషులను సయితము తబ్బిబ్బుచేయుచున్నది; నన్ను విశేషముగ శోధించినది. కేవల నివృత్తిని, పురుషప్రయత్నముయొక్క నిష్ప్రయోజకతను ప్రతిపాదించు వేదాంతసంప్రదాయ మొకటి కలదని యెఱుంగుదును. ఈపదములను త్రోసివేయకుండ, వీనికి నా స్వంత అర్థమును చెప్పి సంగీకరించిననేతప్ప, యీ బోధను నే నామోదింప జాలను. మితప్రజ్ఞుడ నగు నా అభిప్రాయములో ఏ వ్యక్తియొక్క యేని పురోభివృద్ధికి పురుషకారము అవసరమగును. ఫలితార్థముతో దానికి ప్రమేయ ముండదగదు. వాచికార్థముతో తృప్తినందుట మాత్రముకాక, భగవంతుని ఆదేశప్రాప్తి కొఱకై సాగించు పురుషప్రయత్నమునకు సహకారిగా నుండి

మనను పావనుల చేయునిమిత్తము, రామనామమైనా లేక తత్తుల్యమగు వేఱొక మంత్రమైనా అవసరమే యగును. కాబట్టి పురుషప్రయత్నమునకు ప్రత్యామ్నాయముగా జపమును ప్రతిపాదించిన చాలదు. ఆపురుషకారమును దృఢతరముగ జేసి, సరియగు త్రోవలో నడుపు నిమిత్తమే జప ముపకరించును. పురుషప్రయత్నము సర్వము వ్యర్థమను నెడల, సాంసారిక ప్రవృత్తులుగాని, అప్పుడప్పుడు మనము పూనుదీనరక్షణ ప్రయత్నములుగాని ఎందులకు? అట్టిప్రయత్నమునందే జాతీయ సేవాంకుర మిమిడియున్నది. జాతీయ సేవయనగా, నామట్టుకు నాకు, విశ్వమానవసేవ యనియే అర్థము. కుటుంబమునకు చేయబడిన నిష్కామ సేవయైనను అటువంటిదే. కుటుంబమునకు చేయబడు నిష్కామసేవ, వ్యక్తిని జాతీయసేవలోనికి తప్పకుండ జొఱబడచేయును. రామనామజపము స్వార్థమును తొలగించి, స్థిరచిత్తమును చేకూర్చి, యిక్కట్లువచ్చినప్పుడు తబ్బిబ్బుపడిపోకుండ కాపాడును. నిరుపేదలతోడి యేకీభావము లేనిది, వారిసేవచేయనిది, ఆత్మసాక్షాత్కారము అసంభవమే యని నావిశ్వాసము.

### ౨. పతియిష్టము లేని ప్రజాసేవ

మఱొక ప్రశ్న:—

"పతి ఘోరరాక్షసి గాని లేక దయామూర్తిగాని, యెట్లయినను సదా పతిభక్తి గలిగియుండుటయు, వానిలో పూర్ణముగ మిళితమైపోవుటయు, హిందూమతమున స్త్రీకి పరమలక్ష్యమందురు. ఇట్టివర్తనమే సతీధర్మమగునెడల, భర్త వలదని యడ్డుపడినను, ఆమె జాతీయసేవ చేయదగునా? లేక పతితనమాపో నంగీకరించు నంతవఱకే పోవలయునా?"

సతియనగా నాదర్శమూర్తి సీత; పతియనగా ఆదర్శమూర్తి రాముడు. కాని, సీత రామునికి బానిసకాదు; రాముడునట్లే సీతకు బానిసకాడు. రాముడు సతతము సీతయెడ నాదరము జూపెడివాడు. ఎచ్చట యథార్థమగు ప్రేమ యుండునో, అచ్చట నిట్టిశంకలకు తావుండదు. ఎచ్చట యథార్థమగుప్రేమ లేదో, అచ్చట సఖ్యతయగోలేదు. కాని ఈనాటి హిందూకుటుంబ మొక పొడుపుకథ లీలనున్నది. సతిపతులు తాము వివాహములు గావించుకొనునప్పుడు ఒండొరులెట్టివారో యెఱుగనే యెఱుగరు. ఆచారముచే బలపడిన మతము యొక్క అనుమతియే వివాహము నుం చేసికొనినసతిపతుల సరళజీవిత ప్రవాహమును, అధికసంఖ్యాకములగు హిందూకుటుంబముల యొక్క శాంతిని గాపాడుచున్నవి. భార్యయో, భర్తయో సామాన్యాచారమునకు భిన్నమగు భావములను పూనునప్పుడు మాత్రమే సుతిచెడునను భయముకలుగును. భర్తవిషయములో అతడు నిరంకుశముగావర్తించును. తన అర్ధాంగితో సంప్రదింపవలసిన యవసరము నాతనికి కాన్పించుటలేదు. తనభార్య తనయిష్టానుసారము నాడుకొనుస్త్రీగా భావించుచున్నాడు. పాపము భార్యయో, తనభర్తయొక్క అధికారమును విశ్వసించి, తన వ్యక్తిత్వమును తఱచుగా అణంచివేసికొనుచున్నది. ఈస్థితి తొలగు మార్గము కలదనియే నాయూహ. మీరాబాయి ఆ మార్గము జూపినది. తానను సరించుమార్గము సరియైనదని తెలిసినప్పుడును, పావనతరోద్యమముకొఱకై నిగ్రహముపూనవలసివచ్చినప్పుడును, తనమార్గమునే తా ననుసరించుచు తత్ఫలితార్థమునుతలనొగ్గి అనుభవించుటకు, సతికిసంపూర్ణాధికారము కలదు.

4. మాంసము వండి పెట్టదగునా ?

ఇంక నొక ప్రశ్న:—

"భర్త మాంస భక్షకుడు; సతికి మాంసము తినుట దోషమని తలంపు. అట్టియెడ నామె తన యభిప్రాయము బట్టి నడువ నగునా? ప్రేమ పూర్వకము లగు సకలోపాయముల చేతను భర్తయొక్క మాంసభక్షణము మొదలగు అలవాటులను మాన్ప ప్రయత్నము చేయుదగునా? లేక భర్త కొఱకై మాంసమును వండవలసినదేనా? ఇంకను భర్త బలవంతపెట్టు నెడల ఆమెకూడ మాంసము తిన పాల్పడ వలసినదేనా? భార్య తన యిష్టానుసారము వర్తింపవచ్చునందురా? ఒకరు బలాత్కారము చేయుట, మరియొకరు తిరుగుబాటు చేయుట సాగునెడల సమిష్టి కుటుంబము నడచుటెట్లు?"

దీని పైప్రశ్నకు తెలిపినసమాధానమునందు కొంతవరకు దీనికిని సమాధానము వచ్చినది. భర్తయొక్క దోషకార్యము లందు భార్య సహకారము సలుపవలసిన విధి లేదు. ఆమె దేని నేని దోషముగా నిర్ణయించుకొనిన యెడల తాను ధర్మమునే అనుసరించుటకు సాహసింపవలయును. భర్త కుటుంబపోషణ కొఱకై సంపాదన చేయవలసిన విధి గలవాడగు తీరున భార్య కుటుంబ నిర్వాహణము చేయవలసిన విధి గలదై వంటచేయవలసి యున్నది గావునను అంతకు పూర్వము భార్యాభర్తలిరువురును మాంసము తినువారే యైయుండిన యెడల కుటుంబమునకు మాంసము వండిపెట్టుట ఆమెకు విధియే. అటులగాక మాంసాశనులుగాని కుటుంబములో భర్త నూతనముగా మాంసము తిన మొదలిడి, తనకై మాంసమును వండిపెట్టుమని భార్యను బలాత్కరించు నెడల, తనకు ధర్మవిరుద్ధముగా దోచిన వంటను

చేసిపెట్టువిషి ఆమెకు లేదు. కుటుంబశాంతి అత్యంతము వాంఛనీయమే. కాని, అట్టిశాంతియే పరమసాధకాము. నాఅభిప్రాయములో గృహస్థజీవనము తక్కినవానివలెనే ఒక ధర్మశిక్షణవిధానము. జీవితమే ఒక ధర్మము; లేక ధర్మశిక్షణము. గృహస్థజీవనము ఇహపరములందు సతిపతుల పరస్పరక్షేమము నిమిత్త ముద్దేశింపబడియున్నది. అయ్యది మానవసేవకొఱకును ఉద్దేశింపబడియున్నది. ఒకభాగస్వామి ధర్మశిక్షణమును భంగపఱచిన యెడల, రెండవ భాగస్వామికి తన సంబంధమును విడగొట్టుకొను అధికారము కలుగుచున్నది. ఈ సందర్భమున ఘటిల్లునియోగము నీతిసంబంధమైనదేగాని, కాయికమైనదిగాదు. అందు బంధవిచ్ఛేదనమనుమాటకు తావులేదు. భార్యగాని, భర్తగాని యిట్లు వేఱుపడుటయు, వారు మొదట నేధర్మనిర్వాహణము కొఱకై కలిసినారో, ఆధర్మనిర్వాహణమునకై వేఱైయుండవలయును. భార్యాభర్తలిరువురును సరిసమానులనియే హిందూమతము నిర్ణయించుచున్నది. ఇందుకు విరుద్ధమగు ఆచారము పుట్టుకొనివచ్చినదనుట సత్యమే; ఎప్పటినుండియో ఎవరికిని తెలియుటలేదు. ఇటులనే అనేకములగు నితరదోషములును చొరబడినవి. స్త్రీగాని, పురుషుడుగాని యెందుకొఱకై జన్మించిరో, అట్టి ఆత్మ సాక్షాత్కారముకొఱకు మాత్రము, స్త్రీగాని పురుషుడుగాని తన యిచ్ఛానుసారము వర్తించుటకు హిందూమతము సంపూర్ణాధికార మిచ్చుచున్నదని నే నెఱుంగుదును.

## 5. ప్రతికూల స్మృతులు

బెజవాడ 'ఇండియన్ స్వరాజ్య' పత్రిక యందు స్త్రీలను గురించిన యీ క్రింది స్మృతి వాక్యములు ప్రకటింపబడి యున్నవి:—

"భర్త దుర్వినీతుడైనను, వ్యభిచారి యైనను ఏ సద్గుణములును లేనివాడైనను, భార్య వానిని భగవంతునివలె పూజింపవలయును. (మను. 5—154.) "స్త్రీలు తమ భర్తలమాట ననువర్తింపవలయును. అది వారి పరమధర్మము". (యాజ్ఞవల్క్య. 1—18) "స్త్రీకి వేరుగా యాగముగాని, క్రతువుగాని, ఉపవాసముగాని లేదు. భర్తృసేవ వలననే ఉత్తమ గతిని భార్య పడయగలదు." (మను. 5—145) "భర్త జీవించి యుండగా., ఉపవాసములు వ్రతములు చేయువనిత భర్త జీవితమును హరించు చున్నది. ఆమె నరకమున బడును. తీర్థముల కేగిన స్త్రీ భర్త పాదములను లేక శరీరమంతటిని కడిగి ఆ జలమును త్రాగవలయును. అంత నామె ఉత్తమగతి నందును." (అత్రి 136—137) "భార్యకు భర్తృలోకమునకు మించిన ఉత్తమ లోకము లేదు. భర్తకు అహితము గావించిన స్త్రీ మరణించినప్పుడు భర్తృలోకమునకు బోజాలదు. కావున స్త్రీ భర్త కెన్నడును అసంతుష్టిని గలిగింప దగదు." (వశిష్ఠ. 21—24) 'తండ్రి కుటుంబమును గూర్చి గర్వించి, భర్తయెడ అవిధేయతజూపు స్త్రీని జనసమూహము నెదుట రాజు కుక్కలకు ఆహారముగా విడవలెను." (మను. 8—871) "భర్తమాట వినని స్త్రీ చేతి ఆహారము నెవడును తినదగదు. అట్టి స్త్రీని వ్యభిచారిణిగా తెలియవలెను. (అంగిరస. 69) "భర్త దుష్టవర్తను డైనప్పుడును త్రాగుబోతైనప్పుడును, రోగగ్రస్తు డైనప్పుడును వానిని తిరస్కరించిన భార్యకు విలువగల నగలును, నగలును, నియ్యక మూడు మాసములు బహిష్కరించవలయును." (మను. 10—8)

తమస్వాతంత్ర్యముతోపాటు స్త్రీస్వాతంత్రమును వాంఛించునట్టియు, ఆమెను జాతి మాతగా భావించునట్టియు పురుషులకు స్మృతులలో నిట్టివాక్యములున్నవను భావము విచారకర

ముగ నుండును. సనాతన పక్షావలంబియగు పత్రికలో నిటు వంటి వాక్యములను మతము పేరిట ప్రకటించుట జూడ నింకను విచారము కలుగును. స్త్రీకి అర్ధస్థానము నొసగి పూజ్యభావమును జూపు వాక్యములును ఆస్మృతులయందుండియేయున్నవి. ఒకే స్మృతిలో పరస్పర విరుద్ధ వాక్యము లున్నప్పుడును, నీతికి విరుద్ధము లగు వాక్యము లున్నప్పుడును, దాని నేమిచేయవలసియుండుననుసమస్య బయలుదేరు చున్నది. శాస్త్రములను పేర ముద్రింపబడు సర్వమును బ్రహ్మవాక్కుగను, ఈశ్వరప్రోక్తముగను, పాటించు నవసరము లేదని, పెక్కుతడవలు వ్రాసియేయున్నాను. ఏదిమంచిదియో ప్రమాణమో, యేది చెడ్డదో కల్పితమో ప్రతివారును నిర్ణయింపను జాలరు. కాబట్టి, శాస్త్రములపేర జరుగువాని నన్నింటిని పరిశీలించి, నైతికప్రయోజనము లేనట్టియు, మతమునకును, నీతికిని విరుద్ధముగ నున్నట్టియు, సర్వమును తొలగించివేసి హిందువులకు ప్రమాణముగా నుండదగిన ప్రతులను ప్రకటించుటకు సమర్థమగు సంఘ మొకటి యేర్పడవలసియున్నది. హిందూప్రజయావత్తును, లేదా మతగురువులుగ పాటింపబడు వారెల్లరును అటువంటి గ్రంథములను ప్రమాణముగ స్వీకరింపకపోదురా అనేక విషయములను అటువంటి పవిత్రోద్యమమునకు ప్రతిబంధకముగ నుండ నక్కరలేదు.

## 6. స్త్రీల వర్ణము

ఒక మిత్రుని లేఖ:—

'వర్ణమును గూర్చి వ్రాయుచో వర్ణనియమ సూత్రము పురుషులకు మాత్రమే సంబంధించిన దని మీరు వివరించి యున్నారు. అట్లగుచో

స్త్రీల విషయ మేమిటి? ఒక స్త్రీ వర్ణమును నిర్ణయించగల దేది? వివాహమునకు పూర్వము తండ్రి వర్ణమును, వివాహానంతరము భర్త వర్ణమును స్త్రీ కలిగియుండునని బహుశః మీ రనబోదురు. స్త్రీ యే దశయందును స్వతంత్రరాలు కాదనియు, వివాహమునకు పూర్వము తలిదండ్రులకును, అనంతరము భర్తకును, వితంతువగుపట్ల బిడ్డలకును లోబడి యుండవలసినదే యనియు తెలుపు మనుస్మృతిలోని విపరీత ప్రసిద్ధ వాక్యమును మీరు బలపరతురని భావింప వలయునా?

అదట్లగు గాక. మనది స్త్రీ స్వాతంత్ర్య యుగ మనుటయు, స్వతంత్ర వృత్తుల నవలంబించుచు స్త్రీ పురుషునితో పోటీకి దిగుచుండుటయును యథార్థసంఘటనలే గదా! భార్య పంతులమ్మగా నుద్యోగము చేయుచుండ భర్త వడ్డీవ్యాపారము చేయుచుండుట యీనాడు సామాన్యముగ గన్పించుచున్నది. ఆ పరిస్థితులలో స్త్రీ యే వర్ణమునకు చెందు ననవలెను? వర్ణాశ్రమ ధర్మముల ప్రకారము పురుషుడు తండ్రివృత్తి నవలంబించుచు, తండ్రివర్ణమునకు చెందినవా డగును; స్త్రీయు తండ్రివర్ణమునకు చెందిన దగును. వివాహానంతరముకూడ వా రా వృత్తులనే అంటి పట్టుకొని యుండు రనుకొన దగును. ఐనను పైన పేర్కొనబడిన వారి బిడ్డలు ఆ భార్యాభర్తలలో నెవరి వర్ణమునకు చెందవలసి యుందురు? ఆ బిడ్డలే తమ స్వతంత్ర నిర్ణయముతో నా విషయమును తేల్చుకోదగు నందురా? అటు లనునెడల మీరు ప్రతిపాదించు వర్ణాశ్రమ ధర్మము ప్రకారము పరంపరా వచ్చు వర్ణము గతి యేమగును?"

నే డున్న పరిస్థితులలో ఆప్రశ్నయే అప్రస్తుతమని నా అభిప్రాయము. నేడు వర్ణములు తారుమారై పోవుటవలన యథార్థమునకు వర్ణములే లేవనియు, వర్ణవ్యవస్థ ఆచరణలోనే లేదనియు, పైప్రస్తావనకు తేబడిన నావ్యాసమునందు తెలిపియే యున్నాను. హిందూసంఘముయొక్క ప్రస్తుతస్థితిని అరాజక మనందగును. చతుర్వర్ణము లనునవి నేడు నామమాత్రమేవర్ణ

సిద్ధాంతమునను సరించి వచించు నెడల, స్త్రీలకుగాని, పురుషులకు గాని యీ నాడు ఒక్క వర్ణము మాత్రమే కలదు. మనమెల్ల అము శూద్రులమే !

నా అభిప్రాయము ప్రకారము, పునరుద్ధరింపబడు వర్ణధర్మము ననుసరించి, వివాహాము నకుపూర్వము, ఆడుపిల్ల, ఆమెసోదరుని వలెనే తండ్రివర్ణమునకు చెందియుండును. భిన్నవర్ణముల మధ్య పరస్పరవివాహాము లు అరుదుగా జరుగును. కాబట్టి వివాహానంతరము కన్యలు పూర్వపువర్ణము నేమార్పు లేక కలిగియుందురు. ఒక వేళ వరుడు వేఱువర్ణమునకు చెందినవాడగు సందర్భమున వివాహానంతరమామె తండ్రివర్ణమును విడిచివేసి భర్తవర్ణమును స్వీకరించును. వర్ణము పునరుద్ధరింప బడుయుగమున, నాలుగువర్ణములును సమానప్రతిపత్తి గల్గియేయుండును గాన, వర్ణము మారినంతమాత్రాన ఎవరికిని మచ్చగాని, మనస్తాపముగాని కలుగ నవసర ముండదు.

సాధారణముగా భర్తతో సంబంధము లేని వృత్తిని భార్య అవలంబించునని నేను నిరీక్షించుటలేదు. కుటుంబము నందలి బిడ్డల రక్షణ శిక్షణములు ఆమెయొక్క శక్తి సామర్థ్యములకు పూర్ణముగ పనిగల్పింప గలిగియుండును. చక్కగ నిర్మాణమయిన సంఘమునందు, కుటుంబపోషణ భారము నయితము స్త్రీమీద పడదగదు. పురుషుడు కుటుంబపోషణమును, స్త్రీ కుటుంబనిర్వహణమును పూనవలయును. వారిరువురును ఈ విధముగా పరస్పరము నొండొరులపాలునందు అండగానిలిచి సహకారము నలుపుకొనుచుండవలయును.

ఈవిధానమునందు స్త్రీయొక్క అధికారముమీదికి వండె

తుటగాని, దానినణంచివేయుటగాని సంభవించునటుల నాకు గోచరించుటలేదు. 'స్త్రీకి స్వాతంత్ర్యముండదగ' దని నటుల మనువున కారోపించిన వాక్యము నాతపరమప్రమాణముకాదు. బహుశః ఆశాసనము ప్రచారములోనున్న కాలమున, స్త్రీలు దాస్యదశయం దణంచి పెట్టబడియున్నటుల మాత్రము తెలియ వచ్చును. మనవాఙ్మయమునందు, భార్యను అభివర్ణించుపట్ల వాడబడిన 'అర్ధాంగి','సహధర్మిణి' అనెడు పదములను గమ నించుడు. భర్త తనభార్యను 'దేవి' యని సంబోధించుట అవ మానమును స్ఫురింపజేయుటలేదు. కాని దురదృష్టవశమున స్త్రీ యొక్క అధికార గౌరవములను లాగివేసి, యామెను నీచదశ నాపాదించినకాలము సంభవించినది. అయినను, ఆమెవర్ణమును తృణీకరించు సమస్య ఘటిల్లుటలేదు. ఏమన, వర్ణమనిన నేనిరూ కొన్ని అధికారములు, విశిష్టగౌరవములు అని అర్థముకాదు; విధులు, లేక ధర్మములు మాత్రమే వర్ణమునలను విధింపబడు చున్నవి. మనంతటమనమే ఉపేక్షించి వేసిననేతప్ప, మన ధర్మము నెవడును తొలగించి వేయజాలడు. తనధర్మమును చక్కగ గ్రహించి నిర్వహించు స్త్రీ తన గౌరవపదవిని సాక్షా త్కరింపజేసికొనగలదు. ఆమె అధిష్ఠానము వహించు కుటుంబ మునందు, స్త్రీ రాణియేగాని దాసి కాదు.

నేను పేర్కొని నటుల సంఘమున స్త్రీయొక్క పదవిని అంగీకరించునెడల నామెబిడ్డలు ఏవర్ణమువా రగుదు రను ప్రశ్నను గుఱించి యింతకంటె తెలుపదగిన సమస్యాపరిష్కార మార్గముండదు. అప్పుడు భార్యాభర్తల వర్ణములమధ్య నేలాటి వ్యత్యాసమును సంఘటిలదు.

## 7. స్త్రీ సదా పరాధీనయేనా ?

ఒక స్త్రీరత్నము వ్రాసిన లేఖలోని యంశములు:—

"మహిళా మహాసభలో 'శారదా' బిల్లును గూర్చి చర్చ జరిగినది. బాలికలకు పదునెన్మిది వత్సరములు వివాహార్హమగు వయస్సని మీరు బలపరచి యుండుట ముదావహము. వారసత్వశాసనముం గూర్చి యొక ప్రధాన తీర్మానము జరిగినది. దీనిం గూర్చియు మీరు 'నవజీవన్' పత్రికలో గాని 'యంగిండియా' పత్రికలో గాని వ్రాసియుండిన బాగుండెడిది. తమ 'జన్మహక్కు'ను తిరిగి పొందు కొఱకు స్త్రీలు యోచన చేయుటగాని, పోరాటములు సాగించుటగాని అవసర మేల కావలయును ? స్త్రీగర్భవాసమున నుండి పుట్టిన పురుషుడు 'అబలలం' గూర్చి గంభీరోక్తులు పలుకుటయు, మాకు రావలసిన దానిని మా కిచ్చుటం గూర్చి కృపను సూచించు వాగ్దానములు చేయుటయు విన చాల వింతగా నున్నది. విపరీత భావితమగు వింత చేష్ట అది ! 'మా కిచ్చుటం' గూర్చిన యీ ప్రలాపము లేమిటి? తన చేతులలో పశుబల మున్నది గదా యని అక్రమముగా గుంజుకొనిన దానిని మరల మా కిచ్చుటలో గల ఘనత యేమిటి ? శౌర్య మేమిటి? పురుషులకంటె స్త్రీలు ఎందులో ప్రాధాన్యత తక్కువవారు ? పిత్రార్జిత సంపదలో వారి కీదగు భాగము పురుషుల కిడుదానికంటె తక్కువనుట యేల ? సమానముగా నెందుల కుండ దగదు ? ఈ యంశముం గూర్చి రెండు దినములుగా మే ముద్రేకోత్సాహములతో చర్చ సాగించు చుంటిమి. ఒక భాగ్యశాలి యిట్లున్నది:— 'మనకై శాసనములో మార్పు ననవసరము. మనము సంతుష్టుల మయియే యున్నాము. వంశ సంప్రదాయమును, పేరును నిలుపు నట్టి కుమారుడు హెచ్చు భాగమును దీసుకొనుట న్యాయమే గదా ? అతడు వంశమునకు మూలాధారము, బాలికం గతేమిటి ?' అన్నాము. అందున్న వెన్నెలా డొకడు అవచ్చేవాడు ఆ పిల్ల వివాహము చూచుకొనును.' అని అడ్డు చెప్పినాడు. ఉన్న విషయ మిది ! ఆ వచ్చేవాడా ! అన్నిటికిని ఆ వచ్చేవాడే ! ఆ వచ్చేవాడే యిన్ని

సంకటాలకు హేతువు. ఇంకొక డెవడో వచ్చునని నిరీక్షింపనేల? వేరొక డెవడో వచ్చును గదా యని భవిష్యత్తు చూచు టెందులకు? ఎవడో వచ్చే దాకా వేచియుండి వాని కప్పగించివేసి, బరువు తీరె గదా యని నిట్టూర్పు పుచ్చు తరుణము వచ్చువరకు తండ్రి యింటిలో పడియుండి సంగీకరింపబడ వలసిన సరకులమూట వంటిదే కూతు రనునట్లు మాటలాడుదురా! మహాత్మా! మీరే యొక బాలికరై పుట్టినచో ఎంతటి యాగ్రహము పడియుందురో!"

స్త్రీయెడ పురుషుడు కావించు అత్యాచారములంగురించి ఆగ్రహపడుటకు నేను బాలికనై పుట్టవలసిన అవసరము లేదు. ఆజాబితాలో వారసత్వశాసనము చాల కొద్దిదిగా లెక్క వేయుదును. ఈవారసత్వశాసనమువలన మూడుచున్న యనర్థముకంటె గొప్పయనర్థమును బాపుటకే శారదాబిల్లుయత్నించుచున్నది. స్త్రీలహక్కుల విషయములో నేను రాజీలకు ఒప్పుకొనువాడను గాను. శాసనసందర్భమున పురుషుని మించి స్త్రీ హెచ్చు అనర్హతలుగలది కాకూడదనియే నా అభిప్రాయము. కొడుకులను, కూతుళ్లను సరిసమానముగా చూడవలయునని నావాదన. స్త్రీలు తాము పొందు విద్యాభ్యాసమునకు అనురూపమైన బలమును సంపాదించుకొనునప్పుడు, తమపైని బడ వేయు ఘోరమగు భేదదృష్టిని గుర్తించి సహజముగా రోషగించి పరిహారము సాధింపగల్గుదురు.

అయినను శాసనసంబంధమగు తారతమ్యములను తొలగించు స్వల్పమగు ఉపశాంతి మాత్రమే. ఈ అనర్థముల మూలము చాలలోతున నున్నది. చాలమంది దీనిని కనిపెట్టలేకున్నారు. అది పురుషుని అధికారవ్యామోహమునందును, కీర్తికామమునందును, అంతకంటెనుకూడ, పరస్పర మత్సరము

లందును అంతర్గతమైయున్నది. పురుషుడు సదా అధికారపిపాసి. ఈఅధికారము సంపదవలన లభ్యమగుచున్నది. తన అధికారము ద్వారా గడించుకోగల మరణానంతరఖ్యాతికై పురుషు డారాటపడుచున్నాడు. తన సంతానమంతయు సమముగాపంచు కొనునెడల, తనయాస్తి యంతయు పోనుపోను భిన్నాభిన్న మగును గాన అట్టిది వానికి హితవుగాదు. కాబట్టి చాలవఱకు వారసత్వపుసొమ్ము జ్యేష్ఠపుత్రునికి సంక్రమించుట యేర్పాటైనది. స్త్రీలలో అధిక సంఖ్యాకులు వివాహితలు. శాసనము తమ కెంత ప్రతికూలముగా నున్నను, అధికారములను, విశిష్టగౌరవ పదవులను తమ భర్తలతోపాటు భార్యలు పంచుకొనుచునే యుందురు. ఆయాప్రభువుల భార్యలయిన కారణముచేత, తా మింతవారంతవారమని మురిసికొనుచుందురు. విభేదముల గుఱించి సభాచర్చలలో సంపూర్ణముగ పరివర్తనము కావలయు నని తమ అభిప్రాయముల నొసగుచుండిరను, ఆతమ అభిప్రాయాను గుణ్యముగ వర్తింపవలసివచ్చునెడల, తమకు సంక్రమించియున్న ప్రత్యేక గౌరవాధిక్యతలను త్యాగముచేయుట కొడంబడరు.

కాబట్టి శాసనసంబంధమున తారతమ్య విభేదములన్నియు తొలగి పోవలయు ననియే నేను వాదించు వాడనైనను, వివేకవతులగు హైందవనారీమణు లెల్లరును మూలకారణమును తొలగించు ప్రయత్నమును పూనుకోవలయు నని నాకోరిక. స్త్రీయనగా త్యాగ సహనములు మూర్తీభవించిన వ్యక్తి; అందువలన ఆమె ప్రజాసేవకు గడంగినపట్లు, సంఘము పవిత్ర తరము కావలయును. కృష్ణుని కర్మము తగిలించి లాగిపట్ట

వలయును; సంపదరాసులేర్పడు నవకాశముండరాదు. లక్షలాది పురుషులకు తమ సంతానమున కీయగల ఆస్తియే లేదని స్త్రీలు గ్రహింత్రుగాక. కావున వీరి స్థితిని గమనించి పితరులనుండి వారసత్వముగా పొందగల సొత్తు మిగతా కొలది మందికి గూడ లేకుండుటయే మంచిదని గ్రహింతురు గాక. పితరులు తమ సంతానమునకు సమముగా పంచియీయగల యథార్థపు ధనము తమశీలమును, తమకుగల విద్యార్జనావసతులు నేసుడీ! తలిదండ్రులు తమ కొడుకులను, కూతురులను స్వయంపోషకసమర్థులుగను, చెమటనోడ్చి తమజీవనోపాధిని సంపాదించుకొనగలవారినిగను చేయుటకై కోరుచుండవలయును. అప్పుడు వయసురానిబిడ్డలను పెంచవలసినబాధ్యత వయసువచ్చిన సంతానముపై సహజముగ పడుచుండును. పిత్రార్జితధనమో సాహసమును చంపును! సోమరితనమును భోగవాంఛను పెంచి కామోద్రేకమును రగుల్చును. కావున శ్రీమంతులు తమ బిడ్డలను పిత్రార్జిత సంపదకు దాసులగావింపవలయు నను తుచ్ఛవాంఛలవిడనాడి, స్వతంత్రులను గావింపవలయునను పవిత్ర సంకల్పములను బూనుదురుగాక. తర తరములనుండి వచ్చుచున్న యనర్థములను రూపుమాపుటను వివేకవతులగు నారీమణులు తమ విశిష్టధర్మముగ పాటింత్రుగాక.

స్త్రీపురుషులకు ఒండొరులయెడగల మోహము, స్త్రీలు నీచత్వారోపణకు పాలగుటకు గొప్పకారణమయినదని రుజువు చేయ బూనుటంతగా నవసరము లేదు. స్త్రీ తనకు తెలియకుండనే, తన చాతుర్యమువలన అనేక విధముల పురుషుని

మోహము నణుచుచున్నది; పురుషుడును స్త్రీకి వశపడి పోకుండ తప్పించుకొనుటకై తనకు తెలియకుండను, వ్యర్థముగను పెనగులాడుచున్నాడు. ఫలితార్థమో పరస్పరబంధము. ఈ విధముగా విమర్శించుకొనునెడల, భారత మాతనొక్క పత్రికలలో విజ్ఞానవంతులగువారు పరిష్కరింపవలసిన యీ సమస్య చిక్కులో పడుచున్నది. వారు పాశ్చాత్యుల పద్ధతులను అనుకరించుటతగదు. వారిపద్ధతులు వారిపరిస్థితుల కనుసరణము లైనవి. వీరో హైందవ సంస్కృతికిని హైందవవాతావరణము నకును సరిపడు విధానముల ననుసరింపవలసియుండును. మన సభ్యతలో శ్రేష్ఠమగు నంశములను సంరక్షించుచు, నీచమును, భంగకరమునగు సర్వమును త్రోసిపుచ్చుచు, బలిష్ఠమును, సమర్థమును, సుస్థిరమును, శుద్ధికరమునగు హస్తములతో పూనిక వహించవలసియుండును. ఈకార్యము చేపూనుటకు సీతలు, ద్రౌపదులు, సావిత్రులు, దమయంతులునే తగుదురు. ఇటు నంగనాచులుగాని, అటు సంగరప్రియులుగాని తగరు.

## 8. స్త్రీలయెడ నిరాదరణ

శ్రీమతి సరళాదేవి కటకము నుండి వ్రాసిన యంశము:—

"స్త్రీలయెడ చూపబడు నిరాదరణ అస్పృశ్యతాచారముతో సమానమగు వ్యాధియేయని మీ రంగీకరింపరా? నాకు పరిచయము గలిగినట్టియు 'జాతీయ వాదు' లని పిలువబడుచున్నట్టియు స్త్రీలయెడ చూపబడు యువకుల వైఖరి నూటికి తొంబదిమంది సందర్భములలో మృగప్రాయ మనవచ్చును. భారత దేశమునందలి 'సహాయనిరాకరణ' పరులలో స్త్రీలను తమ భోగవస్తువుగా చూడనివా రెంద రుందురు? స్త్రీలయెడ తమవైఖరిని మార్చుకొననిది విజయ సాధనకు ప్రధాన నియమ మగు ఆత్మపారిశుధ్యము సుసాధ్యము కాగలదా?"

స్త్రీలయెడ చూపబడు వైఖరి అస్పృశ్యతాచార మంత ఘోరవ్యాధియనుటను నే నొప్పుకొనజాలను. శ్రీమతి సరళా దేవి ఆయనర్థమును మిగుల నతిశయోక్తితో వర్ణించుచున్నది. సహాయనిరాకరణపరులు కేవలము కామోద్రేకులను నిందయు నిలుచునదికాదు. అతిశయోక్తులు అసలువాదమునకే భంగము తేగలవు. మనము యథార్థమగు స్వరాజ్యమును కర్హాలము కావలయు ననిన స్త్రీలయెడను, వారి పవిత్రతయెడను నిప్పటి కంటె హెచ్చగు నభిమానమును జూపు టవసర మను ప్రతిపాదనను నే నొప్పుకొనుటలో కష్టము లేదు. మన పతితసోదరీ మణుల లజ్జాకరదశనుగూర్చి మురిసిపో సాహసింపజాలమని ఆండ్రూసు మహాశయుడు హెచ్చరించుచో వాడిన తీక్ష్ణతర వాక్యములు ఈనారీమణి ప్రయోగించిన వాక్యములకంటెను యథార్థ భావమును తెలుపుచున్నవి. దుర్నయులగు సోదరీ మణులలో కొందరు ప్రత్యేకముగా సహాయనిరాకరణపరులను వరింపనుండిరని మురిపెముతో చెప్పుకొనజూచు సహాయనిరాకరణవాది యెవడేని యుండగల డనుటే మహాపాతకపు తలంపు! మన నైతిక క్షేమమును గుఱించిన యీ యత్యంతప్రధాన విషయమునందు సహకారవాదులకు, సహాయనిరాకరణవాదులకు నడుమ తారతమ్యమంతగా నుండజాలదు. మనకామమున కాహుతి కానొడంబడు నొక్క స్త్రీ దొఱుకగలంతకాలము పురుషులము యావన్మందియు తల వంచుకొనవలసినదే సుడీ! ఈశ్వరసృష్టిలోని ఈ మహాపవిత్రజీవులను పురుషులకామతృప్తి నిమిత్తము వినియోగించుకొనుటవలన పశువులకన్న నీచతర దశకు కూలిపోవుటేగాక పురుషజాతియే రూపుమాసిపోవుటయు

నాకు హితవుగతోచును. కాని, యిదియొక భారతదేశమునకే సంబంధించిన సమస్య కాదు. ఇది ప్రపంచసమస్యగానున్నది. ఇంద్రియభోగముల పెంచు ఆధునిక కృత్రిమజీవనమునకు పరిహారముగా నేను చేయు బోధలందు రాటము సూచించు నిరాడంబర జీవితమునకై స్త్రీపురుషులను మరలుడని కోరుచున్నాను. తెలివితేటలతో మన మాటల నిరాడంబర జీవనమునకు మరలని యెడల మృగములకన్నను హీనతరస్థితికి పడిపోకుండ మనల రక్షింపగల దేదియు నుండజాలదని నే నెరుంగుదును. మన స్త్రీజనమునకు పరిపూర్ణస్వాతంత్ర్య ముండవలయుననియే నా యీప్సితము. బాల్యవివాహము లనిన నాకసహ్యము. బాలవితంతువు కండ్లబడినచో నేను వణకిపోవుదును. భార్య చనిపోయిన తోడ్తోడనే నిర్విచారముగా పశువువలె మరల వివాహమునకు సిద్ధపడు పురుషుని గాంచినప్పుడు నాకు కినుక పొడముును. తమకొమరితలను అక్షరజ్ఞానమేని లేకుండజేసి బొత్తుగ మూఢావస్థలోనుంచుచు, డబ్బుగల యువకుడు దొరకినంతనే వానికిచ్చి పెండ్లిచేయునిమిత్తమే వారిని పెంచు తలిదండ్రుల క్షంతవ్యముగాని యశ్రద్ధనుచూడ నాకెంతయు ఆవేదన కలుగుచుండును. నా కెంత దుఃఖము కలిగినను, నా కెంత కోపము వచ్చిననుకూడ ఈసమస్యయందుగల కష్టమును నయితము నేను గుర్తించుచునేయున్నాను. స్త్రీలకు వోటిచ్చు నధికారము రావలయును; శాసనవిషయమున వారికి సమాన ప్రతిపత్తికలుగవలసినదే. అయినను అంతటితో సమస్యాపరిష్కారము కాజాలదు. జాతియొక్క రాజకీయములందు

స్త్రీలు ప్రమేయము దీసికొన మొదలిడు దశమాత్రమే అందు వలన నారంభము కాగలదు.

నా అభిప్రాయమున కుదాహరణగా, అనుభవజ్ఞుడగు నొక ముసల్మాను మిత్రుడు నాకు దెలిపిన కథను తెలిపెదగాక. లండనులోని యొక సుప్రసిద్ధ స్త్రీ స్వాతంత్ర్యవాదితో జరిగిన తన సంభాషణను గురించి ఆయన చెప్పియున్నాడు. అటువంటి సమావేశమున కొక ముసల్మాను వచ్చుటజూడ ఆ మిత్రురాలి కాశ్చర్యము తోచినది. ఆయన ఆచోటికి రానెట్లు ఘటిల్లెనని యామె విచారించినది. అందుకు రెండు పెద్ద కారణములును, రెండు చిన్న కారణములును గలవని ఆ మిత్రుడు చెప్పియున్నాడు. ఆయన పసివాడుగా నుండగనే వానితండ్రి దివంగతుడైనాడు. వాని జీవిత యోగక్షేమమంతయు తల్లియాధారమున చేకూరినదియే. పిమ్మట యథార్థముగా తన సహధర్మచారిణి కాగల స్త్రీని వివాహము చేసుకొనినాడు. వానికి కొడుకులు లేరు. నలుగురు కూతుళ్లు మాత్రము గలరు. వారందరు మైనర్లు. వారిక్షేమము నతిజాగరూకతతో నతడు చూచుచుండును. అట్టియెడ నాయన స్త్రీ స్వాతంత్ర్యవాది యగుటలో వింతయేముండును? ఆయన నింక యిట్లనెను:— 'ముసల్మానులు' స్త్రీలయెడ నుదాసీనులుగ నుందురను నింద గలదు. ఇంతకన్న ఘోరాపవాదుండబోదు. ఇస్లాము శాసనము స్త్రీ పురుషులకు సమానహక్కుల నంగీకరించుచున్నది. పురుషుడు తన కామతృప్తికై స్త్రీనధోగతి పాలుచేసెనని ఆ మిత్రుని అభిప్రాయము. ఆమెయందలి ఆత్మను ఆరాధించుటకు మారుగా పురుషుడు ఆమె శరీరము నలంకరించుటకు

వ్రాసినాడు. వాని తంత్రము ఫలించినది. స్త్రీయు ఆశరీరాలంకారములు తన బానిసతనమునకే చిహ్నమని యెఱుంగక వానితోడనే ముఱిసిపోసాగినది. అటుల కానిచో మన పతిత సోదరీమణులు తమశరీరాలంకారములకై ముఱిపెము చెందు టెట్లు సంఘటిలినదని నిరుద్ధస్వరముతో ఆయన ప్రశ్నించుచున్నాడు. మఱియు పురుషులమగు మనము వారియందలి పవిత్రాత్మను నలగద్రొక్కివేసితిమిగదా యనుచు, వెంటనే ధైర్యము తెచ్చుకొని, స్త్రీలపై మనము పడవేసిన బానిసతనము నేగాక బుద్ధిపూర్వకముగా నామెయు దెచ్చుకొనిన బంధముల సయితము తెగద్రెంచుకో వలయునను తనకోరికను తెలిపినాడు. కాబట్టి తనకొమార్తెలకు స్వతంత్రజీవనోపాధిని నేర్పుట కాయన సంకల్పించినాడు.

ఈ గంభీర సంభాషణము నింకను నేను తెలుపు నగత్యముండదు. ఈ ముసల్మానుని సంభాషణమందలి ప్రధాన సంకల్పమును గుర్తెఱిగి, తదనుగుణ్యముగా ఈసమస్యను చేబూనుమని నా కుత్తరము వ్రాసిన నారీమణిని కోరుచున్నాను. తాను పురుషుని కామతుష్టి సాధనమను తలపును స్త్రీ త్రోసివుచ్చగా వలయును. అందుకు వలయు పరిహారము పురుషుని చేతిలోకన్న స్త్రీచేతిలోనే యున్నది. పురుషునితోడి సమానభాగస్వామినిగా నుండ సంకల్పించునేని, స్త్రీ తన భర్తతో సహా పురుషులప్రీతి కొఱకై అలంకారములను ధరించుటను తిరస్కరింపవలయును. సీత తన శరీరసౌందర్యముతో రాముని ప్రీతుని చేయుకొఱకై యొక్క క్షణమేని వ్యర్థముగా గడపెనని నే నూహింపనైన జాలను!

## 11. స్త్రీల ఆర్థిక స్వాతంత్ర్యము

ప్రశ్న:—వివాహితలయిన స్త్రీలకు ఆస్తిపై గల హక్కుల సంబంధమగు శాసనమును మార్చుటనిన కొందఱు ప్రతిఘటించుచున్నారు. స్త్రీలకు ఆర్థిక స్వాతంత్ర్యము లభించినయెడల స్త్రీలలో దుర్నీతి ప్రబలుననియు, సాంసారిక జీవనము భగ్నమగుననియు వారు వాదింతురు. ఈ సమస్యపైని మీ యభిప్రాయ మేమి?

ఉత్తరము:— ఎదురు ప్రశ్న వేయుట మూలమున నేను ప్రశ్నకు జవాబిడుదు గాక: పురుషుని స్వాతంత్ర్యమును మఱియు ఆస్తియందు వానికిగల హక్కును, పురుషునిలోని దుర్నీతికి హేతువేనా? నీవు 'అవును' అందువా, స్త్రీల సందర్భమునను అటులనే యనుకొనుము. పురుషులకు వలెనే స్త్రీలకును స్వామ్యము మున్నగు హక్కు లుండునెడల ఆ హక్కుల యనుభవము వారి సద్వృత్తులకుగాని, వారి దుర్వృత్తులకు గాని మూలము కాజాలదని గ్రహింపగల్గుదుము. ఒక పురుషునియొక్క గాని, స్త్రీయొక్క గాని శీలము నిస్సహాయతపై నాధారపడియుండునెడల దాని మహాత్త్వ మంతగా గణింపదగినదే గాదు. నీతివర్తనమునకు మన హృదయ నైర్మల్యము మాత్రమే మూలాధారమై యుండ దగినది.

## 12. సంఘమున స్త్రీ అగ్రస్థానము

ప్రశ్న:— భారతస్త్రీలకు గలిగిన రాజకీయ పరిజ్ఞానము, పారంపర్యముగా వచ్చుచున్న వారి సాంసారిక విధులకును, సంఘమునెడ వారి కేర్పడిన కర్తవ్యమునకును వైరుధ్యమును కల్పించినది. ప్రజా కార్యములందు స్త్రీ పాల్గొనునెడల తన బిడ్డలను, తన గృహకృత్యములను ఆమె యుపేక్షింపవలసి వచ్చును. ఈ సందిగ్ధావస్థ తొలగు టెటు?

ఉత్తరువు:— ఆమెకు నాథుడును, యజమానియు నగు పురుషుని సుఖము కొఱకును, మఱియు తన యాడంబర వేషముల సమకూర్చుటకును స్త్రీ తన కాలమును తఱచుగా వ్యయము చేయుచుండును. కాని, ప్రధానములగు తన గృహ ధర్మముల నిర్వాహణముకొఱ కటుల చేయుచుండుటలేదు. స్త్రీ యొక్క ఈలాటి గృహదాస్యవృత్తి నా దృష్టిలో మనమూర్ఖ దశకే లక్షణముగ కాన్పించుచున్నది. వంటయింటిలోని బానిస తనము, నా అభిప్రాయములో ప్రధానముగా గతమూఢదశ యొక్క శిథిలశేషాంశమని తోచుచున్నది. ఈ పురాణవ్యాధి నుండి మన స్త్రీ జాతికి విముక్తి చేకూర్చుటలో నాలసించు చున్నాము. గృహనిర్వాహణము స్త్రీయొక్క కాలమునంతను నపహరింపదగదు.

ప్రశ్న:—ఎన్నికల సమయమున మీ కాంగ్రెసు గోత్రులు వివిధ రీతుల సహాయపడు డని మమ్ము కోరుచున్నారు. కాని, ప్రజాసేవలో మాతో గూడి పనిచేయుటకై తమ భార్యలను, తమ కొమార్తెలను బంపుడని మేమడుగుచో అన్ని తెఱగు లగు సాకులు తెలుపుచుందురు. మఱియు వారిని తమ యింటి నాలుగు గోడల మధ్యను ఖైదులో బిగించి యుంచగోరుదురు. దీనికి మీరు తెలుపు పరిహార మేమిటి?

ఉత్తరము:— అటువంటి పూర్వ ప్రళయ కాలమునకును ముందునాటి తాతయ్యల పేరులను నాకు వ్రాయుచో హరిజన పత్రికయందు ప్రకటింతును.

### 13. వితంతువు యొక్క అగచాట్లు

ప్రశ్న:—నే నొక బంగాళీ బ్రాహ్మణ వితంతువును. నా వైధవ్యము మొదలు ఈ యిరువది నాలుగు సంవత్సరముల కాలము అహార నియమములను

కఠినముగ పాలించితిని. నా స్వంత కుటుంబములో సయితము వితంతువు నగు నాకు ప్రత్యేకపు వంటసాల, ప్రత్యేకపు పాత్రసామగ్రి కలవు. నాకు మీ సత్యాహింసల యాదర్శము మీద విశ్వాసము కలదు. 1930 నుండి నేను ఖద్దరునే ధరించు నలవాటు గలదానను. విధిగా నూలు వడుకుదును. ఢాకాలోని యొక హరిజనవాడయందు మా మహిళాసమాజమువారు హరిజన పాఠశాల నొకదానిని నెలకొలిపిరి. నేను స్వేచ్ఛగా నా ముసల్మాను సోదరీలతో కలిసి మెలిసి యుందును. వారియెడ నాకు సద్భావము తప్ప యితరము లేదు. ఐనను హరిజనులతో గాని, లేక యే బ్రాహ్మణేతర వ్యక్తితో గాని సహపంక్తిని భోజనము చేయజాలకున్నాను. బహిరంగ ప్రచారములో దిగిగాని, లేక స్థానము నుండి కదలకుండగాని నావంటి పూర్వాచారపరాయణి యగు వితంతువు సత్యాగ్రహిగా చేర వలనుపడునా ?

ఉత్తరము :— కాంగ్రెసు నిర్మాణము ననుసరించి మీరు రెండుచేరుటకు సంపూర్ణాధికారమున్నది. మీరు మీహక్కులను బలాత్కారముగా నైనను భుక్తము చేసికొనదగును. కాని, మీరు నన్నడుగుచున్నారుగాన అటుల చేరవలదని హెచ్చరించెదగాక. తమపైన ఆచారము విధించిన నియమములను పాటించుటలో బంగాళా దేశపు వితంతువు లెంత పట్టుదల జూపుదురో నే నెఱుంగుదును. కాని, దేశసేవ కర్పణ చేసికొనిన వితంతువులు, అందునను దౌర్జన్యరహితముగా వర్తించువారు ఎవరితోడనైనను కలిసి భోజనము చేయుటలో సంకోచింప దగదు. ఎట్టివారితోగాని కలిసి భోజనముచేయుటవలన ఆధ్యాత్మికాభివృద్ధి నష్టపడునని నేనునమ్మువాడనుగాను. మన యుద్దేశ్యమునుబట్టి ఆవిషయము నిర్ణయింపదగియుండును. ఒకవితంతువు ప్రతికార్యమును సేవాభావముతో చేపట్టునెడల నది యామెకు క్షేమకరమగును. భోజనముపట్లను, మత్రి

ఇతరవిషయములనట్లను అన్నినిబంధనలను అతిజాగరూకతతో
లోకవితంతువు పాటింపదగును. ఐనను పవిత్రహృదయము
ఘోషించునెడల నామె, యథార్థమగు వితంతువు కాజాలదు.
చూపులకు మాత్రము సంఘాచారముల నన్నిటిని పాలించుట
తలచుచుగా మిథ్యాచారములను మోసములను కప్పిపుచ్చుటకే
ఉపయోగపడునని నాకేటుల తెలియునో, మీకు నటులనే
తెలియును. కాబట్టి భోజనప్రతిభోజనములు మొదలగు వానిం
గూర్చిన యాటంకములను ఆధ్యాత్మికముగను, జాతీయముగను
పురోవృద్ధి కాటంకములని విసర్జించివేసి హృదయపావిత్ర్యసాధ
నపై దృష్టిని కేంద్రీకరించుడనియే మీకు నా సలహా. సత్యా
గ్రహదళములందు స్వాహంకారపూర్ణులగు వారుండుటకన్న
తనువివేకము నుపయోగించి హృదయమునకును, మస్తకమున
కును ఆమోదకరమగు జీవనవిధానమును పూనువారుండుట
నాకు సంతోషము.

8-11-44

ది ఓరియంట్ పవర్ ప్రెస్, తెనాలి.